



# ప్రతి నీటి బొట్టును వినియోగిద్దాం
# సమృద్ధిగా దిగుబడులు సాధిద్దాం

మైక్రో ఇరిగేషన్ ప్రాజెక్టు
క్రింద రూ. 1120 కోట్లతో
2.5 లక్షల హెక్టార్లలో
డ్రిప్ ఇరిగేషన్ మరియు
ఇతర సేద్యపు సౌకర్యాలు

జారీచేయువారు: సమాచార పౌరసంబంధాల శాఖ



# హాసం

హాస్య-సంగీత పత్రిక

## ఇదీ సంగతులు

56

Also available on net:
www.haasam.com



ముఖచిత్రం
ప్రభాస్

## హాస్యం — సంగీతం



'సెంటర్ స్ప్రెడ్' లో




సినిమా పాటల పుస్తకం





పాటల ప్రత్యేకం

67,68,69, 70,71 పేజీల్లో






1-15 జనవరి 'హాసం'లోని పొత్తూరు విజయలక్ష్మిగారి "రావోయి చందమామా..." కథ చదువుతుంటే ఈ కథను పోలిన వాస్తవగాథలు రెండు గుర్తొచ్చాయి.

'దిలీప్ కుమార్‌తో పెళ్లి కుదిరిస్తే ఆస్తంతా రాసిస్తాను' అని అందర్నీ అడుగుతూ, ఆ కోరిక తీర్చే వాళ్ల కోసం అన్వేషిస్తూ జీవితాంతం పెళ్ళి చేసుకోకుండా దిలీప్ కుమార్ కోసమే జీవించిన ఒక మహిళ (పరమశుద్ధ తెలుగు మహిళ) గురించి చిన్నప్పుడు విన్నాను. అప్పుడు చిన్నతనం కొద్దీ ఆవిడ గురించి మరీ మరీ చెప్పించుకుని తెగ నవ్వుకునేవాళ్ళం.

తరువాత దూర్‌దర్శన్‌లో సురభి కార్యక్రమం వచ్చే రోజుల్లో ఒక ఎపిసోడ్‌లో ఒక ముంబాయి మహిళని చూపించారు. ఈవిడ ప్రతి రోజూ రెండు పూట్లా మీనాకుమారి పటానికి పూజచేసి ప్రసాదాలు పంచిపెడుతూంటుంది.(ఇక్కడ దేవత, పూజారి ఇద్దరూ మహిళలే కాబట్టి పెళ్ళి ప్రసక్తి లేదు).

సురభి ఎపిసోడ్ నాటికి అన్నిటికీ తెగ నవ్వొచ్చేసే చిన్నతనం నాకు వదిలిపోవడం వల్ల ఆ ఎపిసోడ్ చూసినప్పుడు నాకు నవ్వురాలేదు. చాలా బాధొచ్చింది. ఎవరైనా ఇంత అభూత కల్పనల్లో ఇలా ఎలా, ఎందుకు బతకగలుగుతారు? అన్న ప్రశ్న నన్ను చాలా ఇబ్బంది పెట్టింది.

పొత్తూరి విజయలక్ష్మిగారి కథ చదువుతుంటే ఆనాటి ఆలోచనలు మళ్లీ తిరిగొచ్చాయి. అప్పటి ప్రశ్నకు చిన్న జవాబు దొరికినట్టనిపించింది. నేను పైన చెప్పిన ఇద్దరు మహిళలు, కథలోని బాబాయ్, అత్తయ్య, ఇంకా ఇలాంటి ఎందరో ఆవగింజంతయినా ఆదరణ, అభిమానం లభించని ప్రేమరాహిత్యంలో బతుకుతుంటారు బహుశః వాస్తవ జగత్తులో దొరకని ఆ ఆదరణేదో వెతుక్కునే ప్రయత్నంలో అది వాస్తవిక లోకంలో అది దొరుకుతుందన్న భ్రమ కొద్దీ వీళ్ళు ఇలా ప్రవర్తిస్తూ ఉండవచ్చు. ఇలాంటి వాళ్ళకి కుటుంబంలోను, సమాజంలోనూ రెండే రకాల మనుషులు తటస్థపడుతుంటారు. "వెధవా, పిచ్చివేషాలెయ్యకు" అని తిట్టే వాళ్ళు, "వీడో పిచ్చి వెధవవరా!" అని నవ్వేవాళ్ళూను. అంతేకానీ ఈ కథలో 'రమ' లాగా వాళ్ళనీ మామూలు మనుషుల్లాగా ట్రీట్ చేసి వాళ్ల ప్రవర్తన మారుద్దాం అని తపన పడే వాళ్ళు అరుదుగా ఎదురవుతారు.

ఈ కథలో రమ ఇచ్చిన సలహాల్లో హేతుబద్ధం కంటే, అసలంటూ తమని మామూలు మనుషుల్లా చూసి, భ్రమల్లోంచి బయటపడేందుకు చిన్న ఆలంబన చూపించిందన్న పాయింటు లొంగదీసి ఉంటుంది బాబాయ్‌నీ, అత్తయ్యనీ.

ఈ కథ బావుంది. నవ్వించినందుకే కాదు రమలాంటి ఇల్లాలి పాత్ర సృష్టించినందుకు. అత్తవారింట్లో మనుషులందరూ తన వాళ్ళేనని, అభిమానించి (తన స్వార్థం కోసమే అయినా), ఇంటినే కాక ఇంట్లో వాళ్ళనీ తీర్చిదిద్దుకుని ఇంట గెలిచి, ఇల్లు రచ్చయి పోకుండా కాపాడే ఇల్లాళ్లు ఏ సమాజానికైనా అత్యవసరం.

రచయిత్రి ఏ ఉద్దేశంతో వ్రాసినా, మీరు 'సరదాకథ' అని వ్యాఖ్యానించినా నేను మాత్రం ఈ కథని సరదా పరదా కప్పుకున్న విషాద గాథ అంటాను. రచయిత్రి, 'హాసం' అభినందనీయులు.

**-పోడూరి కృష్ణకుమారి,(రచయిత్రి)హైదరాబాదు**

'హాసం'తో నాది ఏడు సంచికల అనుబంధం. బాపు కుంచె నుంచి జాలువారి సినీ-సాహితీ విలువల సముద్ధరణ కొరకు మెరిసిన భాషా సరస్వతీ - 'హాసం'. సంచికలోని శీర్షికలు ఎంతో ఆసక్తికరంగా ఉన్నాయి. భావం అక్షర రూపం దాల్చటం చాలా కష్టతరము. అక్షరం భావాల దోబూచులాటకు తెరతీస్తుంది. ఇటువంటి భావనలకు ప్రేరణ కలిగిస్తున్న మీ అక్షరయజ్ఞం ఉత్తమ రచయితలను సినీ-వినీలాకాశానికి అందించాలని ఆకాంక్షిస్తున్నాను. గత సంచికలో మీరు ప్రచురించిన చాప్లిన్ వేషధారుల ఫొటో - ఆ హాస్య సామ్రాట్టుకు మీరు అర్పించే నిజమైన నివాళి.

**-తెలికేపల్లి.ఉమామహేష్‌కుమార్,ఒంగోలు**

మీ'హాసం' పత్రికను మా 'హాసం' పత్రికగా చెప్పుకుంటున్నాను. కారణం నేను మద్రాసులో రెండేళ్ళ క్రితం పద్మనాభం గారిని కలిసాను. ఆనాటి పాత విషయాలు తెలుసుకోవాలని వారిని కదిపాను, "దేవత చిత్రాన్ని మీరు నిర్మించారు కదండి, ఆ చిత్రానికి మీకు ఎంత ఖర్చు అయిందం"టే "నాలుగు లక్షల ఏభైవేలు" అని చెప్పారు! 'ఘంటసాల గార్కి ఒక్క పాటకు ఎంత ఇచ్చారు' అని అడగ్గా 'ఐదువందలు' అన్నారు. 'మరి కోదండపాణి గార్కి ఎంత' అన్నాను 'ఐదువేలు' అన్నారు. ఇలా ఎన్నో విషయాలు అడిగాను. "ఆసక్తికరంగా మీకు పూర్తి వివరాలు కావాలంటే 'హాసం' చదవండి" అని అన్నారు పద్మనాభం. అనుకోకుండా 'హాసం' పత్రికను చూసి చాలా విషయాలు తెలుసుకోగలిగాను, పద్మనాభం గారి "ఆత్మకథ" చదివి ఈ లెటరు వ్రాస్తున్నాను. అందరూ మీ పత్రిక మొదట్నుంచి పాఠకుణ్ని అంటారు, కానీ నేను చివరివరకు 'హాసం' పత్రిక పాఠకుణ్ణి.

**-అనుపోజు భాస్కరరావు,ఏలూరు.**

'హాసం'హాస్య సంగీత పత్రిక విడుదల సంచిక నుండి ప్రతీ సంచికలో ప్రతీ చదరపు సెంటీమీటరులో హాస్య,సంగీత,సాహిత్య విలువలు సంతరించుకున్నాయని అనడంలో సందేహంలేదు. ఏ పత్రిక మనుగడకైనా ఆర్థిక పరిపుష్టి కావాలి. అందుకు కొన్ని ప్రకటనలు ప్రచురించక తప్పదు. అయితే రెండు సంచికల్లో శీర్షికలు స్పాన్సర్ చేయని వారి ప్రకటనలు చాలా చోటు చేసుకున్నాయి. అందువలన ఆ పేజీల్లో రావలసిన ఎన్నో సంగీత సాహిత్య సమాచారాన్ని కోల్పోయామని అనిపిస్తోంది. పత్రిక ధర రెండురూపాయలు పెంచండి ఫర్వాలేదు గాని ప్రతీ పేజీలో సాహిత్య, సంగీత హాస్యపు మేఘాలు అలముకొని మాలో ఆనంద భాష్పాలు కురిపించాలని ప్రార్థిస్తూ, ధరపెంచినా 'హాసం' అభిమానులు వ్యతిరేకులు కారని అందరి తరపున నా హామీ.

**-తెలికిచర్ల రామకృష్ణ,విజయనగరం.**

1-15 జనవరి 2004 నాటి 'హాసం' హాస్యసంగీత పత్రికలో పాటలు ప్రత్యేకం శీర్షికన మీరందించిన "శ్రీకృష్ణార్జునయుద్ధం" చిత్రంలోని మరపురాని మధుర గీతాలను చూడగానే మనసు పరిమళించి తనువు పరవశించింది. తెలుగు వారి హృదయాల్లో మణి దీపాలై వెలుగొందిన అగ్రనటులు - అక్కినేని, ఎన్.టి.ఆర్‌ల పోటా పోటీ నటన ఆంధ్రుల హృదయాలలో అజరామరమై నిల్చిఉంటుంది. రసరమ్యమైన పాత హిందీ, తెలుగు, తమిళ గీతాలు అందిస్తున్న 'హాసం'కు అభివందనాలు.

**-దోవారి నాగేశ్వరరావు,వేకనూరు,కృష్ణాజిల్లా**

హాసం - జనవరి 1-15 సంచికలో మీ సంపాదకీయం బాగానచ్చింది. 'కొత్త' పదంతో మొదలెట్టి చక్కని విశ్లేషణతో ముగించారు. బావుంది.

నేటి 'కొత్త'లో సృజనాత్మకత స్థానంలో - భావ దారిద్రపు లక్షణాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. సంగీతంలో కొత్తగా వింత వింత శబ్దాలు అతిగా చోటు చేసుకుంటున్నాయి. సాహిత్యపరంగా అయితే మరీ భయంకరం.

తెలుగువాళ్ళం - తెలుగులోనే మాట్లాడుకుందాం. పోట్లాడుకుందాం. హాయిగా పాడుకుందాం - అని మన తెలుగును గురించి ప్రసారమాధ్యమాల ద్వారా ఎంతగా ప్రచారం చేసున్నా - మనం మాత్రం 'నైనై'లతో ఊగిపోతున్నాం. తీయగా, హాయిగా 'ఫీల్' అయే గొంతులు కరువయ్యాయి. కొన్ని గొంతులు వింటూంటే మనసు అశాంతితో నలిగిపోతోంది.

సంపాదకీయానికి అభినందనలు.

**-డా॥దమ్ము శ్రీనివాసబాబు, హైదరాబాదు**

నేను 1986 వ సంవత్సరం నుండి రేడియోలో నాకు నచ్చిన పాటలను వింటూ రాయడం మొదలుపెట్టాను. పాత సినిమాల్లోని మంచి సాహిత్యం గల పాటలతో పాటు ఆదివారం వచ్చే దేశ భక్తి గీతాలను కూడా సేకరిస్తున్నాను. మీ 'హాసం' ద్వారా మరిన్ని ఆ పాత మధురాలైన గీతాలను సేకరించుకొనే అదృష్టం కలిగింది. ఆ పాత మధురాలకు పేజీలు పెంచగలరని మనవి. 'శివశంకరీ శివానందలహరి', 'నీ లీల పాడెద దేవా', 'బ్రోచేవారెవరురా' వంటి సంగీత ప్రధానాలైన పాటలను పూర్తిగా మాకు 'హాసం' ద్వారా అందివ్వగలరని కోరుచున్నాను.

**-సరికొండ శ్రీనివాసరాజు,మిర్యాలగూడ**

**("శివశంకరీ' పాటను 1-15 డిసెంబరు 2001 'హాసం'లోనూ, 'నీ లీల పాడెద దేవా' స్వరాలతో 16-30 ఏప్రిల్ 2002 'హాసం'లోనూ ఇవ్వడం జరిగింది. గమనించగలరు. 'బ్రోచేవారెవరురా' పాటను వీలునిబట్టి ఇవ్వడం జరుగుతుంది. -ఎడిటర్)**

సంపుటి: 3 సంచిక: 8

**16-31 జనవరి 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా॥ కె.వి.రావు**
**జె.మధుసూదన శర్మ**



**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com



Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

## Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

56

జీనియస్ అన్న పదానికి అర్థం - పదిశాతం మేధస్సు, తొంభైశాతం పట్టుదల అన్నారు అనుభజ్ఞులైన పెద్దలు. థామస్ అల్వా ఎడిసన్ ఎలక్ట్రిక్ బల్బు కనుక్కున్నాడని మనకందరికీ తెలుసు. అదిమాత్రం తెలుసుకుని ఊరుకుంటే చాలదు. ఎలక్ట్రిక్ బల్బు ఎలా తయారుచేయకూడదోనన్న విధానాలు కూడా ఆయన వెయ్యి కనుక్కున్నాడని మనం తెలుసుకోవాలి. ఆ మాట ఆయనే చెప్పాడు కదా!

వెయ్యిసార్లు ప్రయత్నిస్తే తప్ప విజయం సాధించలేని పక్షంలో 999 సార్లు ప్రయత్నించి వదిలిపెట్టినవాడికి, అసలు మొదలు పెట్టనివాడికీ దక్కే ఫలితమే దక్కుతోందన్నమాట! అందువల్ల ప్రయత్నలోపం లేకుండా ముందుకు సాగినవాడే విజేత! ఆరంభించి పరిత్యజింతురు మధ్యముల్ అన్నారు శతకకారులు.

కానీ ప్రయత్నాలు సాగించేటప్పుడు ఆ యజ్ఞం ఎప్పటివరకు చేస్తూనే ఉండాలో ఎలా తెలుస్తుంది? మనం ఇదే రంగంలో పైకి వస్తామని ఎలా తెలుస్తుంది? ఈ ప్రజ్ఞ వేరే రంగంలో ఉపయోగిస్తే కాలం వృథా కాకుండా అక్కడ విజయం సాధించవచ్చు కదా!

ఈ తరహా ఆలోచనకూ అనేక ఉదాహరణలున్నాయి. తన హాస్యరచనల వల్ల, హాస్య ప్రసంగాలవల్ల ఎంతో కీర్తి , ధనమూ సంపాదించిన మార్క్‌ట్వేన్ అనేక రకాల వ్యాసంగాలతో మునిగితేలాడు. ఓడలో కళాసిగా , ప్రింటర్‌గా, జర్నలిస్టుగా, సైనికుడిగా అనేక అవతారాలెత్తాడు, వాటిల్లో ఏదో ఒకదాన్ని పైన చెప్పినట్టుగా అంటిపెట్టుకుని ఉంటే ? గొప్ప సైనికాధికారి అయుండేవాడు కదా అనవచ్చు. తొందరపడి వృత్తి మారాడు కదా అని కూడా అనవచ్చు.

సినీ సంగీతరంగంలో చూడబోతే గాయకులుగా వచ్చి సంగీత దర్శకులయినవారెందరో ఉన్నారు. నటులుగా ప్రయత్నించి ఫెయిలయి, దర్శకులయినవారూ ఉన్నారు. రచయితగా చాలాకాలం ఉండి అనుకోకుండా ఓ సారి నటించి నటులుగా స్థిరపడిపోయిన వారున్నారు. మరి వీరందరూ సరైన సమయంలో సమయజ్ఞత చూపి ఈ రంగంలో విజేతలయినట్లా? లేకపోతే పాతరంగంలో విజయం కలిగే సమయానికి ముందే భయపడి తప్పుకున్నట్లా?

ఈ మీమాంసలో మరో అంశం ఉంది. ఎంతకాలమైనా ప్రయత్నాలు చేయడానికి మనం స్థిరపడ్డా అవకాశాలివ్వడానికి అవతలివాడు సిద్ధపడాలిగా! ఓ వర్ధమాన గాయకుడు సరైన అవకాశాలు లేకపోయి భయపడుతున్నాడనుకోండి. అప్పుడతనికి ఎదురైన అనేకమంది హితైషులు వేర్వేరు సలహాలిస్తారు. "ఇలా ఎంతకాలం ఉన్నా లాభంలేదు,ఫీల్డు మార్చు" అని ఒకరంటే "ఫీల్డు మార్చినా లాభంలేదు, హాయిగా ఇంటికెళ్ళి వ్యాపారమో, వ్యవసాయమో చేసుకో" అని మరొకరంటే, "పట్టుదల ఉండాలి. రాబర్టు బ్రూస్‌ను గుర్తు తెచ్చుకో" అని ఇంకొందరంటారు. ఎవరి మాట వినాలి?

ఇక్కడే విజ్ఞత అక్కరకొస్తుంది. ముందుగా - హాయియైన వ్యాపారం కానీ, వ్యవసాయం కానీ ఉండవని గుర్తించాలి. వేటి కష్టాలు వాటివే! ప్రస్తుతం ఉన్న రంగం మనకు పనికివస్తుందా రాదా, మనం ఆ రంగానికి సంబంధించినవారమా కాదా అన్నది అర్థం చేసుకోవాలి. ఇది ఎవరికి వారే తేల్చుకోవాలి. సంబంధించినంత వారయినంత మాత్రాన సరిపోదు, నిపుణత సాధించాలి. అటువంటి ప్రత్యేకత సంతరించుకున్ననాడు ఉన్న రంగాన్నే అంటిపెట్టుకుని ఉంటే, నేడు కాకపోతే రేపైనా విజయాన్ని కైవశం చేసుకోవచ్చు.

'హాసం' విషయానికి కొస్తే తొలిదశలో మమ్మల్ని నిరుత్సాహపరిచినవారెందరో! అయినా మా ప్రయత్నాలను మేము కొనసాగిస్తూనే వచ్చాం. కొద్దికొద్దిగా విజయానికి చేరువవుతున్నాం. దానికి మా ఆలంబన ఒక్కటే - పైన చెప్పిన 'ప్రత్యేకత'! అందుకే హాస్య సంగీతాభిమానుల మనసుల్లో 'హాసం'కు ఒక ప్రత్యేకస్థానం ఏర్పడింది. క్రమంగా హాస్య-సంగీత అంశాలకు పత్రికలలోను, టీవీ ఛానెల్స్‌లోను ఇదివరకటికంటె ప్రాధాన్యత పెరిగింది. స్టేజి కార్యక్రమాలలో కూడా హాస్య , సంగీతాలను రంగరించి ప్రోగ్రాములను రూపొందించడం జరుగుతోంది. ఇవన్నీ మేము సరైన రంగాన్ని ఎంచుకున్నామనే నమ్మకాన్ని ధృడపరుస్తున్నాయి. మా ఈ నమ్మకానికి ఆది, పునాది పాఠకుల అభిరుచే... అది ఋజువు చేసిన పాఠకులందరికీ మరీ మరీ మరీ కృతజ్ఞతలు.



మా ఆవిడ ఇంతే
మరి మీ ఆవిడ?-2

# "బూ...బూ.." "జ్యూ...జ్యూ"

- భువనచంద్ర (సినీ గీత రచయిత)



"బూ...బూ.."
"జ్యూ...జ్యూ"

నేను 'బు' అన్నానో లేదో ఆవిడ 'జ్యూ' అంది.

నేను మళ్ళీ 'బు...బు' అని తీవ్రంగా అరిచా..

ఆవిడ 'జ్యూ..జ్యూ' అంటూ పళ్ళికిలించింది. నాక్కోపం రాదూ? పిచ్చి కోపం వచ్చింది. ఈ అవమానాన్ని ఎలా సహించడం? ఏదో ఒంటరిగా వున్నప్పుడంటే ఫరవాలేదు... కానీ రాకరాక వచ్చిన మా పెద్దక్క ముందర 'జ్యూ...జ్యూ' అని పళ్ళికిలిస్తే ఎంత అవమానం! మా అక్క ఏమనుకుంటుందోనని ఆలోచించనక్ఖర్లేదా?

హాల్లోంచి 'వాకౌట్' చేశాను. (ఏం చేస్తాం మహా మహా వాళ్ళే 'వాకౌట్లు' చేస్తుంటే నేనెంత?)

ఆ మధ్య ఓ ఆర్నెల్ల క్రితమూ ఇట్లాగే జరిగింది.

నేను 'చే' అనేలోగా ఆవిడ 'బ' అని మాట నెగ్గించుకుంది.

ప్రతిసారీ ఆవిడ మాటే నెగ్గాలంటే ఎలా? నేనేమన్నా వెర్రి వెంగళాయినా..! ఘనత వహించిన 'చింతలపూడి' వాడ్ని. అందుకే యీసారి 'పట్టు'వదల దల్చుకోలేదు.

ఓ గంట గడిచాక ఆవిడ హాల్లోంచి 'అ.పె.రం' అని అరిచింది.

నేను పడగ్గదిలోంచి 'నా.వ.నే.రా' అన్నా

'రా.పో.వ.చె' అని ఆవిడ మళ్ళీ అరిచింది

'చె.ఫో.నా.భ.లే' అని నేనూ అరిచా.

"ఒరేయ్.. మీరు మామూలు మనుషుల్లా మాట్లాడతారా లేక చెంప పగలగొట్టనా" మేం మాట్లాడుకున్నది అర్థంకాక పిచ్చికోపంతో అరిచింది మా పెద్దక్క. అసలే ఆవిడ స్కూల్ టీచరు. క్రమశిక్షణకి లోపం వస్తే సహించదు. అంతేగాక ముక్కోపి. అల్లరిని అసలు సహించదు.

"ఏం లేదే.. అవిడ 'అ.పే.రం' అంది. అంటే 'అన్నం పెట్టా రండి అని' నేను 'నా.వ.నే.రా' అన్నా... అంటే 'నాకు వద్దు నేను రాను' అని . ఆవిడ మళ్ళీ 'రా.పో.వ.చె' అంది... అంటే "రాకపోతే వదినతో చెబుతా" అని - నేనేమో 'చెప్పుకో ఫో.. నాకేం భయం లేదు' అన్నా. ఇంతే!" అంటూ విషయం మొత్తం వివరించా.

"సరిగ్గా మాట్లాడుకోక ఈ వెధవ కోడ్ ఎందుకూ?" చికాగ్గానే అన్నా, మా అక్క గొంతులో కుతూహలం తెలుస్తూనే వుంది.

"ఏం లేదే అక్కా... పదిహేనేళ్లనించీ మద్రాసులోనే వున్నా నాకు ఒక్క ముక్క కూడా తమిళం అంటలా! నేర్చుకుందామని ఇరుగు పొరుగు వాళ్లతో మాట్లాడుతుంటే - వాళ్ళకి పూర్తిగా తెలుగొచ్చేసింది గానీ నాకు అరవంలో మాట్లాడటం రాలా. అసలే మనింటి చుట్టూ ఇళ్ళుకదా...! మేమిద్దరం ఏం మాట్లాడుకున్నా ఊరంతా తెలిసిపోతోంది..! మొన్నటికి మొన్న 'మీ కూచిపూడి స్పెషల్స్ చెయ్యమని మీ మరదలితో అన్నా... ఏడయ్యేసరికి మూడిళ్ళ వాళ్ళూ తయార్... (కూడిపూడి స్పెషల్ అంటే పులిహోరా, పెరుగావడా, అల్లంచెట్నీ. నా పెళ్ళాంది కూచిపూడి. ఆ వూళ్ళో ఏ యింటికెళ్ళినా ఆ మూడూ తప్ప మరో వంటకం చెయ్యరుగాక చెయ్యరు. ఎంచక్కా మా 'చింతలపూళ్ళో అయితే ఎన్నిరకాలు చేస్తారో...!) మాకు 'స్పూను' పులిహోర కూడా మిగల్లేదనుకో..! అప్పటినుంచీ ఈ అరవ్వాళ్ళకి తెలీకూడదని యీ కోడ్ 'కనిపెట్టాం'' కోడ్ రహస్యాన్ని మా అక్కకి వివరించా.

"మరి ఆ " బూ... బూ", "జ్యూ..జ్యూ" ఏమిటి? అడిగింది.

"అదా..! 'బు' అంటే బుక్సు. 'జ్యా' అంటే జ్యూయల్స్..నగలు".

"ఎంత పెద్దవాడివవుతున్నా చిన్నతనం పోలేదురా నీకూ.." కాస్త మురిపెంగానే కోప్పడింది మా అక్క. "ఇంతకీ జ్యూయెల్స్ ఎందుకూ? నాకు ఆల్రెడీ బోల్డన్ని వున్నై..! వచ్చినప్పుడల్లా ఇట్టా అదీ ఇదీ అని మొహమాట పెట్టావంటే




నీ ఇంటికి రానేరాను." కొంచెం కోపంగానే అంది మా పెద్దక్క.

ఆ మాట వినంగానే మా ఆవిడ మొహం తెల్లబడింది. నాకు చచ్చేంత నవ్వొచ్చింది. హాలంతా చిందులేస్తూ పగలబడి నవ్వా! డాన్సుకూడా చేశా! మా ఆవిడ్ని వెక్కిరిస్తూ పళ్ళు కూడా మెరిపించా!.. ఇహ మా ఆవిడ కోపం చూడాలీ...

"చాల్లెండి బడాయి" అంటూ వంటిట్లోకి 'వాకిన్' చేసింది.

"దానికంత కోపమూ నీ కంత నవ్వు ఎందుకొస్తున్నాయిరా..? అసలు మీ ఇద్దరికీ ఆరోగ్యం బాగుందా?" చికాగ్గా అడిగింది పెద్దక్క. మళ్ళీ పకాపకా పళ్ళికిలించా...

"ఒసే పెద్దక్కా..! ఎంత పిచ్చి దానివే నువ్వు! నా పెళ్ళాం ఎంత గుండెలు తీసిన బంటో నీకేం తెలుసే?.. దానికి వాళ్ల పుట్టింటి ధ్యాసలు తప్ప అన్సలు 'మన' సంగతి పడుతుందిటే? కూచిపూళ్ళో వర్షం కురుస్తోందని పేపర్లో చదివి మద్రాసులో గొడుగేసుకెళ్ళే టైపే అది!.. కూచిపూళ్ళో కరెంటు కట్టయిందని వాళ్ళ నాన్న ఫోన్ చేస్తే ఇంట్లో ఫేన్లూ లైట్లూ ఆర్పేసిన ఘటికురాలే నీ మరదలు.! నేను గనక ఎట్టాగొట్టా ఈదుకొస్తున్నా గానీ... మరొహరూ మరొహరూ అయితే యీ పాటికి 'హరీ' అనుండరుటే!" ఛాన్సు దొరికింది కదా అని వున్నవీ లేనివీ కల్పించి చెప్పేశా. (నా పెళ్ళాం భయపడేది కేవలం మా పెద్దక్క నోటికే అని నాకు బాగా తెలుసు!)

"నేనడిగిందేవిటీ నువ్వు చెప్పేదేవిటీ? నేనన్నదాంట్లో ఏం తప్పుందని అడిగితే.. ఆవిషయం వదిలి దాని పుట్టింటి సంగతులు మాట్టాడతావేరా వెధవా.." కోపంతో అరిచింది మా పెద్దక్క. "పైగా ఆ నవ్వొకటీ..!" ఈసడించింది.

"నవ్వు రాక ఏడుపొస్తుందిటే?" అది జ్యూయెల్స్ కొంటానంటే నీ కోసం అనుకుని అమాయకంగా 'నాకు బోలెడన్ని వున్నాయిగా' అన్నావు కానీ - ఆ కొనబోయే జ్యూయెల్స్ వాళ్ళ పుట్టింటి వాళ్ళకని తెలిస్తే నీ గుండె పగిలిపోదుటే? ఈ యింట్లో ఆవిడ 'సామ్రాజ్యమే' గానీ నీ తమ్ముడి మాటకి 'అరటి తొక్కంత' విలువ లేదని తెలిస్తే నీ మనసు రగిలి పోదుటే.." చేతులు తిప్పుతూ 'యాక్షను' కూడా చేశా!

"నోరుముయ్యరా.! దాని సంగతి నాకు తెలీదా?" అన్నదే గానీ.. తన 'విలువ' అంతగా 'పడిపోయిందా' అన్న ఆలోచనలో పడ్డది.

రయ్యిమని వంటిట్లోంచి దూసుకొచ్చింది మా కూచిపూడి.

"చూడండొదినా ఈ మనిషిని..! నే నెప్పుడైనా అత్తిల్లూ పుట్టిల్లూ అనే పక్షపాతం చూపించానా? అసలిట్టాంటి మాయగాడ్ని కట్టుకుని నేను పడుతున్న పాట్లు మీరెరుగుదురా? తట్టెడు తట్టెడు కూరగాయలు తెచ్చి ఊరంతా 'పంజారం'చైడం తప్ప పెళ్ళై ఇన్నేళ్ళవుతున్నా 'మూరెడు' మల్లెపూలు ఒఖ్ఖపూట తెచ్చారేమో అడగండి! అయిన వాళ్ళకీ కానివాళ్ళకీ వండి వార్చే వంటలక్కని చేశారే తప్ప ఓ ముద్దూ మురిపెం అంటూ మీ తమ్ముడికి వున్నదా? మా పెద్దచెల్లెలి కూతురికి పెళ్ళి నిశ్చయమైతే బహుమతిగా ఓ చిన్న ముక్కుపుడక కొందావనుకున్నా!.. అంతకు మించి మా వాళ్ళ కోసం ఏవడిగానూ? ఇంత చిన్న విషయానికి అన్ని నిందలా..." కళ్ళ నీళ్ళు పెట్టుకుంది మా ఆవిడ.

ఏం మాట్లాడాలో తెలీని అయోమయంలో పడింది మా పెద్దక్క. ఓ నిముషంలో కాస్త సద్దుకుని.. "అయినా అది అడిగినట్టే ఓ ముక్కుపుడక కొని పెడితే నీ సొమ్మేం పోతుందిరా..? అదీ సంతోషపడుతుందిగా!" సమాధానపరుస్తూ అంది.

"అసలు సమస్య 'ముక్కుపుడక' కాదే! ప్రెస్టేజి..! మొన్నటికి మొన్న నేను చేమ దుంపలు వండమంటే అది బంగాళా దుంపలు వండింది. నిన్నటికి నిన్న.. నీ కిష్టం కదా అని కజ్జికాయలు చెయ్యమంటే అది బజ్జీలు చేసింది...! నేను ఎడ్డెం అంటే 'తెడ్డెం' అనటం దానికి సరదా..!!



**పాఠక మహాశయులకు నమస్కారం**

నా మొట్టమొదటి కథ 'మా ఆవిడ ఇంతే...మరి మీ ఆవిడ?' 16-31 మే 2002 'హాసం'లో ప్రచురించబడి ఓ ఏడాది దాటింది. మళ్ళీ నా రెండో కథ **"బూ...బూ..జ్యా...జ్యా"** కూడా 'హాసం'కే పంపుతున్నాను. ఇలా 'మా ఆవిడ ఇంతే...మరి మీ ఆవిడ?' మకుటంపై వరసగా కథలు రాసి పంపుదామనుకుంటున్నాను. ఈ రెండో కథకి ఇన్‌స్పిరేషన్ 1-15 సెప్టెంబరు2003 'హాసం' ఎడిటోరియల్. 'మనం మన తెలుగుని మరచి ఇంగ్లీషుని ప్రేమిస్తూ మన పిల్లల్ని ఇంగ్లీషు వాళ్ళుగా తయారు చేస్తే... ఇంతమంది మహానుభావులు మనకోసం తరతరాలుగా కూడబెట్టిన సాహిత్య సంపద ఏమైపోతుంది' అన్న విచారాన్ని ఆ ఎడిటోరియల్‌లో వ్యక్త పరిచారు. ఆ భావాన్నే కొంచెం సరదాగా చెప్పడానికి ఓ చిన్న ప్రయత్నం చేశాను. మీ రిజల్ట్ కోసం ఎదురుచూస్తున్న

మీ

**భువనచంద్ర**

పైగా'ఎడ్డెం'అని ఎందుకనాలీ అంటూ నాతో అర్గ్యుమెంటు వేస్తూ కూర్చుంటుంది. నా మాటని బేఖాతరు చెయ్యడం వాళ్ళమ్మ దానికి వెన్నతో పెట్టిన విద్య!! కళ్ళనీళ్ళు పెట్టుకుంటే నువ్వు కరిగిపోతావని దానికి బాగా తెలుసు..! అయినా - నీ తమ్ముడి సంగతి నీకు తెలీదుటే? ఊరంతా నన్ను 'పెళ్ళాం మాట వినే తుళ్ళాయ్' అని నవ్వితే నీకు మాత్రం బాగుంటుందిటే? కాలికేస్తే వేలుకేసే ఘనాపాఠీనే అది! దాని వుచ్చులో పడకు..!!" అంటూ దడదడా నా వాదన వినిపించేశా! (మా అక్క వుండబట్టి మాట్లాడాగానీ లేకపోతే మనకంత ధైర్యం ఎక్కడిదీ!)




"అనండనండి...మిమ్మల్ని నమ్ముకుని వచ్చినందుకు మంచి శాస్తి జరిగింది. ఒదినా!.. నిజం చెపుతున్నా..! చేమ దుంపలు తెమ్మంటే బంగాళా దుంపలు తెచ్చింది ఎవరో..., కజ్జికాయలకి ఎండుకొబ్బరి తెమ్మంటే పచ్చిమిరప కాయలు తెచ్చి బజ్జీలు వెయ్యమన్నదెవరో మీ తమ్ముడ్నే అడగండి.!! ఈయనంత మతిమరుపు మనిషి లోకంలో వుండడు... ఈయన్ని కట్టుకుని నేనెంత సుఖపడుతున్నానో ఆ పరమాత్ముడికే తెలియాలి! 'బుద్ధావతారం' లాగా ఆ వూగుడు కుర్చీలో ఊగుతూ - టి.వి చూడ్డమో - పుస్తకాలు చదవడమో తప్ప, ఏనాడైనా 'ఇంటి గురించీ 'ఇంటిదాని' గురించీ పట్టించుకున్నారా? లోకంలో ఏ మొగుడైనా 'పెళ్ళాన్నీ పెళ్ళాం గుట్టునీ' కాపాడుతాడు..! మీ తమ్ముడో...? మొన్నటికి మొన్న మా అన్నయ్యొస్తే 'మందు' పెట్టుకుని కూర్చుని 'బావా...బుద్ధుండే వాడెవడూ పెళ్ళిచేసుకోడు!" అన్నారు. అంటే నేను గయ్యాళి దాన్నని మా వాళ్ళ ముందర అనటమేగా? అదీగాక యీ మధ్య కథలు కూడా రాస్తున్నారు. 'మా ఆవిడ ఇంతే.. మరి మీ ఆవిడా?" అంటూ..! నేను గయ్యాళిదాన్నని ప్రచారం చెయ్యటమేగా ఆయన ఉద్దేశం? ఒక్క ముక్కుపుడక అడిగానని ఇంత రాద్ధాంతం చెయ్యటం బాగుందా..!!" మా ఆవిడ కళ్ళూ ముక్కూ చెంగుతో తుడుచుకుంటూ మళ్ళీ వంటింట్లోకి వాకిన్ చేసింది.

"నువ్వు ఇంత చెడిపోయావని అనుకోలేదురా..!" కోపంగానే చూస్తూ అంది మా పెద్దక్క.

"అదికాదే.. నాకు మతిమరుపు వుందని నీకు తెలుసుగా..! దానికీ తెలుసు.! ఏదో మర్చిపోయా ఒక దాని బదులు మరొకటి తెచ్చానే అనుకో...! 'అదికాదండీ.. అదిచ్చేసి 'ఇది' తీసుకురండీ అని చెప్పొచ్చుగా!" కావాలనే 'మేటర్' ని సాగదీశాను. (మా ఆవిడ మళ్ళీ హాల్లోకి దూసుకొస్తుందని నాకు




తెలుసు)

"ఆ...!చెవుతాను.... తెలిస్తేగా చెప్పటానికి? చెప్పుకుంటే సిగ్గుచేటు వదినా... మువ్వలనేని శివగారికి ఇవ్వాల్సిన పాట రేలంగి నరసంహారావు గారికీ... రేలంగి నరసింహారావుగారి కివ్వాల్సిన పాట స్వర్ణ సుబ్బారావు గారికీ పంపించారు. అదంతా సద్దేసరికి నా తలప్రాణం తోకకొచ్చింది. నేను గాబట్టి మీ తమ్ముడ్ని 'భరి'స్తున్నాను గానీ ఇంకోత్తైతే చచ్చి చెడ బట్టిపోయేది.. పుణ్యం కొద్దీ పురుషుడని ఊరికే అన్నారా..మన పుణ్యం ఇంతే అని ఎప్పటికప్పుడు సరిపెట్టుకుంటూనే వున్నా.. నిందలు తప్పట్లా..." మళ్ళీ వంటింట్లోకి చెక్కేసింది మా ఆవిడ.

ఆడవాళ్ళకి ఆడవాళ్ళకీ సింపతీ వుండటం సహజం. అదీగాక మా ఆవిడ 'పుణ్యం' గురించి 'నొక్కే' సరికి మా అక్క 'అవతలి పక్షంలో' చేరిపోయింది.

"ఒరేయ్...ఇప్పటికిప్పుడు నువ్వెళ్ళి ఆ ముక్కుపుడక తెస్తావా లేకపోతే నన్ను వెళ్ళిపొమ్మంటావా?" లేచి నిలబడి మరీ ఆజ్ఞ జారీ చేసింది మా పెద్దక్క.

"అదికాదే అక్కా.. అసలు దాని సంగతి తెలిస్తే.." అని నేను చెప్పబోతుంటే కట్ చేసి

"నోరుముయ్యరా..! దాని సంగతీ నీ సంగతీ నాకు తెలీదా? 'లక్ష్మి' లాంటి పిల్లని ఏడిపిస్తావురా? ఏదో చెల్లెలి కూతురి పెళ్ళిగదా అని అది ముచ్చట పడితే, అడిగింది కొనివ్వాల్సింది పోయి కళ్ళ నీళ్ళు పెట్టిస్తావురా? పాపం చిన్న సన్నాసి. ఎంత బాధపడుతోందో నీతో..! పోయి మర్యాదగా అదడిగింది తీసుకురా" అంటూ అల్టిమేటం కూడా ఇచ్చేసింది. మనం మాత్రం ఏం చేస్తాం! నోరు మూసుకున్నాం.

"ఎందుకులెండి.... ఇప్పుడు ఆయన బజారుకి వెళ్ళినా షాపు తెరచివుండదు. ఈ మద్రాసులో ఒకటి నించి మూడు దాకా లంచి టైం. కొట్లు కట్టేస్తారు. అదీగాక ఆయన ఆకలికి ఆగలేరు.! సాయంత్రం ముగ్గురం వెళ్ళితెద్దాం" వంటింట్లోంచే అనునయిస్తూ అంది మా ఆవిడ. (ఈ విషయంలో మా ఆవిడ 'గోల్డ్'. మన ఆకలి గురించి బాగా తెలుసు. టైమ్ కి ఫుడ్ పెట్టడంలో సాక్షాత్తూ అన్నపూర్ణే!)

ముగ్గురం అన్నాల ముందు కూర్చున్నాం.

మా అక్క చూడకుండా మా ఆవిడ నన్ను వెక్కిరిస్తూ నవ్వినట్లు నాకు అనుమానం వచ్చినా - పట్టించుకోనట్టు సుష్టుగా లంచి లాగించేశా. తాంబూలం వేసుకుంటూ తాపీగా "అయినా నీ కింత పంతం ఎట్లా వచ్చిందిరా వెధవా" అనడిగింది అక్క.

"సరేనే!.. అడిగావు గనక చెపుతున్నా. నగలది ఏవుందీ!.. ఇవ్వాళుంటై రేపుపోతై. అసలు వాళ్ళ చెల్లికూతురంటే నాకూ కూతుర్లాంటిదేగా! అందుకే అమూల్యమైన 'ఖజానా' ఇవ్వదల్చుకున్నా. నా

చిన్నతనంలో పుస్తకాలు కొనుక్కోటానికి డబ్బుల్లేక ఎంత ఇబ్బంది పడ్డామో నీకు తెలుసుగా! నాకేమో పుస్తకాల పిచ్చి. మంచి మంచి పుస్తకాలు కొనాలనీ - చదవాలనీ - దాచుకోవాలనీ వుండేది. సరే ఉద్యోగంలో చేరాక కొనుక్కున్నాననుకో. ఆ సంగతి అలావుంచితే - ఎంతమంది గొప్ప రచయితలు వాళ్ళ నరాల్ని తెంపుకుని మనకోసం, రాబోయే 'తరాల' కోసం వుస్తకాలు రాశారు? ఎంతమంది మహానుభావులు చీకట్లో మరుగుతున్నా వారి కవితలతోనో కావ్యాలతోనో మన 'మనసుల్లో' వెలుగు నింపారు? పిచ్చి పిచ్చి 'జాక్ & జిల్స్' రైమ్స్ బట్టీ పట్టించడమే గానీ ఓ వేమన శతకాన్నో, సుమతీ శతకాన్నో మనం పిల్లలకి నేర్పుతున్నామా? మనం చదివి ఆనందించిన పంచతంత్రం కథల్నో, ఈనఫ్ కథల్నో మన పిల్లల చేత చదివిస్తున్నామా? ఇవ్వాళ్ళ ఇంగ్లీషు నవల్ని స్టయిలుగా మన పిల్లలు చేత్తో పట్టుకు తిరుగేస్తుంటే సంతోషిస్తున్నాం గానీ - ఓ విశ్వనాధ సత్యనారాయణ గార్నీ, ఓ బుచ్చిబాబునీ, ఓ త్రిపురనేని గోపీచంద్‌నీ, ఓ చలాన్నీ, ఓ బాలగంగాధర తిలక్ నీ, ఓ శ్రీశ్రీనీ ఓ ఆరుద్రనీ, ఓ జంధ్యాల పాపయ్య శాస్త్రి గార్నీ మన పిల్లలకి పరిచయం చేస్తున్నామా? వారి అద్భుతమైన రచనల్నీ మన వాళ్ళ చేత చదివిస్తున్నామా? మన 'తెలుగు'ని మనం నిర్లక్ష్యం చేస్తే కాలం క్షమిస్తుందా? మన 'భాషని' మనం చులకనగా చూస్తే చరిత్ర మనని క్షమిస్తుందిటే? మన 'సంస్కృతి'ని మనం కాపాడుకోపోతే వేరే వాళ్ళెందుకు కాపాడతారు. తమిళ వాళ్ళని చూడు. ప్రతీదానికీ, ప్రతి కొత్త వస్తువుకీ తమిళంలో పేరెట్టి ఆ తమిళ పదాన్నే వాడతారు. మనం గొప్పగా 'గ్రామ్ ఫోన్ రికార్డు' అని ఇంగ్లీషులో అంటే వాళ్లు 'ఇసై తట్ట' అని తమిళంలో పిలుచుకుంటారు. టి.వి కి 'టొలైకాక్షి' అనీ, టెలీఫోన్‌కి 'టొలైపేసి' అనీ పేరు పెట్టి ఆ పేర్లనే వాడతారు.

మరి మనం?

ఇవ్వాళ కొబ్బరి కాయని పాతితే ఏడేళ్ళకో ఎనిమిదేళ్లకో కాపు వచ్చినట్టు ఈ రోజునించే మనం కనీసం 'మనవాళ్ళకి' తెలుగు నేర్పుదాం. నెలకొక పుస్తకాన్నైనా వాళ్ళచేత 'తెలుగు పుస్తకాన్ని' చదివిద్దాం. అందుకే 'అరిగి'పోయే బంగారం కంటే బుర్రకి 'మెరుగు' పెట్టే పుస్తకాల్ని బహుమతిగా ఇద్దామనుకున్నా! అదీగాక ఇన్ని శతాబ్దాలుగా మన కవులూ రచయితలూ, రచయిత్రులూ మనకోసం కూడ బెట్టిన ఈ అమూల్య సంపదని మనం దూరం చేసుకోకూడదనీ మన తరవాత తరాలవారికి అందించటం మన కర్తవ్యమనీ నా ఉద్దేశ్యం. ఇవాల్టి ప్రపంచంలో ఎవరు మన తప్పుల్ని వేలెత్తి చూపినా మనం భరించలేని స్థితిలో వున్నాం. సాహిత్యం సంగతులు వేరు. కొడవటిగంటి




కుటుంబరావు గారి 'సీతప్ప'ని చదివితే మనలోనూ ఓ 'సీతప్ప' కనిపిస్తాడు. మన బలహీనతల్నీ మన తప్పుల్నీ మనకే చూపిస్తాడు. అందుకనే అక్కా... పుస్తకాలు కొందామన్నది..!!" మనసులో మాట బయటికి చెప్పేశా.

"అంత అక్కర్లేదులెండి..! మీరు పుస్తకాలు కొనండీ.. నేను నగలు కొంటా" తేల్చేసింది నా ఘరానా పెళ్ళాం.

ఓ నెలరోజుల తర్వాత పెళ్ళికి వెళ్ళాం. వరుడు అమెరికాలో వుంటున్నాడు. పెళ్లి చేసుకున్నాక, మా అమ్మాయీ (మరదలి కూతురు) వెళ్ళక తప్పదు. నేను మాత్రం పెద్దబాలశిక్షా,సుమతీ శతకం, కృష్ణ శతకం, వేమన పద్యాలు.. అన్నమయ్య కీర్తనలూ.. పంచతంత్రం మాత్రమే కాక బోలెడు నాటి - నేటి నవలల్నీ కవితల్నీ కొని అందంగా ప్యాక్ చేయించా. అవేగాక ఓ ఇరవైఏళ్ళ నించీ కొని బైండ్ చేయించిన చందమామలూ, బొమ్మరిల్లులూ, బుజ్జాయిలూ, ఇప్పటి వరకూ వచ్చిన 'హాసం' సంచికలు కూడా జతచేశా. అందరూ బహుమతులు ఇచ్చే సమయంలో నేను నా పుస్తకాల 'బండిల్'ని ప్రజెంటుచేశా.

మా ఆవిడ సైలెంటుగా చూస్తూ కూచుంది. (ముక్కుపుడక ముందరే ఇచ్చేసిందని నా అనుమానం).

"ఏమిటండోయ్! అంత పెద్ద బహుమతి!" మా తోడల్లుడు అడిగాడు.

"అదే సస్పెన్స్" నవ్వి వూరుకున్నా.

తిరుగు ప్రయాణంలో ఎన్నిసార్లు అడిగినా నా పెళ్ళాం నవ్వి వూరుకున్నదే గానీ ముక్కుపుడక సంగతి చెప్పనేలేదు.

రెండునెలల తర్వాత అమెరికానించి ఉత్తరం వచ్చింది. నా మరదలి కూతురూ అల్లుడూ సంయుక్తంగా రాశారు. దాని సారాంశం ఏమిటంటే-

"పెద్ద నాన్నగారూ... మీరిచ్చిన పుస్తకాలన్నీ ఇక్కడి పిల్లలూ పెద్దలూ ఎంతో ఉత్సాహంగా చదువుతున్నారు. వాళ్ళ పిల్లలకి పెద్దబాలశిక్ష నేర్పుతున్నారు. అయితే పెద్దమ్మ బహుమతిగా నాకు ఇచ్చిన 'ఇల్లేరమ్మ కథలూ.. పచ్చనాకుసాక్షిగా- మనికన్నడి సేద్యం - మిట్టారోడి కథలూ - బుడుగు - దర్గామిట్ట కథలూ ఇంకా మిగతా పుస్తకాల్నీ మరింత మెచ్చుకున్నారు. ఆ పుస్తకాలు యమా 'రొటేట్' అవుతున్నై. దానివల్ల 'మేం' బాగా ఫేమస్ అయ్యాం - థాంక్స్" అని ఉంది.

ముక్కుపుడక కొనమని నేను మా ఆవిడకి ఇచ్చిన డబ్బుని ఆవిడేంచేసిందో ఇప్పటికి అర్థమైంది.

ఓసి నా కూచిపూడి దానా -

మా ఆవిడ ఇంతే - మరి మీ ఆవిడ?





ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

# లలిత సంగీతం

## వేదంలాటి మాటే నీది కావాలోయి సోదరా

ప॥ వేదంలాటి మాటే నీది కావాలోయి సోదరా
భేదంలోన మోదంలోన సన్మార్గాన సాగరా
సత్యమే నీదుకవచం - నీతియే నీదుప్రాణం
శాంతియే నీదుగమ్యం - ధర్మమే నీ ఆశయమ్మై ॥వేదం॥

చ॥ సౌరభ సుమాలు సుమధుర ఫలాలు - త్యాగనిరతినే చాటగా
మలయ పవనాలు పునీతజలాలు - సమరస భావన చూపగా
ఓ...ఆ ఫలములే - ఆ...భూషణములై - నీ
బ్రతుకున ధన్యత చేకూర్చాలి ॥వేదం॥

చ॥ ప్రేమ చూపేటి జనని హృదయాన - నిస్వార్థత గమనించుమా
సిరులు సంపదల నొసగు నట్టియీ - ధరణి మహిమ కీర్తించుమా
ఓ...యీ జననికే ఆ...అంకితమ్మై - నీ
ఘనత జగతిలో నినదించాలి ॥వేదం॥

**రచన** : బొమ్మనబోయిన సోమసుందరం
**సంగీతం** : మహాభాష్యం చిత్తరంజన్
-బృందగానం
**రాగం**: హరికాంభోజి
- ఖమాజ్ థాట్ (హిందుస్తాని సం॥)
28వ మేళ కర్త రాగం
**తాళం**: చతురశ్రగతి(కర్ణాటక సం॥)
కహరువా(హిందుస్తాని సం॥)
ఆరోహణ : సరిగమపదనిస
అవరోహణ : సనిదపమగరిస

షడ్జము, చతుశృతిరిషభం, అంతర గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, చతుశృతి ధైవతం, కైశికినిషాదం ఈ రాగంలోని స్వరాలు.

కర్ణాటక సంగీతంలో హరికాంభోజి ప్రాచుర్యాన్ని పొందిన రాగమే. "రామ నన్ను బ్రోవరా", "ఎంత రాని తనకెంత పోని" మొదలగు ఈ రాగంలోని త్యాగరాజ కీర్తనలు చాలా ప్రసిద్ధి చెందినవి. హరికాంభోజి కర్ణాటక సంగీతంలోని 28వ మేళకర్త రాగం.



ఈ రాగాన్ని హిందుస్తాని సంగీతంలో ఖమాజ్ థాట్ అని అంటారు. (అనగా హిందుస్తానిలో సంపూర్ణ రాగం). లలిత సంగీతంలో కూడా ఈ రాగం యొక్క వాడుక బాగానే కనబడుతుంది. ముఖ్యంగా జానపద శైలిని కలుపుకుని ఈ రాగంలో ఎన్నో గీతాలకు అందమైన బాణీలు స్వర కర్తలు కూర్చినవి మనము నిత్యమూ వినే పాటలలో మనకు తారస పడతాయి.

**26**, జనవరి 1950 నాడు మనదేశం ప్రజాస్వామ్య దేశం(రిపబ్లిక్ డే)గా ఏర్పడింది. అప్పటినుండి మనం ప్రతీఏడూ 26, జనవరినాడు 'గణతంత్ర' దినోత్సవాన్ని (రిపబ్లిక్ దినోత్సవాలు) ఎంతో వైభవంగా జరుపుకుంటున్నాము. సర్వమానవ సౌభ్రాతృత్వము, మత సామరస్యము, జాతి సమైక్యత మొదలగునవి ప్రాతిపదికగా చేసుకుని మన రాజ్యాంగాన్ని (CONSTITUTION)ని రూపొందించారు పెద్దలు. ఆ నిర్దేశాలననుసరించి మనం దేశ




ప్రగతికై నిరంతరమూ శ్రమించే భారత పౌరులము. సమత, మమత, మానవత మన లక్ష్యాలై వున్నవి. నీతి-నిజాయితి, సత్యము, శాంతి, ధర్మనిరతి మెదలగునవి మన జీవితాశయాలై మనలను నడిపిస్తున్నవి. సమాజ శ్రేయస్సు తద్వారా దేశ శ్రేయస్సును ఆకాంక్షిస్తూ ప్రగతిబాటలో పయనిద్దాం.

దేశభక్తిని చాటే గీతాలెన్నో వెలువడినాయి. చాలాకాలంగా గురజాడ నుండి నేటి యువకవుల వరకూ ఎంతోమంది ఎన్నో వైవిధ్యం గల అంశాలతోటి, యితివృత్తాలతోటి సుమధురమైన గీతాలను సృజించారు. దేశమాత స్తుతి, జాతి సమైక్యత, మత సామరస్యం, దేశ చరిత్ర, సంస్కృతి, దేశాభ్యుదయం, ప్రబోధం మెదలగు అంశాలతో ప్రసిద్ధ కవులు వ్రాసిన గేయాలు మనకు అసంఖ్యాకంగా వున్నాయి.

సత్యమే మన కవచం, నీతియే ప్రాణం, శాంతియే మన గమ్యం, ధర్మమే ఆశయము అంటూ స్వార్థత్యాగము, ప్రేమానురాగాలు మెదలగు మానవతా విలువలు మనిషికి అత్యంత అవశ్యకమని, కష్టాలలోను, సుఖాలలోనూ కూడా మానవతా దృక్పథంతో ముందుకు పయనించాలని ప్రబోధించే ఈ సుమధుర గీతాన్ని సోమసుందరం గారు కడు హృద్యంగా రచించారు. 1989వ సంవత్సరంలో జవహర్‌లాల్ శతజయంతి సందర్భంగా ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం వారు స్థానిక రవీంద్రభారతిలో నిర్వహించిన ప్రత్యేక కార్యక్రమంలో ఈ గీతాన్ని నేను స్వర పరచి బృంద గీతంగా పాడించాను.

**బి.సోమసుందరం**



1942వ సంవత్సరంలో కడపజిల్లాలోని సురభి గ్రామంలో జన్మించిన బొమ్మనబోయిన సోమసుందరం మంచి రచయితగా,గేయకవిగా పేరు గడించుకున్నారు. బి.ఎ.,బి.ఇ.డి పట్టాలు పొంది ప్రభుత్వ ఉపాధ్యాయుడిగాను, ప్రధానోపాధ్యాయుడిగాను, మండల విద్యాధికారిగాను ఎన్నో బాధ్యతాయుతమైన పదవులను సమర్థంగా సుమారు 38 సంవత్సరాల పాటు నిర్వహించి అటు విద్యా రంగంలోనే కాక యిటు సాహిత్యరంగంలో కూడా నిరంతరం కృషి చేస్తూ మంచి ఖ్యాతి నార్జించుకున్నారు. పాఠశాలలతోటి ఆయనకున్న యిన్నేళ్ళ అనుబంధం చదువుకునే బాల బాలికలతో అత్యంత సాన్నిహిత్యాన్నికి దోహదం చేసింది. స్వతహాగా సాహితీ మిత్రుడు కావడంవల్ల ఆయన పిల్లల మనస్తత్వాలను, వాళ్ళ అల్లరిని, ఆకతాయితనాన్నీ నిశితంగా పరిశీలించి ఆకళింపుచేసుకుని తేలిక మాటలతో చక్కని గేయాలల్లి వారిని ఆకట్టుకున్నారు. 30 సంవత్సరాలుగా నాకు ఆయనతో సాన్నిహిత్యమూ, అనుబంధమూ వున్నది. ఆకాశవాణిలో పాఠశాలల కార్యక్రమాలకు ఆయన ఎన్నో పాటలు, సంగీతరూపకాలు, నాటికలు రచించారు. వాటిలో కొన్నిటిని నేను స్వరపరచి బాలల చేత పాడించాను. అవేకాక యువతీయువకులకు సైతం చక్కని గేయాలను రచించారు. ఆకాశవాణి నిర్వహించిన ప్రత్యేక

కార్యక్రమాలలో నేను ఆయన పాటలకు సంగీతం కూర్చి పాడించాను. వాటిలో "ఆసేతు హిమ శీతలం'', ''వేదంలాటి మాటే నీది కావాలోయి సోదరా" మొదలైనవి మచ్చుకు కొన్ని మాత్రమే. దూరదర్శన్‌లో కూడా వారి పాటలు ఎన్నో ప్రసారమైనాయి. సోమసుందరంగారు రచించిన సంగీత, నృత్య నాటికలను 'మువ్వ' అనే గ్రంథంగా ప్రచురించారు. తరువాత యిటీవలే 2002 సం॥లో బాల గేయసంపుటి ''తాయిలం''ను వెలువరించారు. కాలాను గుణంగా వస్తున్న మార్పులను, అంతరిస్తున్న విలువలను దృష్టిలోపెట్టుకుని పిల్లలకు బాల్యం నుండే మానవత్వము, మంచితనం, సత్ప్రవర్తన మొదలగునవి అలవడాలని తమ రచనల ద్వారా ప్రబోధిస్తూ వారి ఎదుగుదలకు ఎంతో శ్రమిస్తున్నారు.

మంచితనం, సౌశీల్యం, ఆత్మీయతలు మూర్తీభవించిన శ్రీ సోమసుందరం నాకెంతో ఆప్తులు. వృత్తి,ప్రవృత్తి రెంటినీ బాలల శ్రేయస్సుకై,ప్రగతికై వినియోగించిన కవి సోమసుందరం గారి జీవితం సార్థకమైనది. ■

**హరికాంభోజి రాగం ఆధారంగా కొన్ని తెలుగు, హిందీ చిత్రగీతాలను 'హాసం" 16-31 అక్టోబర్,2002, 16-31 జనవరి 2003 సంచికలలో వీటి వివరాలు కొన్నిటిని ప్రస్తావించాను.**

# స (జ) రదా పద్యాలు

**-టి.యల్.ప్రసాద్**



శని పట్టిన దినములలో
ఘనుడును సహితంబు అడ్డగాడిద క్రిందన్
పని చేయవలసి వచ్చును
మనసును హతమార్చుకొనుచు మాటలు పడుచున్



ఇద్దరు భార్యల మగనికి
ఒద్దిక కనరాదు కడకు ఓపిక చచ్చున్
గుద్దులు, తన్నులు, తిట్లతో
మద్దెల వాయింపు లాగ మనుగడ సాగున్



చాడీలు చెప్పి తెలివిగ
కేడీలా మూఢ బాసుకి నిరతం
తోడై నిలిచిన కంత్రీ
గాడే కద చిన్నబాసు కాలక్రమేణా



వనితల మదిలో తలపులు
కనుగొనవలెనన్న కోర్కె కలిగిన క్షణమే
పనిచేయకుండ పోవును
ఘనమగు నీ మెదడు, చేయి, కాలును తస్మాత్!



తన ఇల్లు చక్కదిద్దని
గుణహీనుడు చేతగాని గొప్పలు చెబుతూ
పనిలేక ఇళ్ళు దిరుగును
శనిగొట్టువి తట్టెడన్ని సలహాలిస్తూ



# ప్రపంచ శైవ మహాసభలు

విశ్వ కళ్యాణాన్ని ,సర్వమానవ శ్రేయస్సును కాంక్షిస్తూ, శివారాధనపట్ల చైతన్య దీప్తివంతం చేసేందుకు సికింద్రాబాద్, జింఖానా మైదానంలో ఫిబ్రవరి 1, 2, 3 తేదీలలో రాష్ట్రంలోని, దేశంలోని నలుమూలల నుండి విదేశాలలో స్థిరపడిన వారు సైతం పాల్గొంటున్న ప్రపంచ శైవ మహాసభల్ని శ్రీశైవ మహాపీఠం కేంద్ర కమిటీ వారి మార్గదర్శనంలో 'జంటనగరశాఖ' నిర్వహిస్తున్న

## ఈ ఆధ్యాత్మికానుభూతిని అందుకోవడానికి అందరూ ఆహ్వానితులు!

### సామాజికం

(రోజూ ఉ.8గం॥ - సా.4గం॥)
పేద వధూవరులకు ఉచిత సామూహిక వివాహాలు,
సామూహిక ఉపనయనాలు,
పేదలకు వస్త్రదానం,
వృద్ధులకు ఆదరణ,
అన్నదానం,
శివగీతాయజ్ఞం,
రక్తదాన శిబిరం,
ఆరోగ్య శిబిరం.

### కళాత్మకం

(రోజూ సా. 4.00 గం॥ లనుండి రా. 10.00 గం॥ల వరకు)
శివశ్రీ పద్మశ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం గారి సమక్షంలో పాడుతా తీయగా, పాడాలని ఉంది విజేతలచే ఆర్కెస్ట్రా,
బ్రహ్మశ్రీ తనికెళ్ళ భరణి గారు రచించి, గానం చేసిన శివభక్తి గీతాల ఆడియో ఆల్బమ్ (ప్రముఖ సినీ హీరోచే) ఆవిష్కరణ.
సినీనటులు శివశ్రీ చంద్రమోహన్ ఆధ్వర్యంలో కామెడీ స్కిట్స్, ప్రముఖ మెజీషియన్ శ్రీ బి.వి.పట్టాభిరామ్ గారిచే ప్రదర్శన, వేటూరి, షణ్ముఖశర్మ వంటి ప్రముఖులు రాసిన పాటలు, పౌరాణిక బ్రహ్మశ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి, విశాఖ శారదా పీఠం శ్రీ స్వరూపానందేంద్ర సరస్వతీ మహాస్వామివారి ఆశీర్భాషణం.

పాడుతా తీయగా, పాడాలని వుంది కార్యక్రమాల ద్వారా వేలాది సంగీతాభిమానులను ఉత్తేజపరచిన గాన గంధర్వుడు పద్మశ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం గారి ఆశీర్బలంతో వచ్చిన ఎందరో గాయనీ గాయకులు ప్రస్తుతం సినిమా రంగంలో దూసుకుపోతున్నారు. వారందరూ డా॥ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యంగారు ముఖ్య అతిథిగా, పార్థసారథి ఆధ్వర్యంలో ఒక ప్రత్యేక సినీగీత విభావరి సమర్పించటం విశేషాంశం.











పీఠాధిపతి : శివశ్రీ నిర్మల శంకరశాస్త్రి
ఉపపీఠాధిపతి : సద్గురు శివశ్రీ కందుకూరి శివానందమూర్తి,
చీఫ్ ప్యాట్రన్ : శ్రీ కె.విశ్వనాథ్ (సినీ దర్శకులు)
ప్యాట్రన్స్ : శివశ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం (సినీ నేపథ్య గాయకుడు),
శ్రీ ఎమ్.చంద్రమోహన్ (సినీ నటుడు)
బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ,
శ్రీ కె.వి. రమణాచారి (కమీషనర్, దేవాదాయశాఖ)

సౌజన్యమూర్తులు, దాతలు, వ్యాపార, వాణిజ్య, కార్పొరేట్ సంస్థలు విరాళాలతో ముందుకు వస్తారని ఆశిస్తున్నాం!
స్పాన్సర్స్, స్టాల్స్ ఏర్పాటు చేయువారు వెంటనే సంప్రదించండి.

**80G సెక్షన్ మేరకు ఆదాయపు పన్ను మినహాయింపు.**


ఆర్గనైజింగ్ కమిటీ జనరల్ సెక్రటరీ
**ముదిగొండ లింగమూర్తి**
(HAL Retd. DGM)
ఫోన్ : 27952408

ఆర్గనైజింగ్ కమిటీ ఛైర్మన్
**తాడికొండ విజయకుమార్**
(Tax Consultant)
Cell: 98480 51387

**శ్రీ శైవ మహా పీఠము**
జంటనగరాల శాఖ, విజయాబ్యాంక్ బిల్డింగ్,
వెస్ట్ మారేడ్‌పల్లి, మెయిన్ రోడ్, సికింద్రాబాద్ - 26.
ఫోన్ : 55204627, 27804973, 27807863, 21556434.


*EVENT MANAGERS : YAVANIKA ENTERTAINMENTS Bhanu Sharma Ph: 55252043*




# మిస్టర్ పెళ్ళాం






కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్ళపూడి వెంకటరమణ

వెండితెర నవల

**12**

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు

**జరిగిన కథ**

బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందిన రోజే మేనేజర్ చేసిన మోసం వల్ల క్యాష్‌లో లక్ష రూపాయలు తేడా వస్తుంది. సస్పెండ్ అవుతాడు. ఈ విషయం బయటకు పొక్కి, వేరే ఏ ఉద్యోగమూ దొరకదు. ఝాన్సీ తన కాలేజ్‌మేట్, గోపాల్ కంపెనీలో రికమెండ్ చేస్తానంటుంది. తన కథ తెలిసాక వాళ్లూ పొమ్మంటారంటాడు బాలాజీ. అయితే తనే ఉద్యోగానికి వెళతానంటుంది ఝాన్సీ. అలా అయితే తను ఇంటిపని చూసుకుంటానంటాడు బాలాజీ. నష్టాల్లో నడుస్తున్న గోపాల్ కంపెనీ లాభాల బాటలో ప్రయాణించే సూచనలివ్వటంతో ఝాన్సీని తమ కంపెనీలో కీలకమైన స్థానానికి ఎంపికచేసుకుంటారు. ఝాన్సీ ఉద్యోగంలో చేరుతుంది. గోపాలకృష్ణ ఆహ్వానం మేరకు కృష్ణాష్టమి వేడుకలకు వెళ్లిన బాలాజీ అక్కడ జరిగిన కొన్ని సంఘటనల పట్ల కినుక వహిస్తాడు. -(ఇక చదవండి)



రాత్రి బాగా పొద్దుపోయిన తరువాత పిల్లలనెత్తుకొని ఇంటికొచ్చారు బాలాజీ, ఝాన్సీ.

ఝాన్సీ తాళం తీస్తుండగా "ఛీ...అంతా దొంగలు .. ఒఠ్ఠి భజంత్రీగాళ్ళు. వాళ్ళకు బుద్ధిలేదు. ఆ తుత్తిగాడికి సిగ్గులేదు. బుద్ధిలేక వెళ్ళాను. వాటె మెమొరీ !వాటే డాన్స్ ! వాటే ప్రసాదం సార్.. ఆహాహా...ఏం నమిలారు సార్...ఏం మింగారు సార్.."తనలో తనే ఎగతాళిగా మాట్లాడుకుంటున్నాడు. ఝాన్సీ అదేమీ వినిపించుకోకుండా బెడ్రూమ్‌లోకెళ్ళి చంటిగాడిని పడుకోబెట్టి సముదాయిస్తున్నది. బాలాజీ కూడా బెడ్రూమ్‌లోకి వెళ్ళి పాపను మంచం మీద ఎత్తికుదేశాడు. "వాళ్ళ మీద కోపం వీళ్ళ మీద చూపిస్తారేం?" చిరుకోపంతో అన్నది ఝాన్సీ.

"చాతకాక..చాతకాకే కదా చీపురు కట్టలా ఓమూల పడున్నాను." అసహనంగా అన్నాడు బాలాజీ.

"ఎందుకండీ అంతంత మాటలు? ఇప్పుడేమంత ఘోరం జరిగిందని?" బాధగా అన్నది ఝాన్సీ.

"ఇంతకన్నా ఏం ఘోరం జరగాలి? గెలుస్తున్న వాడిని చొక్కా పట్టుకుని లాగేశారు. ఓడించి హేళన చేశారు. దొంగ ఎత్తులు వేసి గెలిచిన ఆ యమ్మీగాడికి భజనలు.. జేజేలు? వాడేం దేవుడా? దిగొచ్చాడా?"

వంటింట్లోకెళ్ళి పిల్లలకు పాలు వేడిచేస్తున్నది. బాలాజీ చెవిలో జోరీగలా రొదపెడుతూనే ఉన్నాడు. "మా ప్రాణానికి మాత్రం దేవుడే. నెలతిరిగేసరికి జీతాలిచ్చి పోషిస్తున్నాడు. అతన్తోపోటీ వద్దంటే మీరే ఎగబడ్డారు." అన్నది.



"నువ్వేంవద్దన్లే. సై అని పళ్ళికిలించావు. అసలిదంతా నన్నవమానించడానికి నువ్వేసిన ప్లాన్..."పెద్దస్వరంతో అన్నాడు.

వీళ్ళిద్దరి ఘర్షణతో పిల్లలిద్దరూ నిద్రలేచారు. భయపడుతూ వింటున్నారు.

పోట్లాడుకోవడం పిల్లల లక్షణం. వారిని వారించడం పెద్దల లక్షణం. కానీ పిల్లల ముందే పెద్దలు పోట్లగిత్తల్లా పోట్లాడుకుంటుంటే? వారిని వారించలేక ఎదిరించలేక-వారి గొడవల మధ్య తామెక్కడ నలిగిపోతామోనన్న భయంతో-నిస్సహాయంగా వణికిపోతూ పిల్లలుంటే? ఎంత హృదయ విదారక దృశ్యం అది! ఏం సంసారాలివి! పాపా, బాబూ ఈ దృశ్యం చూడలేక బెడ్‌రూమ్ నుంచి మెల్లగా నిష్క్రమించారు.



బాలాజీ ఇంకా సాగదీస్తున్నాడు. "వాడి బంగళాలో బాత్రూమంత లేదు నా ఇల్లు అనిచెప్పాలని చూశావు. వాడితోటలోని చిన్న మడంత లేదు నా పెరడు, వాడి చేతిరుమాలంత చెయ్యదు నాడ్రస్సు, ఇవన్నీ చూపించి నన్ను ఇన్సల్టు చెయ్యడానికే తీసుకెళ్ళావ్." అన్నాడు కోపంగా.

భర్త కోపాన్ని అర్థంచేసుకుంటున్న ఝాన్సీ సాధ్యమైనంత శాంతిగానే

సమాధాన పరచాలని చూస్తున్నది.

"ఏం కాదు. పొరపాటు. నేను పిలవలేదు. ఆయన ఇంగ్లీషులో పిలిచాడు. మీరు ఇంగ్లీషులో యేస్ యేస్...అఫ్‌కోర్స్.. అంటూ బయలుదేరారు. నన్నంటారేం?" అన్నది.



"నేను ఇంగ్లీషులో అఘోరిస్తే నువ్వు తెలుగులో వద్దని చెప్పొచ్చుగా. అదే..అదే ..రానీ వళ్ళురాలిపోనీ అను కున్నావు. నువ్వు ఎంజాయ్ చేశావు." సాధిస్తూనే ఉన్నాడు బాలాజీ సిగరెట్ వెలిగించి.

పాలు రెండు గ్లాసులతో నింపుకుని బెడ్‌రూమ్‌లో కొచ్చింది ఝాన్సీ. పిల్లలిద్దరూ కనిపించలేదు.

"పిల్లలేరండీ?" అన్నది కంగారుగా

"ఏదీ? ఒక శాల్తీని నేను తెచ్చాను.ఇంకో శాల్తీని నువ్వు తీసుకువచ్చావో, పారేశావో, ధారపోశావో ఎవరికి తెలుసు?" అన్నాడు అక్కసుగా.

ఝాన్సీలో ఆందోళన అధికమైంది. "చిట్టీ చిట్టీ...ఎక్కడున్నార్రా?" అంటూ ఇల్లంతా వెతుకుతూ వాకిట్లోకెళ్ళింది.

బాలాజీ కూడా పిల్లలకోసం వెతకసాగాడు.

"నర్సయ్యగారూ పిల్లలు మీ ఇంటికొచ్చారా?" కేక వేసింది ఝాన్సీ.



"లేదమ్మా" జవాబు వినిపించింది. మళ్ళీ కంగారుగా పెరట్లోకి పరిగెత్తింది. అక్కడ తులసికోట ముందు ప్రశాంతంగా నిద్రపోతున్నారు పిల్లలు. కటిక నేలమీద పడుకుని నిద్రపోతున్న పిల్లలను చూసి దుఃఖం ఆపుకోలేక పోయింది ఝాన్సీ. "నన్నుతిట్టండి కొట్టండి. కానీ పిల్లలముందిలా అరవకండి. మీకు నమస్కారం" విలపిస్తూ పిల్లలిద్దరినీ ఎత్తుకుని బెడ్రూములోకి తెచ్చింది. బాలాజీ తలవంచుకుని అపరాధభావంతో చూశాడు.

* * *

ఆఫీసులో-

కుర్చీలో కూర్చుని ఏవో లెక్కలు చూస్తున్నది ఝాన్సీ. అటెండరు వచ్చాడు. "పెద్దయ్యగారొచ్చారమ్మా" చెప్పాడు.

"కూర్చోమను." చెప్పింది ఝాన్సీ పరధ్యానంలో.

"ఛైర్మన్‌గారమ్మా" చెప్పాడు అటెండరు.

ఉలికిపడి లేచింది ఝాన్సీ. ఛైర్మన్,గోపాల్ వస్తున్నారు. "నమస్కారం సార్. నన్నుపిలవొచ్చుగా. మీరే రావడం...." అన్నది చేతులు జోడించి గౌరవభావంతో.

"రప్పించుకున్నావమ్మా. నేనే కాదు. కొండమీద జేజమ్మయినా దిగిరావల్సిందే." అని అటెండరువంక చూశాడు. ఒక కవరు అందించాడు అతను. దాన్ని తీసుకుని ఝాన్సీకి అందించాడు ఛైర్మన్.

"జీతం నేనే తీసుకుందునుగా... దీనికి మీరు స్వయంగా ఇవ్వడం..." ఆశ్చర్యంగా అన్నది ఝాన్సీ.

గోపాల్ జోక్యం చేసుకుని "మాడాడీకి డ్రామా లిష్టం. అన్నిటినీ డ్రమటైజ్ చేస్తారు. ఆయనకదో తుత్తి" అన్నాడు నవ్వుతూ.

ఛైర్మన్ కూడా నవ్వి మరో పెద్ద కవరును ఝాన్సీ చేతిలో పెట్టాడు."ఇది బోనస్ ఇరవైవేలు" అన్నాడు.

"తౌంటీ తౌజండ్స్" తానూ చెప్పాడు గోపాల్.



వారి అవ్యాజాభిమానానికి పులకించి పోయింది ఝాన్సీ. సముద్రంలో కొట్టుకు పోయేవాడికి చీపురు పుల్ల కనిపించినా బ్రతుకు మీద ఆశ చిగురిస్తుంది. ఒక ప్రత్యేక కారణంతో ఉద్యోగం చేస్తున్న తనకు ఈ ఇరవైవేలు ఇరవై లక్షలతో సమానం. తన కష్టం ఫలించే సమయం ఆసన్న మౌతున్నదంటే సంతోషించని ప్రాణి ఉంటుందా?ఝాన్సీ మనోభావాలను చదివాడు గోపాల్.

మామూలుగా రూల్సు ప్రకారం కాంట్రాక్టు వాళ్ళకి బోనసులివ్వరు. ఇవ్వకూడదు. కానీ నువ్వు స్పెషల్. నాకదో తుత్తి." అన్నాడు.

గోపాల్ మాటలకు ఆమోద సూచకంగా తలాడించి" దివాలా తీసే స్థితిలో ఉన్న కంపెనీకి ప్రాణం పోసి బోనస్‌లిచ్చే స్థాయికి పెంచావు. డైరెక్టర్లందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు. తండ్రి బిడ్డలను పొగడటం మంచిది కాదంటారు.ఇక పొగడను. నాకొక్కడే కొడుకను కున్నాను. ఇవ్వాల్టినుంచీ ఇద్దరను కుంటాను." ప్రేమాభిమానాలతో పలికాడు ఛైర్మన్.



"నో...నో...ఒక కొడుకు ఒక కూతురు అనుకోండి. కొడుకు దద్దమ్మ ...కూతురు జీనియస్..." సవరించాడు గోపాల్ సంస్కారం, సహృదయం మేళవించిన హృదయంతో.

ఛైర్మన్ నవ్వి "గాడ్ బ్లెస్ యూ.." అని నిష్క్రమించాడు. ఆయన వెంటే వెళ్ళున్న గోపాల్‌ను సైగ చేసి పిలిచింది ఝాన్సీ . "యస్ మిష్టర్ పెళ్ళాంగారూ" వెనక్కు వచ్చాడు గోపాల్.

'గోపాల్ ....నాకివాళో లక్షరూపాయల పనుంది. నాదగ్గర బ్యాంకులో దాచుకున్నది ఈ బోనస్‌తో కలిపి ఎనభై అయిదువేలయింది. నువ్వో పదిహేనువేలు అప్పుగా సర్దితే రెండు మాసాల్లో తిరిగిచ్చేస్తా." అన్నది.

ఆశ్చర్యంగా చూశాడు గోపాల్ "ఏనీ ప్రాబ్లెమ్?" సందేహంగా అడిగాడు.

"అడక్కుండా నే చెప్పేదైతే ముందే చెబుదును. ఇప్పుడు అడిగినా చెప్పను." నవ్వింది ఝాన్సీ.



" అడిగి లెంపకాయ తినడం.... నాకదోతుత్తి." అన్నాడు గోపాల్ చెంప తడుముకుంటూ.

నవ్వింది ఝాన్సీ.

''చెక్కా? క్యాషా?'' అడిగాడు గోపాల్.

''మొత్తం లక్ష రూపాయలు క్యాష్‌గా ఇవ్వు. రేపుదయం...'' తన అక్కౌంట్ నుంచి డ్రా చేసి ఇచ్చేస్తానని చెప్పబోతుంటే ''చెప్పఖ్ఖర్లేదు. పదినిమిషాల్లో పంపిస్తాను.''వెళ్ళిపోయాడు గోపాల్.

* * *

బాలాజీ ఇంట్లో

టీవీలో క్రికెట్ మ్యాచ్ వస్తున్నది. ఇరుగు పొరుగు వారు ఆడా మగా దాదాపు పాతికమంది హాల్లో కూర్చుని టీవీ చూస్తున్నారు. ఎంతసేపట్నుంచీ తిష్టవేశారో-కొంతమంది కూరలు తరుగుతున్నారు. కొంతమంది చపాతీల పిండి కలుపుతున్నారు. కొంత మంది టిఫిన్లు చేస్తున్నారు. మరి కొంత మంది ఎంబ్రాయిడరీ వర్క్ చేసుకుంటున్నారు. కొంతమంది చంటిపిల్లలను ఒడిలో కూర్చోబెట్టుకుని వేరుశనక్కాయలు తింటున్నారు. ఏదో వనభోజనానికో, పిక్నిక్కుకో వచ్చినట్లు అందరూ ఆబగా టీవీని చూస్తున్నారు.



టీవీలోఉన్నట్లుండి బొమ్మషేకవసాగింది.అంతలోనే ఏదో కొంప మునిగిపోతున్నట్లు"పిచ్చర్..పిచ్చర్ అలుక్కు పోయింది." అరిచింది అన్నపూర్ణమ్మ.

"డోంట్‌వర్రీ పైన ఏరియల్ మీద కాకి వాలుంటుంది. " అన్నాడు బాలాజీ నిబ్బరంగా.

"అసలూ ఈ మధ్య టీవీలో ప్రోగ్రాములు బాగుండటంలేదు. ఇందువల్లే నంటారా?" అడిగిందొకావిడ వెటకారంగా."ఆహా అదికూడా ఒక కారణం కావచ్చు" చెప్పాడు బాలాజీ.

ఇంతలో టీవీలో బొమ్మ పూర్తిగా పోయింది.

"అరెరె...రె" ఘొల్లున అరిచారందరూ

ఎవ్వరూ ఊహించని సంఘటన జరిగింది ఇంతలోనే.

ఓ కుర్రాడు పరిగెత్తు కుంటూ లోపలి కొచ్చాడు.

"టీవీ అంకుల్... మీ ఇంటిమీద టీవీ పందిరి పీకేశారు." చెప్పాడు.

"వ్వాట్" అంటూ నోరు తెరిచాడు బాలాజీ.

ఇంతలోనే ఇద్దరు వ్యక్తులు దౌర్జన్యంగా లోపలికి వచ్చారు. వస్తూనే ఒకతను టీవీ ఆఫ్ చేశాడు మరొకడు ప్లగ్ నుంచి వైర్ తీసి చుట్టేశాడు.



''బాలాజీకి కోపం వచ్చింది. ఏయ్...ఏంటా జులుం? ఎవరయ్యా నువ్వు" అన్నాడు.

"అంతేసార్....అరువుమీద నరుకిచ్చాం కదా. ఎవరు మీరనే అంటారు మరి?'' అన్నాడు టీవీ అతను.

''సుబ్బారావుగారూ మీరా?ఏంటండి? ఏమైంది?అడిగాడు బాలాజీ విషయం అర్థంకాక.

" అయిదునెల్ల వాయిదా మొత్తం బకాయి పడింది. వెరసి మొత్తం మూడున్నర వేలు తేలింది. ఇహ మావల్ల కాదు." అన్నాడతను కోపంగా.

కలహభోజనుడి కలియుగ అవతారమైన నర్సయ్య బోలెడు ఆశ్చర్యపోతూ "అదేంటి? మేడంగారు కరెక్టుగా కట్టేస్తారే?" అన్నాడు.

"కట్టేస్తే ఇలా మాకీ ఖర్మ మాకేంటండి? మాకేం వ్యాపారం చేదా?" తీవ్రంగా అన్నాడు సుబ్బారావు.

"అదికాదయ్యా ఒకసారి ఆఫీసుకు ఫోన్‌చేసి..." చివరి ఆశతో గొణిగాడు బాలాజీ.

"అడిగే వచ్చాంసార్. కట్టను....కట్టలేను... టీవీ తీసుకుపొండి. అని చెప్పారండీ." అన్నాడు సుబ్బారావు. బాలాజీకి మండిపోయింది ఒకప్పుడు తనకు నమస్కారాలు పెడుతూ టీవీని తెచ్చి ఇంట్లో పెట్టిన వ్యక్తి ఈ రోజు ఇంత నిర్లక్ష్యంగా మాట్లాడుతూ ఉంటే సహించలేక పోయాడు.



"పీక్కుపో అని చెప్పడానికి అదెవరు? అయామ్ ది బాస్." అన్నాడు గొంతుపెంచి.

"యస్... ఈ ఇంటికి యజమాని ఆయనే" వత్తాసు పలికాడు నర్సయ్య.

''అయితే డబ్బు కట్టండి స్వామీ." వెటకారంగా అన్నాడు సుబ్బారావు

పాపం! డబ్బెక్కడిది బాలాజీ దగ్గర?" అంత పొగరుగా అడిగితే ఈ టీవీ నాకఖ్ఖర్లేదు. తీసుకెళ్ళండి. ఐడోన్ట్ కేర్" చెప్పాడు బాలాజీ ఆడలేక మద్దెలఓడు అన్నట్టు. సుబ్బారావు టీవీ పట్టుకుపోతుండగా 'డాడీ...టీవీ' అని ఏడ్చాడు పిల్లాడు.

'ఛ...నోర్ముయ్' కసిరాడు బాలాజీ.

తననే అలా అన్నాడని భావించి వెనక్కుతిరిగి కోపంగా చూశాడు సుబ్బారావు.

"అబ్బే..నిన్ను కాదు. చంటాడిని" సర్దిచెప్పాడు నర్సయ్య. సుబ్బారావు అతని అసిస్టెంటుని తీసుకుని వెళ్ళిపోయారు.



అరువుసొమ్ము బ(ప)రువు చేటని ఊరికే అన్నారా పెద్దలు.

" నోరు మూసుకుని బయటకు నడవండి. నడమంత్రపుసిరి అని ..." ఎకసక్కెంగా మాట్లాడి బయటకు నడిచింది అన్నపూర్ణమ్మ.

"తప్పు...మూడునాళ్లముచ్చటంటే" చాలు. "విష్ణుమాయ" తానూ నవ్వాడు నర్సయ్య.

పిల్లలంతా అరుస్తూ బయటకు పరిగెత్తారు.

"సిరి తా పోయిన పోవును కరిమింగిన వెలగపండు కరణిని సుమతీ" వెళ్తూ వెళ్తూ వ్యాఖ్యానం చేశాడు ఒక తెలుగు పండితుడు.

"బాగా చెప్పారు" నవ్వాడో మేధావి.

"ఇన్‌స్టాల్‌మెంట్లో కొనాలంటే నాకు మహా చెడ్డ చిరాకు. రేపు కోర్టులో ఆస్తి మాదికాగానే డబ్బు మొత్తం ఒక్కసారే మొహాన కొట్టికొని పారేస్తా." అంటూ వెళ్ళిందో గాలిమేడల సుందరాంగి.



ఆ మాటలకు ఎగతాళిగా నవ్వుతూ మూతి మూడు వంకర్లు తిప్పిందొక జాంబవతి.

టీవీ పోయిందనే బాధకంటే వీరి పుల్లవిరుపు మాటలకు పుండు

మీద కారం రాసినట్లయింది బాలాజీకి.

"డాడీ..టీవీ" అని ఏడుస్తున్న కొడుకు చెంప వాయగొట్టి తాను నిస్సత్తువగా గోడకు చేరగిలపడ్డాడు.

* * *

స్కూలు ముందు కారు ఆపించింది ఝాన్సీ. కూతురు గేటు ముందు రెడీగా ఉంది. కూతురును కారెక్కించుకుంది. ఫైవ్‌స్టార్ చాక్లెట్టిచ్చింది. "ఎవరిదమ్మా పుట్టినరోజు?" అమాయకంగా అడిగింది కూతురు. "మనందరిదీ" సంతోషంగా చెప్పింది ఝాన్సీ."అందరమూ ఇవాళే పుట్టామా?" కళ్ళు చక్రాల్లా తిప్పి ప్రశ్నించింది కూతురు.

"యస్ యస్..హేపీ హేపీడే" అన్నది ఝాన్సీ నవ్వి.

"ఇవాళ మా అందరికీ కూడా బోనసులిచ్చారమ్మా" చెప్పాడు డ్రైవరు.

ఝాన్సీ ఆనందమేమిటో అతనికి తెలియదు.

* * *

ఇంట్లో బాలాజీ ఒంటరిగా, సర్వం కోల్పోయిన వాడిలా కూర్చున్నాడు. ఇందాకటిదాకా టీవీని చూసిన ప్రేక్షకులు వదిలేసిన చెత్తా చెదారం హాలంతా నిండి పోయింది. కుర్చీలన్నీ అస్తవ్యస్తంగా పడున్నాయి. పిల్లవాడు వళ్ళు తెలియకుండా పడుకుని నిద్రపోతున్నాడు.



ఝాన్సీ కారుదిగింది. డ్రైవర్ని కొంచెంసేపు వేచి వుండమని చెప్పింది. పిల్ల హుషారుగా లోపలకు పరుగెత్తుకొచ్చింది. "డాడీ.. అమ్మ చాక్లెట్టిచ్చింది. డ్రైవర్‌కు కూడా ఇచ్చాం. తమ్ముడేడీ?" అడిగింది బాలాజీని.

దిగులుగా కూర్చున్న భర్తను చూసి కవరు విప్పి నోట్లకట్టలను తీసింది. భర్తచెంత చేరి "చాలా హేపీగా వచ్చాను.....టీవీ గురించి మీకు కోపంవచ్చింది కదూ...సారీ. ఒక పెళ్ళి చెయ్యడానికి వెయ్యి అబద్ధాలు ఆడినా తప్పు లేదన్నారు. ఒక గొప్ప పనికోసం మీ దగ్గర ఒక్క అబద్ధమాడాను. ..," చెబుతూ నోట్ల కట్టలను భర్తకు చూపించింది. బాలాజీ నోట్ల వైపు చూశాడు. ముఖంలో భావం పలకలేదు.

"ఏం తెచ్చానో చూడండి. లక్ష...లక్షరూపాయలు... అర్థంకాలేదా? నాజీతం పదివేలైతే మూడువేలని అబద్ధం చెప్పింది దీనికోసమే. నోరు కట్టుకుని మీకూ పిల్లలకు ఏమీ ఇవ్వకుండా కష్టపడి దాచింది మీకోసమే. ఇవాళ ఇరవైవేలు బోనస్ ఇచ్చారు. మరో పదిహేను వేలు తక్కువైతే గోపాల్ దగ్గర చేబదులు తీసుకుని లక్షా పూర్తి చేశాను......"

ఆ మాట వినగానే బాలాజీ ముఖం మరింత ఎర్రబడింది. భర్త ముఖ కవళికలు గ్రహించలేని ఝాన్సీ ఉత్సాహంగా చెప్పుకు పోతున్నది. "ఆఫీసు కారును కూడా ఉండమన్నాను. తక్షణం ఆ కార్లో బ్యాంకు కెళ్ళి ఈ లక్షా వాడి ముఖాన కొట్టి వాడి ముక్కుమీద గుద్ది మీ ఉద్యోగం మీరు లాక్కోండి. లెండి..పదండి." భర్త చేతిలో నోట్ల కట్టలను ఉంచింది.



వాటిని చూడగానే బాలాజీ ముఖం కందగడ్డయింది. నిప్పులు కక్కుతున్న నయనాలతో వాటివంక చూశాడు. కళ్ళలో కణకణ మండుతున్న చంద్రనిప్పులను చూసి లేడి పిల్లలా వణికింది ఝాన్సీ. ఏమి జరగకూడదనుకున్నదో అదే జరిగింది.

"రా...క్ష...సీ" అని రౌద్రంగా గొంతు చించుకుని అరచి నోట్ల కట్టలను నేలకేసి విసిరి నేలకేసి కొట్టాడు బాలాజీ.

తండ్రి ఉగ్రనరసింహావతారం చూసి భయభ్రాంతులయ్యారు పిల్లలిద్దరూ. అంతటి కోపావతారంలో తండ్రిని ఇంతవరకూ చూసి ఎరగరు వారు. ఎత్తుకుని లాలిస్తూ, జోకులు,కథలు చెబుతూ ముద్దు మురిపాలతో ఆడించే తండ్రి మాత్రమే వారికి తెలుసు. ఇద్దరూ భయం భయంగా నోటికి తాళం వేసుకుని మెల్లగా బయటకు జారుకుంటు న్నారు.

బాలాజీ కేక విన్న కారు డ్రైవర్, ఇరుగు పొరుగు వారు వాకిలి ముందు చేరారు. భార్యా భర్తల సంవాదాన్ని "రామాంజనేయ యుద్ధం" నాటకం చూసిన రీతిలో ఆసక్తిగా చూస్తున్నారు.



"నువ్వు....నన్ను దొంగ కింద కట్టేశావా? " అడిగాడు బాలాజీ

"ఏమండీ...." గొంతు తగ్గించి మాట్లాడమన్నట్లు ప్రాధేయపూర్వకంగా అన్నది ఝాన్సీ.

"నోర్ముయ్...షట్ యువర్ బిగ్ బ్లడీ మౌత్. మాట్లాడితే చంపేస్తా. బ్యాంకు వాళ్ళు నింద వేస్తే ఖాతరు చెయ్యలేదు. కాలనీ వాళ్ళు నానా రకాలుగా అంటుంటే పట్టించుకోలేదు. ఇవాళ...నన్ను కట్టుకున్న పెళ్ళాం...నాతో పదేళ్ళు కాపురం చేసిన పెళ్ళాం...ఓరి దౌర్భాగ్యుడా...నువ్వు పచ్చి దొంగవి. అయినా నిన్ను భరిస్తున్నాను అనేసింది. నువ్వింత మాటన్నాక నేను బ్రతకటం దండగ. ఛస్తాను. పొడుచుకు ఛస్తాను." విసురుగా బయటకు వెళ్ళిపోబోయాడు బాలాజీ.

ఇరుగ పొరుగు వారంతా మెల్లగా తప్పుకున్నారు.

చలికాలంలో కురిసిన పిడుగుల్లా భర్త నోటివెంట వచ్చిన పరుష వాక్యాలకు కొయ్యబారిపోయి "ఏమండీ...ప్లీజ్" ఏడుస్తూ పెద్దగా అరిచింది. ఝాన్సీ.

ఆగాడు బాలాజీ.

"ఇది అన్యాయం. పోయిన ఉద్యోగం తిరిగి రావాలని నేను మంచి మనసుతో కష్టపడి డబ్బు తెస్తే పెడార్థాలు తీస్తారా?" ఆక్రోశించింది. వీరి గొడవ వింటూ పిల్లలు మెల్లిగా వీధిలోకి వెళ్ళి కారులో దాక్కున్నారు.



బాలాజీ మరింత రెచ్చిపోయాడు. "మంచి మనసా! నీకా? నీకసలు మనసంటూ ఏడ్చిందా అని? అంతా కుట్ర! నామీద పగబట్టావు. పగ సాధిస్తున్నావు. ఆనాడు జీతం ఎంత అంటే ఏడిశావు పోరా నీకెందుకు అనుకున్నావు. అబద్ధం చెప్పి నన్ను వెధవ క్రింద చూశావు. నీకు ఫోనొచ్చిన రోజే ఊహించాను నీకు జీతం మూడు వేలు కాదని. ఆనాడు ఏదో హడావిడిలో నేను స్కూలుకు వెళ్ళకపోతే నన్ను పని వాడిలా కసిరి కొట్టావు. నువ్వు వద్దన్నా టీవీ తెచ్చానని... దాన్ని బయటకు లాగించేసి... పదిమంది లోనూ నన్ను పరాభవించేశావు. ఇవాళ..... దొంగవెధవా నువ్వు డబ్బులు కొట్టేసిన నేరం ఒప్పుకుని జైలుకుపో...నేను గడిస్తున్నాను. నువ్వులేక పోయినా మేము బాగా బ్రతకగలం అని తేల్చేశావు. ఇదంతా నీ పతిభక్తా లేక పొగరా?" ఆవేశంగా అరిచాడు.



చుట్టు పక్కల జనం,కారు డ్రైవరు తమను గమనిస్తున్నట్లు గ్రహించిన ఝాన్సీ వెళ్ళిపొమ్మని డ్రైవరుకు సైగచేసింది.

-(ఇంకావుంది)



"ఏవండీ! ఇలారండి", పిలిచింది భార్య భర్తని, పూజచేసుకుంటూ.
"ఎందుకే" వస్తూ అడిగాడు భర్త
"ఏం లేదు... గుండ్రాయి కనబడడం లేదు. కొబ్బరికాయ కొట్టాలి మీ బుర్ర చాలా గట్టిదని చెప్పుకుంటూ ఉంటారుగా. ఇలా వచ్చి వంగండోసారి " అంటూ కొబ్బరికాయ చేతిలోకి తీసుకుందా పతివ్రతా శిరోమణి.

ప్రియురాలు: ఇదేంటీ, శ్మశానానికి తీసుకొచ్చావ్...?
ప్రియుడు: మరి 'పంచ భూతాల సాక్షిగా పెళ్ళి చేసుకుందాం' అన్నావుగా!



"డాక్టర్!డాక్టర్!"
"ఊ వింటున్నాను చెప్పండి. మీ ప్రాబ్లమేంటో"
"ఒకటే విసుగు, కోపం, తొందర"
"ఊ"
"అసంతృప్తి,అసహ్యం,అరవడం"
"ఊ"
"వీటికి తోడు పై అధికార్ల వత్తిడి"
"ఊ"
"ఇవన్నీ ఎక్కువై తరచూ అనారోగ్యం పాలౌతున్నాను. ఇవన్నీ పోయే మందు ఏదైనా ఇవ్వండి, డాక్టర్."
అరనిముషంలో చీటి వ్రాసి ఇచ్చాడు డాక్టరు. దానిమీద ఇలా వ్రాసి ఉంది -
"హాసం - 15 రోజులకొకటి"



ఈ జోకులు పంపించిన వారు- రమణ శాస్త్రి,సంగారెడ్డి




"ఆ కొండమీద గుడి చూశావా? ఒక సేట్ కట్టించాడు. కోటిరూపాయలు ఖర్చయ్యిందట"
"అంతా బాగానే ఉంది. మరి మెట్లేవి? ఎలా ఎక్కడం...!?"
"డబ్బుల్లేవట... ఆలయం ముందు ఒక చిన్న మెట్టు కట్టి ఆపేశాడు"



"నాకీ మధ్య ఆపోజిట్‌గా మాట్లాడ్డం అలవాటైపోయిందిరా ఉదాహరణకి మా అబ్బాయి చాలా సన్నగా ఉంటాడు వాణ్ణి 'ఏరా బడ్డూ' అనిపిలుసుంటాను. మాయింటికొచ్చిన బిచ్చగాడిని 'ఏమోయ్ చక్రవర్తీ 'అంటాను"
"బాగానే ఉందిరా మరి నన్నెలా పిలుస్తావ్"
"ఏరా గుర్రం బావున్నావా"అంటాను.



"ఒకప్పుడు ఈ ఇంట్లో చాలా భయంకరమైన దెయ్యాలుండేవి - ఇప్పుడు లేవు" అందొకామె పొరుగింటామెతో
"భూతవైద్యం చేయించారా?"
"అదేంలేదు. మా అత్తగార్ని తెచ్చిపెట్టుకున్నాం"

ఒకామె లేడీ డాక్టరు దగ్గరకు వచ్చి
"డాక్టరు గారూ కడుపు నొప్పి - చాలా తీవ్రంగా ఉంది" అంది.
వెంటనే ఎక్స్‌రే తీయించి
"అయ్యబాబోయ్ ఇందులో బంగారు చైనుంది" అని మనసులో అనుకుందా డాక్టర్ ఎక్సరేచూడగానే.
ఆ మాట బైటకు చెప్పకుండా "అర్జంటుగా ఆపరేషన్ చేయాలి" అంది.
"ఎంతవుతుంది డాక్టర్" అందా పేషెంట్ నీరసంగా.
"ఏమో బంగారం ఇప్పుడు తులం ఏ రేట్లో ఉందో నాకేం తెలుసు" అందా నగలపిచ్చి డాక్టర్ చటుక్కున.



ఈ జోకులు పంపించిన వారు-ఐ.రమామణి.మహాలక్ష్మీపురం, విజయనగరం జిల్లా



ఓ బందిపోటు దొంగ ఓ బ్యాంక్ లో చొరబడి కౌంటర్ క్లర్క్‌కి పిస్తోలు గురిపెట్టి, "నీ దగ్గరున్న డబ్బంతా ఈ సంచిలో వేసివ్వు. క్విక్" అని అరిచేడు.
"సారీ! ఇది రిసీట్స్ కౌంటర్ మాత్రమే! పేమెంట్స్ కౌంటర్ అటుప్రక్కనుంది" అన్నాడా క్లర్క్ వణికిపోతూ



"అదేమిటండీ అన్ని బస్సులూ వెళ్ళిపోతున్నా ఏదీ ఎక్కరేం?"
"ఇరవై ఏడో నంబరు బస్ ఎక్కమన్నాడండి మా బావ. యిప్పటిదాక వెళ్ళింది వద్దెనిమిది బస్సులేకదా !"




"నాన్నా ! ఎవరో వచ్చారు"
"ఎవర్రా అది?"
'ఎవరో మీసాలాయన"
"వెళ్లమను - మనకి మీసాలక్కర్లేదు"





వంట గదిలోంచి గాజుగ్లాసు క్రింద పడి పగిలిన చప్పడు వినిపించింది
"అది అమ్మచేతిలోంచే పడి పగిలిపోయింది" అన్నాడు హాల్లో ఉన్న బాబు
"అలా ఎలా చెప్పగలవు? నాన్న కూడా వంటింట్లోనే ఉన్నాడు కదా?" అంది పాప.
"గ్లాసు నాన్న చేతిలోంచి పడి పగిలి ఉంటే అమ్మ యిప్పటి వరకూ ఎలా నిశ్శబ్దంగా ఉండగలుగుతుంది?" అన్నాడు బాబు.

**ఈ జోకులు పంపించిన వారు-కోనే నాగ వెంకట ఆంజనేయులు, విశాఖపట్టణం**



"మన రాష్ట్రంలో కీలక సమస్య గావించిన మద్యపాన నిషేధాన్ని ఎజెండాలో పెట్టినా మీరు గెలవలేక పోయారేంటి?" విలేకర్లు అడిగారు మంత్రిని.
"ఏంచేస్తాం తాగుబోతులు మొత్తం నాకు ఓట్లెయ్యడం మానేశారు మరి" అన్నాడా మంత్రి గారు ఘొల్లుమంటూ.



ఒక బిచ్చగాడు ఘోరంగా తపస్సు చేశాడు
దేవుడు ప్రత్యక్షమై "నీకేం కావాలి?" అన్నాడు.
"ఓ పది రూపాయలిప్పించండి స్వామి" అన్నాడా బిచ్చగాడు
"మరీ అంత తక్కువా...!?" హాశ్చర్యపోయాడు దేవుడు
"చాలు స్వామి... నా పక్కనున్న బిచ్చగాడు తన బొచ్చెలో ఐదు రూపాయిలున్నాయని తెగ విర్రవీగుతున్నాడు. మీరిచ్చే పదిరూపాయిలు చూపించి వాడి గర్వం అణిచెయ్యాలి" అన్నాడా ముష్టితపోధనుడు.

ఒకింట్లో దొంగతనం చేస్తూ పోలీసులకు దొరికిపోయాడో దొంగ
"అరగంట క్రితం ఈ ఇంట్లో దొంగతనం జరిగింది. మళ్ళీ మరొకడివా?" అన్నాడు పోలీసు.
"ఇందాక దొంగతనం చేసింది నేనేనండి సైకిల్ తాళం ఇక్కడ వదిలేశానేమోనని మళ్ళీ రావల్సి వచ్చింది! ఖర్మ..." అన్నాడా చోర శిఖామణి



**ఈ జోకులు పంపించిన వారు-ఐ.యస్.కుమార్,జి.ఎల్.పురం**

ఓ తెలుగు మాష్టారు పుట్టింట్లో వున్న భార్యకిలా ఉత్తరం రాశారు.
"నీ ఆరోగ్యం గురించి ఒక్క వాక్యంలో సమాధానం రాయి.
చంటిదాని ఆట,పాట,అల్లరి కబుర్ల గురించి క్లుప్తంగా రాయి.
మన వంటింటి అలమారు పటం గీసి అందులో ఉప్పు, పప్పు, పంచదార ఎక్కడున్నదీ గుర్తించు.
పై ప్రశ్నలన్నింటికి తప్పనిసరిగా ఏ తప్పులేకుండా సమాధానాలు రాయి"



**ఈ జోకు పంపించిన వారు-మామిడి మహేంద్ర,పూణే**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన రమణశాస్త్రి (సంగారెడ్డి), ఐ.రమామణి(మహాలక్ష్మీపురం), కోనే నాగవెంకట ఆంజనేయులు(విశాఖపట్నం), ఐ.యస్.కుమార్(జి.ఎల్.పురం), మామిడి మహేంద్ర(పూణే)గార్లకు శ్రీ గజల్ శ్రీనివాస్ 'నేను-నా ఇల్లు' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.





ప్రముఖ దర్శకుడు
**శ్రీ సింగీతం శ్రీనివాసరావు**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

## కరాజు కథలు

**5**

# ఉత్తర జిల్లా దక్షిణ జిల్లా



**మం**త్రి ఇలాంటి సంకటాన్ని ఎన్నడూ అనుభవించలేదు. కరాజు రాజ్యంలోని ఎన్నో సమస్యలను తన పాలనా దక్షతతో పరిష్కరించాడు. కానీ ఇవ్వుడతను ఎదుర్కొంటున్న సమస్య చిత్రమయినది. దాని కథావివరాలు ఇలావున్నాయి.

కొంతకాలంక్రింద కరాజు మంత్రిని పిలిపించి "మంత్రీ! మీ అంచనా ప్రకారం మన ప్రజలు ఎంత సంతోషంగా ఉన్నారు?" అని కొత్త సందేహాన్ని వెలిబుచ్చాడు.

"చాలా సంతోషంగా ఉన్నారు మహారాజా! అక్కడక్కడా కొందరు తాత్కాలికంగా దుఃఖాన్ని ఎదుర్కోవచ్చు - గాయమో,రోగమో,మరణమో - ఈ దైవిక కారణాలవల్ల ఆయా కుటుంబీకులు దుఃఖం అనుభవించక తప్పదు. కానీ రోజూ ప్రజాబాహుళ్యమంతా సుఖంగానే ఉన్నారు." అన్నాడు మంత్రి.

"నేనూ అలాగే నమ్ముతున్నాను. కానీ ఎక్కడో ఒక చాకలి వాడు ఇలా అనుకుంటున్నాడని ఎవరో చెప్పేవరకూ రాముల వారికే తెలియలేదు ఊళ్ళో ఏమనుకుంటున్నారో. అందుకని మీరు వెంటనే మన రహస్య క్రియా నిపుణులను పంపి ఇప్పుడు మన ప్రజల సంతోష స్థాయి ఎంతుందో ఒక అంచనా వేయించండి" అన్నాడు కరాజు.

నిపుణులు కొంతమంది పరిశోధనలు చేసి మంత్రికి రహస్య నివేదికను సమర్పించారు. అది చూసి మంత్రి తెల్లబోయాడు. నివేదికలో తానను కున్న దానికి తారుమారుగా ఉంది. ఒక కుటుంబంలో ఒకరు మరణిస్తే, చూడ్డానికి అందరూ రోదిస్తున్నా, రహస్య పరిశోధన ప్రకారం వారంతా లోలోపల సంతోషిస్తున్నారు. గాయపడిన వాడు నొప్పి బాధను ప్రకటిస్తూనే పనిపాట్ల నుంచి తప్పించుకున్నందుకు సంతోషిస్తున్నాడు. నడుము విరిగి మంచానబడ్డ ఒక స్త్రీ తనకు చాకిరీ నరకం తప్పిందనీ, కొన్నాళ్ళు మొగుడే తనకు వండిపెడ్తాడని లొట్టలేస్కుంటూంది. ఇక సంతోషంగా ఉన్నారనుకున్న ప్రజా బాహుళ్యం చూస్తే, నివేదిక ప్రకారం అందరూ దుఃఖంలోనే ఉన్నారు. ఇచ్చే డబ్బు గోరంత - చేసే బాకీ కొండంత అని గోలపెట్టే ఉద్యోగస్తులు, "లాభాలు తక్కువయ్యాయి, అంటే నష్టమేకదా?" అని ఏడ్చే వ్యాపారస్థులూ, కూతురికి పెళ్ళయిందనే సంతోషంకన్నా, ఉన్నదంతా ఊడ్చుకుపోయిందని తలపట్టుకున్న తండ్రి, ఎవర్నో పెళ్ళాడాలనుకుంటే ఎవర్తోనో పెళ్ళయిందని లోలోపల దుఃఖించే పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ - ఇలా ఇంచుమించు అందరూ దుఃఖించేవాళ్ళేగాని సంతోషంగా ఉండేవాళ్ళెవ్వరూ లేరు.

ఇవ్వుడు ఈ నివేదికను కరాజుగారికి సమర్పించాలా వద్దా అన్నది మంత్రి సందిగ్ధం. రాజుగారు

దాన్ని చూస్తే ఏమంటారు? "మంత్రీ! ఈ నివేదికను నాకు చూపడం ఎందుకు? మీరే బాధ్యత వహించి, మనమేం చేస్తే ప్రజలంతా సంతోషంగా ఉంటారో కనిపెట్టి, ఈ సమస్యను పరిష్కరించండి" అంటాడు. అంతకన్నా, తనే ఒక మార్గాన్ని ఆలోచించి సాధిస్తే రాజుగారి మెప్పును సంపాదించవచ్చని నిర్ణయించుకున్నాడు మంత్రి.

కానీ ఎంత తల బాదుకున్నా దీనికి పరిష్కార మార్గం మంత్రికి తట్టలేదు. ఈ సమయంలో ఒక సలహాదారుడు ఒక ఆసక్తికరమైన వార్తనంద చేసాడు.

పడమటి కొండలకావల అంబరపురం నగరంలో ఒక వ్యక్తి ఉన్నాడట. అతని పేరు ఉత్తరజిత్తు. అతనిదొక విచిత్రమైన వ్యాపారం. అందరికీ సంతోషాన్ని అమ్ముతాడట. వందలాది మందికి సంతోషాన్ని అమ్మి అతను కోటీశ్వరుడయ్యాడట.

ఈ వార్తవిని మంత్రి పరమానంద భరితుడయ్యాడు. ఉత్తరజిత్తును తన నగరానికి పిలిపిస్తే, ఇక్కడి జనమంతా అతని దగ్గర సంతోషాన్ని కొంటారు. అనతికాలంలోనే తన ధ్యేయం నెరవేర్తుంది. అనుకున్నదే తడవుగా తక్షణం బయలుదేరి రావలసిందని ఆదేశించాడు.

కానీ అక్కడ తెలిసొచ్చిన నిజం. ఉత్తరజిత్తు



మంత్రి ఆజ్ఞాపించగానే వచ్చేసే అందరిలాంటి సామాన్యుడు కాదని. ఈ సంవత్సరం తనకు ఖాళీ లేదన్నాడు. మేఘాల్లో విహరిస్తున్నవాణ్ణి తంతే కింద పడ్డట్టయింది మంత్రిపని. తన అవసరం గనక తనే ఉత్తరజిత్తు దగ్గరకు వెళ్ళాడు.

రాజభవనాన్ని మించిన ఉత్తరజిత్తు నివాసం, అతని సిబ్బంది, వాళ్ళ హంగామా చూసి మంత్రి నివ్వెరబోయాడు. ఎన్నో ద్వారాలు దాటి చివరకు అతన్ని కలిసాడు మంత్రి. ప్రాధేయ పడగా పడగా కడకు రావడానికి అయిదు బండ్లు, యాభై గుర్రాల మీద వస్తారుట. వాళ్ళకు కావలసిన భోజన, నివాస వసతులన్నీ మంత్రిగారే ఏర్పాటు చెయ్యాలట.

ముఖాన చిరునవ్వు తెచ్చుకుని అన్నిటికీ సరేనన్నాడు మంత్రి.

ఇక్కడి జనంలో సంతోషాన్ని కొనడం ఏమిటో చూడాలనే ఆసక్తి మొలకెత్తింది.

ఎట్టకేలకు ఉత్తరజిత్తుని సంతోష విక్రయప్రక్రియ ప్రారంభం అయ్యింది.

కళ్యాణ మంటపాన్ని బోలిన విశాలమైన ఒక మందిరం. దానికి పలుద్వారాలు. ప్రజలు ఈ ద్వారాల దగ్గరున్న సిబ్బందికి పైకము చెల్లించి, మందిరంలో ప్రవేశించి ఆసీనులయ్యారు. కాస్సేపటికి ఉత్తరజిత్తు ప్రవేశించాడు. జరీఅంచు వేసిన రంగురంగుల పట్టు వస్త్రాలతో అతను మెరిసిపోతున్నాడు. అతనివెంట ఇద్దరు అనుచరులు. వాళ్ళ చేతిలో విభూతిలో నిండిన రెండు పెద్ద పాత్రలు. ఉత్తరజిత్తు తన ఉపోద్ఘాతాన్ని మొదలెట్టాడు.

"సంతోష మారుతాన్ని ఆస్వాదించ వచ్చిన సోదరులారా! సోదరీమణులారా!. (అంతా చప్పట్లు). దుఃఖం అంటే ఏమిటి? ఉండాలనుకున్నది లేనప్పుడు కలిగే చేదు 'అనుభవం'. సంతోషం అంటే ఏమిటి? కావాలనుకుంది ఉంటే కలిగే తీపి 'అనుభవం' మనకు ఉండటం ముఖ్యం కాదు. ఉన్నప్పుడు కలిగే 'అనుభవం' ముఖ్యం. అమూల్యమైన ఈ అనుభవాన్ని చౌకగా ఇప్పుడు మీకు అందచేస్తున్నాను" అంటూ చేతిలోని విభూతి తీస్కొని అందరిమీదా చల్లాడు. ఆ క్షణం మందిరం అంతా చీకటైపోయింది. అందరూ చూస్తున్నవైపు ఒక వెలుగొచ్చి అందులో కొన్ని అద్భుత దృశ్యాలు కనిపించాయి. ఈ పరిసరాల్లో ఎవ్వరూ చూడని సుందర ప్రదేశాలు, భవనాలు, ఉద్యానవనాలు - అందులో విలాసంగా విహరిస్తూ హాయిగా జీవితాలను గడిపే అందమయిన స్త్రీ పురుషులు. క్రమేణా చూసేవారంతా ఆ దృశ్యంలో ఒకరై ఆనందానుభూతిని పొందుతున్నారు. ఎక్కడెక్కడ ఎవరెవరికి ఏమేమి లేవో వారంతా అవి ఉన్న సంతోషాన్ని పొందుతున్నారు. ఈ సంతోషం అంతా ఇంతా కాదు. మందిరం నుంచి బయటకి వచ్చిన చాలాసేపటి వరకూ ఇది గుడ్డకు అంటించిన అత్తరులా ఘుమఘుమ లాడ్తూనే ఉంది.

ప్రక్రియ విజయవంతమయింది. సంతోషాన్ని కొనే వారిసంఖ్య వందలనుంచి వేలకు పెరిగింది. చూసినవాళ్ళే మళ్ళీ మళ్ళీ వెళ్ళి విభూతి చల్లించుకొని ఆనందిస్తున్నారు. లేనివారు ఉన్నవారిలా ఆనందాన్ని పొందుతుంటే, మరికొందరు ఆడామగా కూడా, రకరకాల శృంగారపు ఆనందాల్ని పొందుతూ, మనసారా మెచ్చుకుంటున్నారు. అనతికాలంలోనే నగరమంతా ప్రజల సంతోషంతో నిండిపోయింది. మంత్రి హాయిగా ఒక నిట్టూర్పు విడిచాడు. ఆ క్షణమే అతనికి ఒక నిజాయితీ పరుడైన ప్రభుత్వోద్యోగి ద్వారా ఒక భయంకరమయిన నిజం తెలిసివచ్చింది.

చిన్నమొత్తానికి పెద్దసంతోషం కొనడానికి అలవాటుపడ్డ జనం వాళ్ళ దైనందిక వృత్తుల మీద చిన్నచూపు చూసారు. పనిచేసే వారంతా సగంపని కాకముందే దాన్ని ఆపేసి సంతోషం కొనడానికి పరుగెత్తారు. విద్యార్థులకిప్పుడు విభూతి చల్లించుకుని నేర్చుకున్నదే ముఖ్యమయిన విద్య అయింది. దీని ప్రభావం - ఇప్పుడు పని చేసేవాళ్ళెవ్వరూ లేరు. అంతా ఉన్నది తినేవాళ్ళే. ఇలా తింటూంటే ఉగాది వచ్చేసరికి తినడానికేం ఉండదు. ఇది ప్రజలకు ఎంత నచ్చచెప్ప ప్రయత్నించినా, వినిపించుకునే స్థితిలో ఎవ్వరూలేరు. ఇదన్నమాట మొదట్లో చెప్పిన మంత్రిగారికిప్పుడు వచ్చిన పెద్ద సంకటం. ఈ పరిస్థితిలో రాజుగారికి విషయం చెప్పకపోతే ప్రమాదం అనుకున్నాడు మంత్రి.

కరాజు కథంతా విన్నాడు.

"మంత్రీ! దీనికొక మార్గం ఉంది. నేచెప్పినట్టు చెయ్యండి" అన్నాడు కరాజు. మంత్రికి నెత్తినున్న కొండను ఎవరో దించినట్టయింది.

"మీరు వెంటనే వెళ్ళి, దక్షిణజిత్తును కలిసి అతన్ని మన నగరానికి ఆహ్వానించండి" అన్నాడు కరాజు.

"దక్షిణజిత్తా? అదెవరు?" అన్నాడు మంత్రికంగారుగా

"ఉత్తరజిత్తులాంటి మరొక సంతోష వ్యాపారి"

"ఒక్కరితోనే సతమతమౌతుంటే ఇద్దరా మహారాజా?"

"సందేహించకండి మంత్రీ! నేను చెప్పినట్టు చేయండి"

మంత్రి దక్షిణ జిత్తును కలిసాడు. హంసా నదికి దక్షిణాన ఉన్న అతనికి ఉత్తరజిత్తుకున్న హంగులన్నీ ఉన్నాయి. కాకపోతే ఇలాంటి వాటికి

మంత్రి ఇప్పుడు అలవాటు పడున్నాడు గనక పెద్దగా ఆశ్చర్యపోలేదు.

దక్షిణజిత్తు ఆగమనంతో ఇంతవరకూ ఏకైక సార్వభౌముడిగా వెలుగుతున్న ఉత్తరజిత్తులో ఒక చిన్న చలి పుట్టుకొచ్చింది. ప్రజలు మాత్రం ఈ కొత్త సంతోషాన్ని అనుభవించేందుకు ఉరకలు వేసారు. కారణం, దక్షిణజిత్తు కొత్త ఆకర్షణగా అందించిన సంతోషసారం - భీభత్సం! చంపుకోడం, నరుక్కోడం లాంటి సంఘటనలతో పూర్తిగా లీనమై, మునుపెన్నడూ అనుభవించని ఆనంద మకరందాన్ని ఇప్పుడు ఆసక్తితో వున్నారు ప్రజలు.

ఉత్తరజిత్తు వ్యాపారానికి ఎదురుదెబ్బ తగిలింది. ఇప్పుడు ఇద్దరిమధ్యా పోటీ పెరిగింది. మా దగ్గర కొన్నవారు "ఆహాహా" అంటున్నారంటే, మాదగ్గర కొన్నవారు "ఓహోహోహో" అంటున్నారనీ, కాదు "ఇహిహిహి" అని ఇకిలిస్తున్నారని, ఇలా మాటల యుద్ధం పెరిగి, వ్యూహాల ఆలోచనలోకి దారితీసింది.




ఉత్తరజిత్తు ఒక పన్నాగం పన్నాడు. అర్ధరాత్రిలో దక్షిణజిత్తు నివాసంలోకి రహస్యంగా దూరి, ఎవ్వరికీ తెలియకుండా అక్కడున్న మంత్ర విభూతిని దొంగిలించి, దాని స్థానంలో మంత్ర హీనమయిన విభూతిని పెట్టమని తన అనుచరులకు ఆజ్ఞాపించాడు. "ఇదే సమయంలో ఇదే ఆలోచన దక్షిణ జిత్తుకు కూడా వచ్చింది. ఇలా ఒకరికి తెలియకుండా ఒకరు ఎదుటివాడి మంత్ర విభూతిని దొంగిలించి, మంత్ర హీనమయిన విభూతిని పెట్టేసారు. ఉదయం అయ్యేసరికి ఎవరికి వారు ఎదుటివాడు నవ్వులపాలు కాబోతున్నాడనుకుంటూ మురిసిపోతున్నారు.

ఆరోజు సంక్రాంతి. తాము కొనబోయే సంతోషం అపూర్వమై ఉంటుందనే భావనతో అందరూ ద్విగుణీకృతమయి పైకం చెల్లించారు.

అక్కడ ఉత్తరజిత్తు, ఇక్కడ దక్షిణజిత్తు ఏకకాలంలో వచ్చిన వారి వారి ముందున్న ప్రజలమీద విభూతి చల్లారు. కానీ, ఎవ్వరూ ఊహించని ఘోరం. ఇప్పుడు కనిపించిన దృశ్యాలు పేలవంగా ఉన్నాయి. కొన్నివందల సార్లు చూసినవిగా ఉన్నాయి. ఆకలితో మలమల మాడేవానికి పురుగులున్న ఆహారం వడ్డించినట్టు అనిపించింది. పుష్పక విమానంలో ఎగిరేవాడు కాలుజారి కిందపడి ఎముకలు విరగ్గొట్టుకున్నట్ట నిపించింది. ప్రజల్లో ఆగ్రహం ఒక్కసారిగా ఉప్పెనలా విజృంభించింది. వారిని మోసం చేసిన జిత్తులకు తగిన శిక్ష విధించాలని నినాదాలు చేస్తూ వాళ్ళ మీదికి విరుచుకు పడ్డారు. భయాక్రాంతులైన ఉత్తర దక్షిణ జిత్తులు దౌడు తీసారు. దొరికిన గుఱ్ఱాలనెక్కి మళ్ళీ తిరిగి చూడకుండా నగర పొలిమేరలను దాటుకున్నారు.

కథ సుఖాంతంగా ముగియడంతో మంత్రి పరమానంద భరితుడయ్యాడు. ఈ సమయంలో వార్తాహరుడొకడు వచ్చి

"మంత్రి ప్రభో! ఎవరో పశ్చిమజిత్తట.. మిమ్మల్ని కలవాలట" అన్నాడు. మంత్రిగారు రౌద్రాకారుడై "పశ్చిమజిత్తుకాదుకదా, ఏదిక్కు జిత్తైనాసరే, ఈ రాజ్యంలో కాలుపెడితే వాడికాళ్ళు విరగ్గొట్టామని రాజ్యమంతా చాటించమని చెప్పు" అని ఘర్జించాడు తన అధికార దర్పానికి తానే మురిసిపోతూ.

## హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

### 1961

యువ సంగీత దర్శకులకు ఆరాధ్యదైవం రాహుల్ దేవ్ బర్మన్ మెహమూద్ నిర్మించిన 'ఛోటే నవాబ్' చిత్రం ద్వారా సంగీత దర్శకునిగా పరిచయం. లతా సోలో 'ఘర్ ఆ జా ఘిర్ ఆయే...', రఫీ-లతా డ్యూయెట్స్ 'మత్‌వాలీ అంఖో వాలీ', 'ఆజ్ హువా మేరా దిల్ మత్‌వాలా' ఇప్పటికీ హిట్ గీతాలుగానే వెలుగొందుతున్నాయి.


ఆర్.డి.బర్మన్

'ఇలాహి తూ నున్ లే హమారీ దువా' పాటను లో రఫీ చేత ముద్దు ముద్దుగా పాడించి తన మొదటి చిత్రం నుండే ప్రయోగాలకు శ్రీకారం చుట్టారు ఆర్.డి. ఇదే తరహా ప్రయోగం 2002లో 'వాహ్..తేరా క్యా కెహనా' చిత్రంకై జతిన్- లలిత్ చేశారు.

ఆర్.డి. అభిమాన గాయకుడు కిశోర్ కుమార్ 'ఝుమ్రూ' చిత్రం ద్వారా సంగీత దర్శకునిగా మారింది ఈ సంవత్సరమే. ఈ చిత్రంలోని టైటిల్ సాంగ్ ను కిశోర్‌కుమార్ వ్రాశారు.


'ఝుమ్రూ'లో ఓ సన్నివేశం

ఎస్.డి.బర్మన్ అసిస్టెంట్ జయదేవ్ 'హమ్ దోనో' చిత్రం ద్వారా తన కెరీర్‌లో బిగ్గెస్ట్ హిట్ కొట్టారు. ఈ చిత్రం కోసం సాహిర్ అందించిన సాహిత్యం ( అల్లా తేరో నామ్, కభీ నా జావో, జహాఁ మే ఐసా కౌన్ హై, మై జిందగీ కా సాథ్ నిభాతా చలా గయా) ఇప్పటికీ శ్రోతలను అలరిస్తూనే ఉంది.


'హమ్‌దోనో'లో ఓ సన్నివేశం

శంకర్-జైకిషన్‌ల అసిస్టెంట్ దత్తారాం 'జిందగీ ఔర్ ఖ్వాబ్' చిత్రానికి సంగీతాన్నిచ్చారు. 'న జానే కహాఁ తుమ్', 'కటేలి కటేలి' పాటలు హిట్ అయ్యాయి. సుమన్ కళ్యాణ్‌పురి పాడిన 'కటేలి' గీతం 1969లో శంకర్ 'షత్‌రంజ్' చిత్రంకోసం స్వర పరిచిన 'బతకమ్మ బతకమ్మ' గీతానికి ఇన్‌స్పిరేషన్ అయింది.

-(వచ్చే సంచికలో మరికొంత)

జనవరి 29 బాలాంత్రపు రజనీకాంతరావు గారి పుట్టినరోజుని పురస్కరించుకుని...

# స్వరవసంతం రజనీకాంతం

-దూసి ధర్మారావు

లలితసంగీత ప్రపంచంలో విరబూసిన పాటల ఆమని బాలాంత్రపు రజనీకాంతరావు. ఆకాశమంతా వ్యాపించిన సుస్వరాల పరిమళాల హేల బాలాంత్రపు రజనీకాంతరావు. ఆయన 1920 జనవరి 29వ తేదీన కవిపండిత వంశంలో జన్మించారు. వంగసాహిత్యాభిమానమూ, హిందుస్థానీ సంగీత ప్రభావమూ కలగలిసిన అపురూప సంస్కృతీ మూర్తి బాలాంత్రపు రజనీకాంతరావు. విద్యార్థి దశలోనే 'పూషా' కలం పేరుతో శ్రీశ్రీ పరాభిల కవితా ప్రభావంతో వారు రచించిన గేయకవితలు బహుళ ప్రజాదరణ పొందినవి. రేడియో ఉద్యోగంలో ప్రవేశించకముందే 'చండీదాసు' 'గ్రీష్మఋతువు' వంటి స్వీయ రచనలకు స్వర రచన కూడా చేసి ప్రతిభా కేతనం ఎగుర వేశారు.

1942లో రేడియోలో చేరిన నాటి నుండి వారి సంగీత సాహిత్యాల నర్తనశాలలు రేడియో కేంద్రాలే. ఆ రోజుల్లో ఇంటింటా మారుమోగిన 'శతపత్ర సుందరి' 'మ్రోయింపుము జయభేరి' 'మనప్రేమ' 'పోయిరావే కోయిలా' 'కోపమేల రాధా' 'జాబిల్లి వస్తున్నాడు' రొదసేయకే తుమ్మెదా వంటి పాటలు వారి లలిత సంగీత సృజనలో పై షడ్జమాలు. వారు అజ్ఞాతంగా పనిచేసిన స్వర్గసీమ(1945) గృహప్రవేశం(1946) సినీమాలలో 'ఓహోహో ! పావురమా!', 'మేలుకో ఓ భారత నారీ!' వంటి పాటలు ఇప్పటికీ సంగీతాభిమానుల మననులలో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి.



లక్ష్మమ్మ(1950), పేరంటాలు(1951) సినిమాలకు అన్ని పాటలూ రజనీకాంతరావే స్వరపరిచారు. విజయవాడ రేడియో కేంద్రం నుండి ప్రసారమైన 'భామాకలాపం', ప్రహ్లాదచరిత్ర, ఉషాపరిణయం, రుక్మిణీకళ్యాణం, గంగాగౌరీవిలాసం, కళ్యాణశ్రీనివాసం వారి కల్పనాత్మక చరిత్రలో మైలురాళ్ళు. 'ఆదికావ్యావతరణం', మేఘసందేశం, కామదహనం, సంగీతరూపకాలు పై షడ్జమాలు. ఈనాడు మనం వింటున్న అనేక అన్నమయ్య కీర్తనలను స్వరపరిచి రేడియో ద్వారా ప్రసారం చేయించిన ఘనత వారిదే. ఆ రోజుల్లో భక్తిరంజని కార్యక్రమాలూ, కొండనుంచి కడలిదాకా గోదావరి రూపకం 'టోక్యో' 1972 వంటి అనేక బహుమతులు గెలుచుకున్నాయి.

రజనీకాంతరావు గారి ప్రతిభనూ, వారు కళాసాహిత్య రంగాలకు చేసిన ఎనలేని సేవలను గుర్తించి శ్రీకాకుళం యగళ్ల రామకృష్ణ డా॥ పద్మా రామకృష్ణల సాహిత్య పురస్కారం 2002 వారికి అందించింది. ఆ సందర్భంగా ఈ రచయిత రజనీకాంతరావుగారి అంతరంగాన్ని స్పృశించినపుడు ఆవిష్కృతమైన కొన్ని అనుభవాలకు అక్షర రూపమే ఈ ప్రయత్నం. ఇందులో అక్షరాల రూపంలో రాసిన పాటలన్నీ ఆయన గొంతునుండి అలవోకగా స్వరాలుగా పాడుతూ చెప్పినవే.

**ప్రశ్న: శాస్త్రీయ సంగీతం, లలిత సంగీతం, జానపద సంగీతం, వీటిమధ్య తేడాలు ఏమిటి?**

జ : శాస్త్రనిబద్ధంగా ఉండేది శాస్త్రీయ సంగీతం. స్వేచ్ఛగా ఏ నియమాలూ లేకుండా జానపదులు తమ అనుభూతుల్ని ప్రకృతి సహజంగా వ్యక్తీకరించడానికి పాడుకునే పాటల్లో వినిపించేది జానపద సంగీతం. ఈ రెండింటికీ మధ్యేమార్గంలో అందమైన కవి భావాన్ని అందరూ పాడుకునేందుకు అనుకూలంగా లలితంగా బాణీ రూపొందించినదే లలితగీతం. ఈ 'లలిత సంగీతం' అనేమాటని రేడియోలో నేనే ప్రయోగించాను.

**ప్ర: లలిత సంగీతానికి మూలం ఏదంటారు?**

జ: అసలు పూర్వం నాటకాలలో మధ్యమధ్య కొన్ని సన్నివేశాలకు పాటలు తయారుచేయడం అనే ప్రక్రియ లలిత సంగీతానికి మూలం. హిందీలో సుగమ్ సంగీత్ అనే ప్రక్రియ ఆధారంగా తెలుగులో గత శతాబ్ది ప్రధమార్థంలో వినిపించిన కొత్త విధానమే లలిత సంగీతం. శాస్త్రం బరువు పడకుండా సంప్రదాయం హద్దుల్లోనే అందరూ పాడుకునేలా రూపొందించినదే లలిత సంగీతం.

**ప్రశ్న: 'పాట పక్షిలాంటిది' అనే కృష్ణశాస్త్రిగారి మాటల్లో అభిప్రాయం ఏమిటి?**

జ: పాట ఎగరడానికి వీల్లేనంత శాస్త్రం బరువు దాని రెక్కలపై పెట్టి పాట కీర్తనగా మారిపోకుండా చూడాలని భావం. అలాగే సందేశం పేరుతో సాహిత్యం కూడా గాఢంగా ఉండకుండా అందరికీ అందుబాటులో ఉండేంత తేలికగా లలితంగా ఉండాలని అభిప్రాయం.

**ప్రశ్న: సాలూరి రాజేశ్వరరావు, రావు బాలసరస్వతి - లలిత సంగీతానికి చేసిన సేవ ఎలాంటిది?**

జ : గతశతాబ్ది 1940 ప్రాంతాలలో నేను రాసినవి కొన్నీ, రాసి స్వరం కట్టినవి కొన్నీ, రాజేశ్వరరావు స్వరం కట్టినవి కొన్నీ బహుళ ప్రజాదరణ పొందాయి. 'రొదసేయకే తుమ్మెదా!' (బాలసరస్వతి) 'హాయిగ పాడుదునా! సఖీ! హాయిగ పాడుదునా!' (రాజేశ్వరరావు) గ్రామఫోను రికార్డులుగా ఇంటింటా మారుమోగేవి.

**ప్రశ్న : కృష్ణశాస్త్రిగారి 'అతిధిశాల' సంగీత రూపకానికి మీరందించిన సంగీతంలో ప్రత్యేకత ఏమిటి?**

జ : లలిత సంగీతం స్వరపరిచే ప్రక్రియలో హిందూస్థానీ సంగీతంతో



భార్య సుభద్రాదేవితో బాలాంత్రపు రజనీకాంతరావు

పాటు, లాలిత్యం సాధించడానికి అరబిక్ సంగీతం మేళవించి కొత్త ప్రయోగం చేసాను. 'ఓహో!ముసాఫిరో! ఇది అతిథిశాల ఇది ఉదయవేళ రావోయీ! ఓ ముసాఫిరో!' (పాడుతూ వివరించారు).

**ప్రశ్న : కృష్ణశాస్త్రి తన పాటలకు 'కృష్ణరజని' అని పేరు పెట్టారు. వారితో మీ అనుబంధం వివరిస్తారా?**

జ : కొన్నాళ్లపాటు ఆయన సాహిత్యమూ నేను సంగీతమూ. 'శ్రీ కృష్ణదాస చకోర పూర్ణిమ' అని నేను పాట పల్లవి ఎత్తుకుంటే 'రజనీకాంతోదయ దయారాశి హెచ్చరిక' అని ఆయన పూర్తి చేసేవారు. అదీ మా స్నేహం. నేను స్వరం అందిస్తూ ఉంటే 'నీ ఇంటికి పిలువకు నను లోనికి రమ్మనకు' నేటి నుండి ఏనాటికి వీటి తలపు మూయకు' వంటి పాటలకు ఆయన అద్భుతమైన మాటలందించేవారు. అది చాలా ఆర్ద్రమైన సంబంధం.

**ప్రశ్న : లలిత సంగీతం శ్రోతలకు రసాల్ని అందించ గలుగుతుందా?**

జ : చెమ్చాలతో కాదు. ప్రతి ముద్దలోను రసానుభూతిని అందిస్తుంది. ఆస్వాదించగలిగే మనసుంటే లలిత గీతం అంతటా రసావిష్కరణమే.

**ప్రశ్న : పాట రాసిన తర్వాత స్వరపరచడమా? స్వరం అందిస్తే పాట రాయడమా? ఏది మంచిది?**

జ : నా విషయంలో పాట రచన సైమల్టేనియస్‌గా జరుగుతూ ఉండేది. శాస్త్రిగారు కూడా నన్నో, పాలగుమ్మినో పక్కన కూర్చోబెట్టుకుని మేం స్వరం అందిస్తూ ఉంటే ఆ స్వరాలకు మాటలందించేవారు. ఉదాహరణకు విప్రనారాయణ సంగీత రూపకం నేను స్వరం అందించాను. 'వానలోన



శతపత్ర సుందరిలో పాటలను - 1956లో ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో రికార్డు చేస్తున్న రజనీకాంతరావు. పాడుతున్న వారిలో టంగుటూరి సూర్యకుమారి

తడవుండి తడిసేవు కాబోలు చాన ! ఎంతో ఒణికేవు లోనికి రావే!" "ఏటిదరి జాజిలత నీటబడె అయవారూ! రాటకెక్కి వచ్చినంత పైటకొంగు తడిసెనేమొ' అంటూ దేవదేవి విప్రనారాయణల యుగళం రూపొందింది.

**ప్రశ్న : మీరు రచించి స్వరపరిచిన దేశభక్తి గీతాల్లో మీకు ఎక్కువ ఇష్టమైనది ఏది?**

జ : రవీంద్ర సంగీతంలో 'చిత్ జతా భయ శూన్యో, ఉచ్చ్ జతా శిరో, జ్ఞాన్ జతా ఉన్ముక్తో' నన్ను ఎక్కువ ప్రభావితం చేసింది. 'వేర్ ద మైండ్ ఈజ్ వితౌట్ ఫియర్ అండ్ ద హెడ్ ఈజ్ హెల్డ్ హై'. దాన్ని నేను 'చిత్తమెచ్చట భయశూన్యమో! శీర్శమెచట ఉత్తుంగమో' రాసి ట్యూన్ చేసాను. అది ఇప్పటికీ ప్రజాదరణ పొందిన పాట.

**ప్రశ్న : స్వర్గసీమ, గృహప్రవేశం సినిమాలకు విజయవంతమైన పాటలందించినా మీరు ఆ రంగంలో ఎందుకు స్థిరపడలేదు?**

జ : ఓ హో హో!పావురమా! (భానుమతి) 'అద్భుతమే కురియునో' (ఎమ్.ఎస్.రామారావు) (మైమరిచి పాడుతూ) ఆనాటి సినీపరిశ్రమ ఇప్పుడున్నంత సంపన్నంగా లేదు. ఉద్యోగాలు వదిలి వెళ్లవలసినంత భరోసా ఇచ్చేస్థితిలో లేదు. అందువలన తిరిగి రేడియోకే పునరంకితం అయ్యాను. ◆

# బాణీ ముత్యాలు

**సేకరణ : పి.గిరి,హైదరాబాద్**



జాలాది

పలుపుతాడు మెడకేస్తే పాడియావురా
పసుపుతాడు ముడులేస్తే ఆడదాయిరా
కుడితి నీళ్ళు పోసినా
అది పాలు కుడుపుతాది
కడుపుకోత కోసినా
అది మణిసికే జన్మనిత్తాది
బొడ్డుపేగు తెగిపడ్డ రోజు తలుసుకో
గొడ్డు కాదు ఆడదనే నిజం తెలుసుకో

**చిత్రం : ప్రాణం ఖరీదు**
**పాటపల్లవి : యాతమేసి తోడినా ఏరు ఎండదు**



ఆరుద్ర

మొహం మీద కోపంతో ముక్కు కోసుకుంటారా?
వేలు మీద కురుపుందని కాలుకోసుకుంటారా?
ఆవేశం నీ తెలివిని చంపుతుందిరా!
ఆలోచన నీ బలాన్ని పెంచుతుందిరా!

**చిత్రం : మనవూరి పాండవులు**
**పాటపల్లవి : ఒరే పిచ్చి సన్నాసి**



సిరివెన్నెల సీతారామశాస్త్రి

అవతారమూర్తియైన అణువంతే పుడతాడు
అమ్మపేగు పంచుకునే అంతవాడు అవుతాడు
అమ్మేగా చిరునామా ఎంతటి ఘనచరితకి
అమ్మేగా కనగలదు అంత గొప్ప అమ్మని

**చిత్రం : అమ్మరాజీనామా**
**పాటపల్లవి : ఎవరు రాయగలరూ**



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు

**డా|| పి.బి.శ్రీనివాస్**

'కోసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

లతా మంగేష్కర్ అభిరుచి, అనేకుల అభిరుచికన్న విభిన్నమైనది.విశిష్టమైనది. 'ఆల్బం'ల సెలక్షన్‌లలో ఆమె ఎన్నుకున్న కొన్ని గీతాలను గమనిస్తే, ఈ నిజం తేటతెల్లమౌతుంది. 'హిట్‌'సాంగ్ అయినంత మాత్రాన అదే బెస్టుసాంగ్ అని అనుకోవలసిన పనిలేదు.

1990వ సంవత్సరంలో ఆమె నిర్మించిన "లేకిన్"అనే చిత్రానికి ఆమె తమ్ముడు హృదయ్‌నాథ్ మంగేష్కరే సంగీత దర్శకుడు. ఆయన స్వరపరచిన అన్ని పాటలలో "యారా సిలిసిలీ మై తో చల్‌నేవాలీ" అనే పాట వ్యాపారం దృష్ట్యా చాలాగొప్ప హిట్‌సాంగ్. కాని లతకి నచ్చిన పాట మరొకటి. "సునియోజీ అరజ్ హమారీ" అనే పాటకి డింపిల్ కపాడియా కూడా దోహదం చేసిందనీ, ఆ పాట ఆలాపనరీత్యానూ, అభినయరీత్యానూ చాలా మంచి పాట అని ఆమె నిర్ణీతాభిప్రాయం. గుల్జార్ లిరిక్సు కూడా చాలా అర్థవంతమైనవి. హృదయ్‌నాథ్ చాలా దిట్ట. పెర్‌ఫెక్షనిస్టు. లత పాడినా, తేకు సంతృప్తికరంగా వచ్చేదాకా వదలరు.

"మా అక్క పాడిన ఏ పాటలోనూ ఏపాటి లోటూ వుండనేకూడదు. ఎవరూ వేలెత్తి చూపించ కూడదు" అంటారాయన. హృదయనాథ్ ఎంతటి ఆత్మాభిమాని అంటే, తన అక్కచేత ఎవ్వరికీ తనని గురించి సిఫార్సు చేయించుకోడానికి ససేమిరా ఇష్టపడరు. తను తన కృషివలనా, ప్రతిభవలనా మాత్రమే గుర్తింపబడాలనేదే ఆయన ఆకాంక్ష. ఎంత మంచి సంగీతం అందించినా, కాలం కలిసి వస్తేనేగాని ఏ సంగీతదర్శకుడికీ తగిన గుర్తింపు లభించదనే సత్యాన్ని "లేకిన్" చిత్రం తన అపజయం ద్వారా నిరూపించింది. తన తమ్ముడి ఇంపైన సంగీత చిత్రం అపజయం వలన గుర్తింపు పొందకపోవడం లతకీ చాలా బాధ కలిగించింది.

లతకు నచ్చిన పాటల్లో రెహమాన్ సంగీతం అందించిన 'దియాజలే' ఒకటి. ప్రతిభా సామర్థ్యాలతో పాటు, అద్భుతమైన అదృష్టం కూడా కల కళాకారులు చాలా అరుదు. ఎవరైనా ఒప్పుకుతీరతారు అలాంటి అద్భుతమైన అదృష్టం కల వారిలో ఎ.ఆర్.రెహమాన్ అగ్రగణ్యులు అని. రెహమాన్ తండ్రి ఆర్కే శేఖర్, మలయాళ చిత్రాలలో మంచిపేరు గడించిన సంగీత దర్శకులూ, సహాయ సంగీత దర్శకులూకూడా. ఎం.బి.శ్రీనివాస్‌కి సహాయకులుగా పనిచేసిన ఆర్కెస్ట్రా ప్రవీణులు.

'ఆయిషా' అనే చిత్రంలో శేఖర్ చేసిన ట్యూన్ నేను పాడాను - అది "యాత్రక్కోరా" అనే గీతం. ఆ గీతం తగిన వరస కుదరడంవల్ల చాలా పాపులర్ అయ్యింది. ఆ పాటలో ఒక లైను నా అభిమానులలో ఒక కేరళ యువకుడు విని ప్రభావితుడై, తన మూర్ఖత్వపుటాత్మహత్యా ప్రయత్నాన్ని విరమించుకున్నట్లుగా నాకు లేఖ వ్రాసాడు. చాలా పొంగిపోయాను. శేఖర్ చేసిన ఆ ట్యూను నాకెంతో ఇన్స్పిరేషన్ ఇచ్చింది.

అలాంటి సంగీత దర్శకుడికి తగిన తనయుడు ఎ .ఆర్. రెహమాన్ అనే సంగీత దర్శకుడు. 'రోజా' అనే మొదటి చిత్రంతోనే దిగ్విజయాన్ని సాధించారు. అది దర్శక శిఖరం అనిపించుకున్న మణిరత్నం గారి హస్తవాసీ రాశీ కూడా. ఆ తరవాత రెహమాన్ ఇహ వెనక్కి చూడలేదు. నిరంతర ప్రగతిని సాధించి ఈ నాడు ఆంగ్ల చిత్రాలకీ, చైనా చిత్రాలకీ కూడా సంగీతం అందించే అపూర్వ అవకాశాన్ని పొందగలిగిన అదృష్టయుత ప్రజ్ఞావంతులు, అన్నింటికన్నా లతా మంగేష్కర్

## యమన్ రాగంలో లతా పాటలు

ఏక్ దిల్ కా లగానా బాకీ థా (అనోఖా ప్యార్ - అనిల్ బిశ్వాస్)
సప్నా బన్ సాజన్ ఆయే (శోఖియా - జమాల్ సేన్)
ఐరీ ఆలీ పియా బిన్ (రంగా రంగ్ - రోషన్)
జానే వాలే సే ములాకాత్ న హోనే పాయీ (అమర్ - నౌషాద్)
జారే బద్రా బైరీ జా రే జా రే (బహానా - మదన్ మోహన్)
జీవన్ డోర్ తుమ్హీ సంగ్ బాంధీ (సతీ సావిత్రి - లక్ష్మీ-ప్యారే)
బడే భోలే హో (అర్ధాంగిని - వసంత్ దేశాయి)
జియా లే గయో జీ మోరా సావరియా (అన్‌పఢ్ - మదన్ మోహన్)
ఖుదా నిగాహ్‌బన్ హో తుమ్హారా (మొఘలేఆజమ్ - నౌషాద్)
లౌ లగాతీ గీత్ గాతీ (భాభీ కీ చూడియా - సుధీర్ ఫడ్కే)

- కమ్యూనికేటర్ ఫీచర్స్

1975 ప్రాంతాలకు వచ్చేసరికి లతా పాటకు 10 వేల నుండి 15 వేలకు పెంచింది. ఎవరికైనా అదే రేటు. (జయదేవ్, ఖయ్యాం వంటి క్లాస్ కంపోజర్స్ విషయంలో మాత్రం సగం రేటుకైనా పాడేది.) రేటు విషయం ఎలా ఉన్నా రిహార్సల్స్‌కి రాకపోవడం కంపోజర్స్‌కు ఇబ్బంది కలిగేది. రికార్డింగ్ డేట్స్ విషయంలో లక్ష్మీకాంత్ ప్యారేలాల్‌కు ప్రాధాన్యత ఇచ్చి తక్కినవారిలో అందుబాటులో లేకపోవడంతో కళ్యాణ్‌జీ ఆనంద్‌జీలు అల్కా యాగ్నిక్, సాధనా సర్గమ్ వంటి వారిని ట్రెయిన్ చేయడం మొదలుపెట్టేరు.



నౌషాద్ విషయాని కొస్తే ఆశా భోంస్లేను ప్రోత్సహిస్తున్న నౌషాద్‌తో పూర్వ సత్సంబంధాలను పునరుద్ధరించుకోవడానికి 'చంబల్ కీ రాణీ' (1979) సినిమాకై లతా సగం ఫీజు తీసుకునే పాడింది. ఆశా, లతాలతో ప్రయోగాలు చేస్తున్న నౌషాద్ 'అవాజ్ దే కహా హై' (1990) కు అనురాధా పొడ్వాల్‌ను పిలిచాడు. దాంతో 'తేరీ పాయల్ మేరే గీత్' (1993)కు నౌషాద్ సంగీతంలో మళ్లీ పాడడానికి లతా ముందుకొచ్చింది. కానీ సినిమాతో బాటు పాటలూ ఫెయిలయ్యాయి. 40 యేళ్ల క్రితం నాటి లతా-నౌషాద్ కాంబినేషన్ కాదది!

# లతాకు పోటీదారులా?

భక్తిపాటలతో ప్రవేశించి ఓ రికార్డింగు కంపెనీ మద్దతుతో సంగీత సామ్రాజ్యంలో ఒక శక్తిగా ఎదిగిన గాయని అనురాధా. 'అభిమాన్' సినిమాలో ఓ చిన్న శ్లోకం పాడిన అనురాధా 1910 నాటికి 'కాలత్ నకాలత్' అనే మరాఠీ సినిమాకై జాతీయ ఉత్తమగాయని అవార్డు గెలుచుకుంది. ఆ పాటికి లతా సినిమాపాటలు తగ్గి భక్తిపాటలు పాడడం మొదలుపెట్టింది. కానీ అక్కడ అనురాధ పోటీని ఎదుర్కోవలసివచ్చింది.

'సేవీ' అనే ఆంగ్ల పత్రిక 1991 జూన్ సంచికకు అనురాధ ఇంటర్వ్యూ ఇస్తూ మంగేష్కర్ సోదరీమణులపై విరుచుకుపడింది. టీ సీరీస్‌కు అనే కాసెట్ కంపెనీతో ఆడియో మార్కెట్‌లో చెలరేగిపోతున్న గుల్షన్ కుమార్ మద్దతు చూసుకునే అనురాధ అలా మాట్లాడగలిగింది. అంతేకాదు 'రాధా కే సంగమ్' సినిమాకై లతా పాడిన పాటలు తిరిగి పాడతానంది.

సాధారణంగా జూనియర్ గాయనీగాయకులు ఇలా ట్రాక్ పాడడం కద్దు. ప్రసిద్ధి పొందాక గాయనీగాయకులు రిహార్సల్స్‌కు ఎక్కువ టైము కేటాయించలేరు కాబట్టి సంగీతదర్శకులు వీరిచే పాట అభ్యాసం చేయించి పాట ఫైనలైజ్ చేసుకుంటారు. లక్ష్మీకాంత్-ప్యారేలాల్, ఆర్.డి.బర్మన్ వంటి వారు అనురాధా, కవిత కృష్ణమూర్తి, అల్కా, సాధనా, పూర్ణిమా వంటివారికి పాటకు 500 రూపాయలిచ్చి ఇలా ట్రాక్ పాడించేవారు. తర్వాత లతా లేదా ఆశా వచ్చి ఆ పాట వినేసి తమ కంఠస్వరంతో అది పాడేసి పాటకు 25 వేలు సంపాదించేవారు. కానీ ఇలా ప్రసిద్ధులైన వారు పాడిన పాటలను జూనియర్లు తిరిగిపాడడం 'విడ్డూరం! అంతేకాదు, శ్రద్ధాంజలి పేరుతో లతా చేసినట్లుగానే లతా-మదన్‌మోహన్ పాటలను అనురాధ తిరిగిపాడింది. ఇక లతాకు అనురాధ అంటే ప్రేమ ఎక్కడుంటుంది?

తన గోల్డెన్ జూబిలీ ఫంక్షన్ సందర్భంగా యువగాయనీమణులందరినీ స్టేజీమీదకు పిలిచి పాడమని ఆహ్వానించింది లతా. కానీ ఆ లిస్టులో అనురాధ లేదు!

- సమీర్ కుమార్

గారి మెప్పు పొందడం ఆయన అదృష్టానికి గల ప్రత్యేకత. మణిరత్నం దర్శకత్వం వహించిన "దిల్‌సే" అనే చిత్రానికై లత ఏ ఆర్ రెహమాన్ ట్యూను పాడారు. "దియాజలే"అని సాగే ఆ గీతం మొదట్లో లతాకి చాలా సామాన్యమైన ట్యూన్‌గా తోచినా రికార్డయిన పిదప విన్న మీదట ఆశ్చర్యపోయారట. అద్భుతంగా రూపొందిన ఆ పాటని తనకిష్టమైన పాటల్లో ఒకటిగా పేర్కొన్నారు. చాలాకాలం తర్వాత ఒక మంచి పాట పాడిన సంతృప్తి కలిగిందట ఆమెకి.

లతా చేత అధిక ప్రశంసలందుకోగలిగిన మరో మహాభాగ్యశాలి, పాకిస్తాన్ గజల్ సామ్రాట్ అనిపించుకునే "మెహదీ హసన్" అలాగే మెహదీ హసన్‌కి, లతా గానం ప్రాణాధికం - "లండన్‌లో మెహదీ హసన్ సంగీతాన్ని మొదటి సారి విన్నప్పుడు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆహా! సంగీతమంటే ఇదేకదా అని నాలో నేను అనుకున్నాను. నేనంతటి సంగీత సంపూర్ణత్వాన్ని ఇంకా సంపాదించలేదు" అని లతా అనడం, ఆమెలోని వినయానికి ముఖ్యోపమానం.

లతా,ఆశా గానం విన్న గాయనీ గాయకులెవరయినా తమ గురించి తాము అలాగే తక్కువ అంచనా వేసుకోకతప్పదు. నా ఉద్దేశ్యంలో ఈ ఇద్దరు కూడా పరిపూర్ణులే. ఇన్ని యేళ్ల అనుభవంవలన, నేను నేర్చుకున్న పాఠం ఏమిటంటే ఏ ఒక్క కళామనీషినీ మరో కళా మనీషితో పోల్చడం సరిదారి కాదు. ఎవరి వ్యక్తిత్వం వారిదే.

గజల్ క్వీన్ అని పేరు పొందిన బేగం అఖ్తర్ ఒకనాడు అర్ధరాత్రి మదన్‌మోహన్‌కి సడెన్‌గా ఫోను చేసి, "దయచేసి మీరు లత చేత పాడించిన "చైన్‌నహీఁఆయే" పాటని ఫోనులోనే నాకు వినిపించండి. సడెన్‌గా ఆ పాట వినీతీరాలని అనిపించింది" అంటూ పట్టుపట్టి బ్రతిమాలి వేడుకున్నదట. లతా గొంతులోని డివైన్ ఎలిమెంట్ (దివ్యత్వ నిధి) ఎవరినైనా అంతగా ఆకట్టుకోగలదు. ఇలాంటివి ఎన్నెన్నో!

అందుకే ప్రతీ సంగీత దర్శకుడూ లతచేతే తన పాట పాడించుకోవాలని కోరుకుని, పట్టు పట్టడం సాధారణంగా జరుగుతున్న పని. ఇన్నేళ్లనుంచి పాడుతున్నా (ఆల్‌మోస్ట్ ఆరు దశాబ్దాలు) ఆమె గొంతులోని శ్రుతీ మాధుర్యం ఏ మాత్రం చెక్కు చెదరకపోవడం వింతలన్నిటిలోనూ గొప్పవింత. ఆమె సమకాలికులెంత మందో ఈనాడు లేనేలేరు. ఉన్న కొంతమంది సంగీత వృత్తి సాగించడం లేదు. కాని లత మాత్రం లైట్‌హవుస్ లా నిలిచి, లైట్ మ్యూజిక్‌కి కొత్త ప్రాణం పోస్తూ పయనిస్తూనే వున్నారు.

ప్రగతిపథంలో ఇటీవల "రీమిక్స్" చేసే పద్ధతి ప్రాబల్యం పొందింది. పాత పాటలనే కొత్త టైపు లింకు బిట్స్‌తోనూ ఆర్కెస్ట్రాతోనూ గాయనీ గాయకులచే మళ్లీ పాడించడమో లేక కొత్త వారిచేత పాత కళాకారుల గీతాల్ని పాడించడమో జరుగుతోంది. ఒక సంగీత సభలో లత

# లతా - మదన్‌మోహన్



లతా మదన్‌మోహన్‌ల పరిచయం సహగాయకులుగా జరిగింది. అదీ తిరస్కారానికి గురయిన గాయకులుగా!

ఫిలింస్తాన్ వారు 'షహీద్' తీస్తున్నారు. గులాం హైదర్ మ్యూజిక్ డైరక్టరు. లతా గొంతు నచ్చిన గులాం హైదర్ 'పింజరే మే బుల్‌బుల్ బోలే మేరా జియా డోలే' అనే యుగళగీతం ఆమెచేత, మదన్‌మోహన్ చేత పాడించాలని నిశ్చయించాడు. ఫిలింస్తాన్ స్టూడియో చీఫ్ రాయ్‌బహదూర్ చునీలాల్ కొడుకే మదన్‌మోహన్. తన కొడుకు ఏదైనా మంచి పని చూసుకోకుండా ప్లేబాయ్‌లా నవ్వాడియోలు పట్టుకు వెళ్లాడడం నచ్చేది కాదాయనకు. గులాం హైదర్ పాడిస్తే సరేలే అనుకున్నాడు.

పాట రికార్డయాక మ్యూజిక్ ఇన్‌ఛార్జిగా ఉన్న ఎస్.ముఖర్జీకి వినిపించారు. ఆయనకు గాయనీగాయకులిద్దరూ నచ్చలేదు. ఆ పాట తీసేయమన్నాడు. ఒకేరకమైన పరిస్థితిలో ఉన్నారు కాబట్టేమో ఆ క్షణమే లతా మదన్ మోహన్‌ల మధ్య సోదరసోదరీబంధం ఏర్పడింది. లతా అతనికి రాఖీ కట్టింది. జీవితాంతం ఆ బంధాన్ని గౌరవించాడు మదన్‌మోహన్. ఆ తరువాత లతా, మదన్‌లు కలిసి సి.రామచంద్ర సంగీతదర్శకత్వంలో కోరస్‌పాట ఒకటి పాడారు.

అంతలో 'ఆంఖే' సినిమాకి సంగీతదర్శకత్వం వహించే ఛాన్సు వచ్చింది మదన్‌కు. లతాను ఓ పాట పాడమన్నాడు. కానీ లతాకు మదన్ టాలెంటు మీద నమ్మకం లేకపోవడంతో పాడనంది. మదన్ అంటే జల్సాగా తిరిగే కుర్రాడని, ఆర్మీలోకి వెళ్లి అక్కడ డిసిప్లిన్ భరించలేక తిరిగివచ్చేసినవాడనీ, గాయకుడిగా పెద్దపేరు తెచ్చుకోలేకపోయాడని తెలిసిన లతా రిస్కు తీసుకోదలచుకోలేదు.

సురైయా కూడా అంతే! వాళ్లింటి పక్కనున్న మైదానంలో పొద్దస్తమానం క్రికెట్ ఆడే కుర్రాడు తనకు పాట నేర్పించేటంత ఘనుడంటే నమ్మలేకపోయింది. 'ఖూబ్‌సూరత్' సినిమాపాటల రికార్డింగు టైములో సంగీతదర్శకుడిగా మదన్ ట్యూన్ వివరించబోయినప్పుడల్లా పకపకా నవ్వేసేది.

నిజానికి లక్నో ఆలిండియా రేడియోస్టేషన్‌లో పనిచేసే టైములో తలత్, తదితర కళాకారులతో ఏర్పడిన సాన్నిహిత్యం మదన్‌ను పంజాబీ స్కూలు సంగీతదర్శకుల (గులాం హైదర్, పండిట్ అమర్‌నాథ్, జి ఎ చిస్తి, పండిట్ గోబిందరామ్, శ్యామ్ సుందర్, హుస్నలాల్ -భగత్‌రామ్) పద్ధతికి భిన్నంగా ఒక విలక్షణమైన పద్ధతిని అలవర్చుకోవడానికి సహాయపడింది.

మదన్‌మోహన్‌కూడా పంజాబీయే. మనిషి భారీ అయినా మనసు మెత్తన. అన్నీ క్లాసు అలవాట్లు. పాటల స్క్రిప్టు ఇంగ్లీషులో రాసుకునేవాడు. అతని సంగీతం జానపదులకు నచ్చేది కాదు. క్లాసుని బాగా ఆకట్టుకునేది. ఒక్కోపాటకు ఐదేసి ట్యూన్‌లిచ్చి కావలసినది ఏరుకొనమని చెప్పగలిగేటంత పాండిత్యం ఉందతనికి.

లతా- మదన్‌మోహన్ కాంబినేషన్ శ్రోతల హృదయాలలో నిలిచిపోవడానికి కారణం - హెచ్.ఎమ్.వి. మదన్‌మోహన్ పాటల్లో ఎక్కువశాతం లతావి కావడం నిజమే కానీ లతా మదన్‌మోహన్ సంగీతంలోనే కాదు అనేకమందికి పాడింది. కానీ హెచ్.ఎమ్.వి. వారు మాత్రం మదన్‌మోహన్, లతా జోడీనే ఎక్కువగా ప్రచారంలో తేవడానికి ఒక కారణం - మదన్ కుమారుడు రాజీవ్ కోహ్లీ ఆ కంపెనీలో ప్రధానమైన పదవిలో ఉండడం.

లతా రుమీ సి.రామచంద్ర అయితే, లతా గజల్ మదన్ మోహన్ అనవచ్చు. కానీ మదన్‌మోహన్ కమ్మర్షియల్‌గా సక్సెస్ అయిన కంపోజర్ కాదు. 1950లో 'ఆంఖే' సినిమాతో రంగప్రవేశం చేసినా సుమారు దశాబ్దంన్నరపాటు కాచుకుంటే గానీ తొలి సిల్వర్ జూబిలీ 'వో కౌన్ థీ' రాలేదు. 1956లో 'భాయ్ భాయ్' బొంబాయిలో 23 వారాలాడి సిల్వర్‌జూబిలీ కాబోతూండగా మదన్‌మోహన్ దురదృష్టమో ఏమో ఆ సినిమా నిర్మాత ఎ.వి.మెయ్యప్పన్‌కు, దర్శకుడు ఎం.వి.రామన్‌కు వ్యక్తిగతంగా గొడవలు వచ్చి హఠాత్తుగా థియేటర్స్‌లోంచి తీసేయడం జరిగింది. తన ప్రతిభను లోకం తగినంతగా గుర్తించలేదన్న వ్యథతోనే 1975లో మదన్‌మోహన్ కన్నుమూసాడు. తక్కిన సంగీతదర్శకుల విషయంలో లతా కళాకళలు ప్రదర్శించినా అతని విషయంలో మాత్రం లతా ఎప్పుడూ గౌరవాభిమానాలే ప్రకటించింది.



- ఎమ్బియస్ ప్రసాద్

ఆడియన్సుతో అన్నారట : 'ఈ మధ్య నాచేత లతామంగేష్కర్ గొంతుతో పాడిస్తున్నారు. మీకేమైనా నచ్చుతోందా' అని వ్యంగ్యాత్మకంగా ప్రశ్నించారట. మీకిప్పుడు 71 ఏళ్లవయస్సు కదా అని అడిగినప్పుడు ఆమె హాస్యాత్మకంగానూ, హాసాత్మకంగానూ "తిరగేసి చూడండి. నా వయస్సు స్వీట్ సెవెంటీన్ అని మీకు అర్థమౌతుంది" అన్నారట చిలిపి చిరునవ్వుతో..

ఆడవాళ్ల వయస్సు అడగకూడ దంటారు. నిజానికి మగవాళ్ల వయస్సుని కూడా అడగకూడదు. అడిగితే అబద్ధం చెప్పించిన వాళ్లం అవుతాము. నీ వయస్సు ఇంత అని వివరించడం ఎవ్వరికీ సాధ్యం కాదు. ఇన్ని సంవత్సరాలు అని చెప్పేలోపునే కొన్ని క్షణాలు దాటిపోవడం వల్ల ఆ వ్యక్తి అబద్ధాలు చెప్పినట్టే అవుతుంది. చెప్పా పెట్టకుండా పెరిగిపోయే వయస్సుకి ఎందుకో అందరూ అత్యధిక విలువనిస్తారు. వయస్సుకీ ప్రతిభకీ సంబంధంలేదని నిరూపించేందుకు కాబోలు లత,ఆశ,బాలమురళీ,బాలూ, ఏసుదాస్, రవికిరణ్, యు.శ్రీనివాస్, సుశీల,జానకి వంటి బాలమేధావులు పుట్టి చరిత్రలు సృష్టిస్తూ వుంటారు.

ఆరోఏటనే అద్భుతమైన ప్రతిభని కనబరచి, ఈనాడు ఇంటర్‌నేషనల్ రికగ్నిషన్ పొందిన గాయత్రి అశ్వత్థామ అనాటి గొప్ప సంగీతదర్శకుడి ముద్దుల కూతురు. వీణావాదనంలో ఎనలేని ప్రజ్ఞాపాటవాలు గడించిన గాయత్రి కళాకారిణియై విజృంభించింది. దేనికైనా కాలం కూడి రావాలి. ఇప్పుడు గాయత్రి అంతర్జాతీయ మహాకళాకారిణి. గాయత్రి వీణపైన కొత్తకొత్త ఎక్స్పెరిమెంట్లు చేస్తూవుండడం పరిపాటి. ఎవరూ ప్రయత్నించడానికైనా సాహసించని ఒక ప్రయోగం చేసింది. ప్రఖ్యాత పాకిస్తాన్ గజల్ స్పెషలిస్ట్ గులాం ఆలీ పాడిన కొన్ని అపూర్వ క్లిష్ట గీతాల్ని (గజల్స్‌ని) వీణపైన అద్భుతంగా వాయించి అందరిమెప్పూ అందుకుంది.

ఇటీవల, ఒక అపూర్వమైన ఆల్బం విడుదల చేయించింది. అన్నీ లతా మంగేష్కర్ పాడిన పాటలే. ఇందులో వైశిష్ట్యం ఏమిటంటే, లతా ఏ పాట ఏ శృతిలోపాడారో అదే శృతిలో వీణపైన వాయించడం, దానివల్ల సహజత్వం లభించింది. ఈ ప్రయోగం అతి కష్టసాధ్యం. అబ్ తో హై తుంసే (అభిమాన్), బిందియా చమ్‌కేగీ (దోరాస్తే), దిల్ దియాయూఁ(బాజర్), శీశాహోయా దిల్‌హో(ఆశా), తూనే ఓ రంగీలా(కుద్రత్) 'ఎ' సైడులోనూ, మెగలియా(యెచేరాహ్ ప్రేంరోగ్), తేరామేరా సాథ్‌రహే (సౌదాగర్). రామారామా గజబ్‌హుఈ(నయా జమానా), సున్‌బాబాసున్ (రాంతేరీ గంగామైలీ ), మిలోనతుంతో (హీర్‌రాంఝా) 'బి' సైడులోనూ చోటు చేసుకున్నాయి.

ఇవన్నీ చాలా మంచిపాటలే ఐనా, ఇంతకన్న మేలైన పాటలు చాలా వుండడంవల్ల, సెలెక్షన్ ఆఫ్ సాంగ్స్ కొంతమందికి కొంత నిరాశకలిగించవచ్చు కాని, కాపీరైటు నిర్భంధంవల్ల, హక్కులు లేని గొప్పపాటలెన్నో ఈ కేసెట్లో మిస్సయ్యాయి. కాని గాయత్రీ వీణా వాదన పాటవం వలన ప్రతీపాట హృదయంగమంగా రూపొందింది. ఈ ఆల్బమ్ మొదటి కాపీ అందుకునే భాగ్యం నాకు కలగడం ఆశ్చర్యం కలిగించింది. మరోసారి ప్రఖ్యాత యుగళ గీతాలు కొన్ని యెంచుకుని మరో వాద్యంతో చెయ్యి కలిపి రసజ్ఞ లోకాని కందిస్తే బావుంటుందనిపిస్తుంది నాకు. ఈ కేసెట్ చాలా విజయవంతమై అనేక కొత్త ప్రయోగాలకి దారి తీయాలని నా శుభాకాంక్ష-తథాస్తు.

లతామంగేష్కర్ జీవిత చరిత్రలోని కొన్ని ప్రధానాంశాలు ఇంతవరకూ చర్చించడం జరిగింది. ఇప్పుడు ఆమె పాడిన గొప్ప పాటలూ వాటిలోని కొన్ని వైశిష్ట్యాలూ, అవి నాకు నచ్చిన కారణాలూ వివరించ గోరుతున్నాను. ఈ వివరణలో కొన్ని చర్విత చర్వణాలు తప్పవు. కారణం చెఱకుగడ నమిలినకొద్దీ మధుర రసం వస్తానే వుండేటట్లు లతా పాటలు కూడా వినగా వినగా కొత్త ఇంపులూ సొంపులూ తెలియవస్తాయి.

బైజూబావ్‌రాలోని "మోహేభూల్‌గయే సాఁవరియా" అనే పాటంటే నాకు ప్రాణం. సన్నివేశాని కనుసారంగా నౌషాద్ కట్టిన ట్యూను లతా పాడిన పద్ధతి పరమాద్భుతం. పాటంతా ఒక తీయదనపు తీగలా సాగుతూనే వుంటుంది. లంబోదర లకుమికరా అని ఆరంభ దశలో అందరూ నేర్చుకునే మాయామాళవగౌళ ఈ పాటకి ఎంతగానో నప్పింది. నాకు అమితంగా నచ్చింది. చాలా సింపిల్ ట్యూనే. లతా గొంతులో పలికిన తీయని వేదన వర్ణనాతీతం. "ఆవన్‌కహ్‌గయేం, అజ్‌హోనాఏ, ఆవన్‌కహ్‌గయే, అజ్‌హోనాఆఏ, లీనహీఁ మేరీఖబరియా" అనే భావానికి, వేరే మరోలా ఎవరు స్వరపరచినా ఇంత బాగా అతకదు అనేది నా వినీతాభిప్రాయం. అదే నౌషాద్ సామర్థ్యం. ఆయన చేసిన ట్యూన్లని మార్చిచేస్తే భావ ప్రభావం పరిపూర్ణంగా అందదు శ్రోతలకి. ఫస్ట్‌హియర్‌డ్ ఈజ్ ది బెస్ట్ అనే సామెత కొంత నిజమే అయినా నౌషాద్ విషయంలో అది శతశాతం నిజం. అలాగే లత ఆలాపనకూడా, కదిపి కుదిపి కన్నీరు కార్పిస్తుంది. అదే చిత్రంలో "బచ్‌పన్‌కి ముహబ్బత్" లో దిల్‌సే నభులాదేనా అనే పాట ట్యూన్‌లో ఒకవిధమైన వేదన వినిపించినా, మంచి స్వింగు కనిపిస్తుంది. ఇలాంటి పాటలు ఎన్నిసార్లు విన్నా మనకి ఎంతమాత్రమూ విసుగు కలగదు. ఈ చిత్రానికి ముందుగానే వచ్చిన "అందాజ్" లో కూడా అన్నీ పాపులర్ హిట్లేకాక, ఉత్తమ తరానికి చెందినవి.

(ఇంకావుంది)

## లతా విదేశీ పర్యటనలో 'గుమ్‌నామ్'

లతా తన విదేశపర్యటనలలో భాగంగా దక్షిణ అమెరికాలోని గయానా రాజధాని జార్జిటౌన్‌కి వెళ్లింది. ఆ రోజు పబ్లిక్ హాలీడేగా ప్రకటించారు. కారులోనుండి లతా బృందం దిగగానే ప్రభుత్వం తరఫున ఆహ్వానసంఘం వారు బ్యాండ్ వాయిస్తూ స్వాగతం పలికారు. బ్యాండ్ వాయిస్తున్న ట్యూన్ విని లతా బృందం వారు అది గయానా జాతీయగీతం కాబోలనుకున్నారు. కాస్సేపటికి అది బాగా తెలిసున్న ట్యూన్‌లా అనిపించింది. మరుక్షణంలోనే స్ఫురించింది - అది లతా పాడిన పాట బాణీ అని!

భలేగా ఉందని సంతోషించబోయి అంతలోనే ఉలిక్కిపడ్డారు. ఆ పాట - 'గుమ్‌నామ్ హై కోయీ, బద్‌నామ్ హై కోయీ' (అజ్ఞాతుడెవడో, అపకీర్తి పాలయినవాడెవడో) అనే 'గుమ్‌నామ్' టైటిల్ సాంగ్. ట్యూన్ బాగుందని దాన్ని ఎంపిక చేసుకున్నారు కానీ దాని అర్థం తెలియకుండా గయానావారు దానికంత ప్రాముఖ్యత ఇచ్చారని నిట్టూర్చారు.

సాధారణంగా తన ప్రోగ్రాము‌ను ఒక శ్లోకంతో ప్రారంభించడం లతా ఆనవాయితీ. కానీ ఆ దేశంలో జరిగిన అన్ని ప్రోగ్రాములను గయానా జాతీయగీతం, జనగణమనలతో ఆరంభించవలసి వచ్చింది. అది అక్కడి సంప్రదాయం. ఎన్ని పాడినా సరే 'గుమ్‌నామ్' పాట పాడనిదే లతాను స్టేజి దిగనిచ్చేవారు కారు అక్కడి శ్రోతలు.

**- ఎమ్మెస్ స్వాతి**

## లతా గానలహరి

**చిత్రం: గుమ్‌నామ్** | **రచన: హస్రత్ జైపురి**
**సంగీతం: శంకర్ - జైకిషన్** | **గానం: లతా మంగేష్కర్**



గుమ్‌నామ్ హై కొయీ, బద్‌నామ్ హై కొయీ
కిస్ కో ఖబర్ కౌన్ హై వో, అన్ జాన్ హై కొయీ

కిస్‌కో సమ్‌ఝే హమ్ అప్‌నా, కల్ కా నామ్ హై ఎక్ సప్‌నా
ఆజ్ అగర్ తుమ్ జిందా హో, తో కల్‌కే లియే మాలా జప్‌నా

పల్ దో పల్‌కీ మస్తీ హై, బస్ దోదిన్ కీ బస్తీ హై
చైన్ యహాఁ పర్ మెహంగా హై, ఔర్ మౌత్ యహాఁ పర్ సస్తీ హై

కౌన్ బలా తూఫానీ హై, మౌత్ కో ఖుద్ హైరానీ హై
ఆయే సదా వీరానోం సే, జో పైదా హువా వో ఫానీ హై



# అవర్ణనీయ వైవిధ్యం

# ఓపీ నయ్యర్ సంగీతం

జీవితంలో కోల్పోయిన ఆనందాన్ని, ఉత్సాహాన్ని, హుషారునీ, మళ్ళీ తెచ్చుకోవడానికి హిందీ చలన చిత్రరంగం శ్రోతలకిచ్చిన దివ్యౌషధం ఓ.పి.నయ్యర్. అతని స్వర రచన, రఫీ, ఆశాల తేనెలూరే కంఠస్వరాల నుంచి వెలువడుతుంటే, మనం ఎక్కడున్నా, ఎలాంటి మూడ్‌లో ఉన్నా, మనకే తెలియకుండా, మొహంలోకి నవ్వూ, హుషారూ వచ్చేస్తాయి. అలాంటి టానిక్ తయారు చేసి 40ఏళ్ళ పాటు, కొన్ని సినిమాల ద్వారానే అయినా, మన మనస్సులను, దేహాలను ఆరోగ్యంగా ఉంచిన సంగీత వైద్యుడు ఓ.పి.నయ్యర్. (అందుకేనేమో ప్రస్తుతం సంగీతం వదిలేసి, హోమియోపతి ప్రాక్టీసు పెట్టారు.) అతను సుశిక్షిత సంగీత విద్వాంసుడు కాడు. పెద్ద ఖాన్‌దాన్‌కి చెందిన వాడూ కాడు. పైపెచ్చు పేచీకోరు మనిషి. హిందీ చలన చిత్ర రంగానికి మకుటం లేని మహారాణి వంటి లతా మంగేష్కర్ తన పాటలు పాడడానికి పనికి రాదని 1950ల్లోనే తీర్మానించిన సాహసి. అలాంటి తీర్మానం తర్వాత కూడా సంగీత దర్శకుడిగా గొప్ప విజయాలు సాధించిన అపురూపమైన వ్యక్తి.

1949లో బొంబాయి చలనచిత్ర రంగంలోకి పూర్తిగా ప్రవేశించినా, మొదటి మూడు సినిమాల సంగీతం హిట్ కాకపోవడంతో, (ఆస్మాన్ (1952), చమ్ చమాచమ్ (1952), బాజ్ (1953)), బిచాణా కట్టేద్దామని నిర్ణయించుకుని, బాజ్ సినిమా సంగీతం కోసం గురుదత్ తనకు ఇవ్వాల్సిన పైకం కోసం అతనితో తగువు పెట్టుకున్నాడు. ఈ తగువే జరక్కపోతే, ఈనాడు ఓ.పి. ఇంత ప్రసిద్ధుడు అయ్యేవాడు కాడేమో. ఆ డబ్బులివ్వలేక, ఒక స్నేహితుడి సలహాపై గురుదత్, నయ్యర్‌కు తన తరువాతి సినిమా 'ఆర్ పార్' (1954)కు సంగీత దర్శకత్వం నిర్వహించమని కోరాడు. అంతే, ఆ తర్వాత ఏం జరిగిందో అందరికీ తెలిసిందే. నిజానికి, బాజ్ (1953) సమయానికే గురుదత్‌కు నయ్యర్‌ను సిఫారసు చేసింది. గీతాదత్, ఆ తర్వాత అతని సంగీత దర్శకత్వంలో 'బాబూజి ధీరే చల్‌నా, మేరా నామ్ హై చిన్ చిన్ చూ, యేలో మై హారి పియా' సున్ సున్ సున్ సున్ జాలమా, తుమ్ జో హువే మేరే హమ్ సఫర్ వంటి అద్భుతమైన పాటలు పాడింది గీతాదత్తే. అనంతర కాలంలో ఆశాభోంస్లే ఆరాధనలో పడిపోయి, తను గీతాదత్‌కు అన్యాయం చేశానని ఒక సందర్భంలో నయ్యరే ఒప్పుకున్నారు.

లతా మంగేష్కర్‌తో ఏ పేచీ లేకపోయినా, ఆమె 'సన్నటి, తీగె లాంటి కంఠస్వరం తన బాణీలకు ఏ మాత్రం సరిపోదని, తనకు షంషాద్, గీతా, ఆశాలే సరైన గాయనులనీ' నయ్యర్ అనేక సార్లు వివరించారు. ఓ.పి.నయ్యర్ సంగీతంలో యౌవనం తొణికిసలాడుతుంటుంది. ఆ స్వరాల్లోని జీవం, ఉత్సాహం మనల్ని ఆనందపు వెల్లువలా ఆవరించేస్తాయి. అందుకు కారణం ఆయన సినిమాలన్నీ సరదా, ప్రేమకథలే కావడం. గంభీర కథనాలు, ట్రాజెడీలు, చారిత్రకాలు, ఐతిహాసికాలు నయ్యర్‌కు ఎప్పుడూ తటస్థ పడలేదు. అద్భుతమైన ప్రకృతి రమణీయకత, సౌందర్యాధిపతులైన నాయికా నాయకులు, సుకుమార ప్రణయాలు, చిన్న చిన్న అపార్థాలు, పునస్సమాగమాలు, ఎప్పుడూ పిక్నిక్‌లా ఉండే జీవితం - ఇవే నయ్యర్ చిత్రాల కథా వస్తువులు. షమ్మీ కపూర్, జాయ్ ముఖర్జీ బిశ్వజిత్ వంటి నాయకులు, ఆశా పరేఖ్, సాధన, షర్మిలా, టాగోర్ వంటి నాయికలు ఆడుతూ, పాడుతూ జీవితాలు గడిపేస్తుంటే, ఆ ప్రణయాన్ని రఫీ, ఆశా తమ అద్భుత కంఠస్వరాలతో ఆలపిస్తుంటే... అదో అద్భుత ప్రపంచం. దానిలోంచి బయటకు రాబుద్ధి కాదు.

ఎస్.డి.బర్మన్, రోశన్, నౌషాద్, మదన్ మోహన్‌లను అభిమానించిన నయ్యర్ వారి కంటే చాలా భిన్నమైన సంగీతం అందించారు. నిజానికి నయ్యర్ సంగీతాన్ని మరెవరి సంగీతంతోనూ పోల్చలేం. పాశ్చాత్య బాణీలు, పంజాబీ జనపదం, బీట్‌కు ప్రాముఖ్యం కలిసి, సరోద్‌ను తొలిసారిగా సినిమా సంగీతానికి పరిచయం చేసిన (ఇది ఆయనే చెప్పుకున్నారు) నయ్యర్ స్వరకల్పనలో మాధుర్యం, అల్లరితనం పోటీ పడుతుంటాయి. (తారీఫ్ కరూ లాంటి) ఎంత గొడవ గొడవ పాటకు స్వర రచన చేసినా మాధుర్యంలో ఎక్కడా రాజీ పడకపోవడం అతని ప్రత్యేకత. నయ్యర్ ముద్ర చాలా బలమైనది. ఎంత దూరం నుంచి మైక్‌లో విన్నా ఆయన ట్రేడ్ మార్క్‌ను ఇలా పట్టేయవచ్చు. అలాంటి ఇండివిడ్యుయాలిటీ అతని ప్రత్యేకత. అతన్ని అనుకరించాలని కొంతమంది ప్రయత్నించారు. కానీ (ఉదాహరణకు అందాజ్ అప్నా, అప్నా సంగీత దర్శకుడు తుషార్ బాటియా), ఎవ్వరూ అతని సమీపానికి రాలేకపోయారు.

నయ్యర్ సంగీతంలోని వైవిధ్యం అవర్ణనీయం. 'మాంగ్‌కే సాథ్ తుమ్హారా' (నయాదౌర్(1957)-రఫీ,ఆశా).'హోలే హోలే సాజనా, ధీరే ధీరే బాలమా' (సావన్‌కీ ఘటా (1966) - ఆశా)లలో బండిని స్ఫురింపచేసే బీట్, 'దీవానా హువా బాదల్' (కశ్మీర్‌కీ కలీ (1964) - రఫీ,ఆశా), మేరీ జాన్ తుమ్ సే సద్ కే (సావన్ కీ ఘటా(1966) - మహేంద్ర కపూర్)లలోని సితార్, 'చల్ అకేలా చల్ అకేలా' (సంబంద్ (1969-82) - ముఖేశ్), 'సాథీహాథ్ బఢానా' (నాయాదౌర్‌లో ఆశా, రఫీ, బృందం) పాటల్లోని కోరస్ - ఇలాంటివి విన్నప్పుడు అతనిలోని సృజనాత్మకత విశ్వరూపం మనకు స్పష్టమవుతుంది. ఎప్పుడూ సరదా, సరదా, వేగం, ఉత్సాహం ఉన్న పాటలే అతనికి చేతనయ్యాయని అనుకోవడం కూడా పొరపాటే. 'రాగిణి' (1958)లోని 'ప్యార్ పర బస్‌తో నహీ హై మేరా లేకిన్ ఫిర్‌భీ - యే బతాదే కి తుఝే ప్యార్ కరూ యా నకరూ' (తలత్, ఆశా', ఫాగున్ (1958)లోని 'ప్యార్ పర బస్‌తో నహీ హై మేరా లేకిన్ ఫిర్‌భీ - యే బతాదే కి తుఝే ప్యార్ కరూ

యా నకరూ' (తలత్, ఆశా), ఫాగున్ (1958)లోని 'మైసోయా అఖియా మీచే - తేరీ జుల్ఫోంకే నీచే' (రఫీ, ఆశా), బహారే ఫిర్‌భీ ఆయేగీ (1966)లోని 'ఆప్ కి హాసీన్ రుఖ్ పే ఆజ్ నయా నూర్ హై మేరా దిల్ మచల్ గయాతో మేరా క్యా కుసూర్ హై (రఫీ) వింటుంటే, ఆ మార్దవానికి హృదయం కరిగి నీరవుతుంది. అలాగే, 'మిట్టిమే సోనా' (1960)లోని 'పూచౌన హమే హమ్ ఉన్‌కేలియే, క్యా క్యా జనరానే లాయి హై'(ఆశా), ప్రాణ్ జానే (1973,74)పర్ వచన్ నజాయేలోని 'చైన్ సే హమ్ కో కభీ - ఆప్ నే జీనే నా దియా' (ఆశా), సంబంద్ (1962)లోని 'తుమ్ కోతో కరోడో సాల్ హువే, బతలావో గగన్ గంభీర్'(ఆశా), మేరే సనమ్ (1965)లోని టుక్ డే హై మేరే దిల్ సే ఐ యార్ తేరీ ఆంసు', ఫిర్ వహీ దిల్ లాయా హూ (1963)లోని 'అంచల్ మే సజాలేనా కలియూ' (రెండూ రఫీ)... ఇలా ఎన్నో వింటూంటే, ఉద్వేగం, విషాదం ఎంత అందంగా స్వరపరిచాడో అనిపిస్తుంది. అలాగే కల్పనా (1960)లోని రఫీ, మన్నాడేల తూ హై మేరా ప్రేమ్‌దేవ్‌తా వింటే, ఈయన శాస్త్రీయ బాణీలు ఇంకా ఎక్కువ ఎందుకు చేయలేదా అని ఆశ్చర్యం వేస్తుంది.

ఓంకార్ ప్రసాద్ నయ్యర్ అన్నిటి కంటే యుగళ గీతాలకు సుప్రసిద్ధుడు. మచ్చుకి కొన్ని చెప్పుకున్నా, ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా (1962)లోని 'బహుత్ శుక్రియా, బడీ మెహర్ బానీ', 'మై ప్యార్‌కా రాహీ హూ', 'ఆప్ యూహీ అగర్ హమ్ సే మిల్ తే రహే', కశ్మీర్ కీ కలీ (1964)లోని 'దీవానా హువా బాదల్' 'ఇశారో ఇశారోమే... దిల్ లేనే వాలే', ఫిర్ వహీ దిల్ లాయా హూ (1963)లోని 'నాజ్‌నీ, బడా రంగీన్ హై వాదా తెరా', 'తేరి రాతోం కేలియే దిల్‌కో జలాయా హమ్ నే' 'యే రాత్ ఫిరన ఆయేగీ' లోని 'ఆప్ సే మైనే మేరీ జాన్ మొహబ్బత్‌కీ హై, ఆప్ చాహేతో మేరీ జాన్ భీ లేసక్ తీ హై', 'ఫిర్ మిలోగే కభీ, ఇస్ బాత్ కా వాదా కర్ లో' ... ఇంకా ఎన్నో - ఇవన్నీ రఫీ, ఆశా అని వేరే చెప్పక్కర్లేదు. ఇక రఫీ, గీతా పాటల్లో 'ఉధర్ తుమ్ హసీ హో, ఇధర్ దిల్ జవా హై' (మిస్టర్ అండ్ మిసెస్ 55 (1955)), తుమ్ జో హువే మేరే హమ్ సఫర్ (ట్వల్వ్ ఓ క్లాక్) వంటివి.

నయ్యర్ గురించి చెప్పుకోగానే గుర్తుకొచ్చేది ఆశాభోంస్లే. నయ్యర్ లేకపోతే ఆశా లేదని అనలేం గాని, అతని ప్రోత్సాహం వల్లే ఆశా అంత వైవిధ్యం సాధించగలిగిందనీ, అక్కగారితో సరిసమానంగా ఎదగగలిగిందనీ అంటే అతిశయోక్తి కాదు. ముఖ్యంగా, లతా మహారాణిలా వెలుగొందుతూ, లతా పాడితే తప్ప సంగీత దర్శకులకు విజయం సాధ్యం కాదని రుజువవుతున్న రోజుల్లో, తననే నమ్మి, తనకే అన్ని రకాల పాటలు ఇచ్చి, ఘన విజయం సాధించిన నయ్యర్ రుణం ఆశా తీర్చుకోలేనిదే. అయినప్పటికీ, నయ్యర్ అలాంటి అహంభావానికేమీ పోకుండ, 'నేను లేకపోయినా ఆమె రాణించేదే. ఆమె ప్రతిభ అంత గొప్పది' అంటారు. సి.రామచంద్ర, ఎస్.డి.బర్మన్ వంటి ఒకరిద్దరు కూడా ఆశా ప్రతిభకు న్యాయం చేసిన మాట నిజమే. కానీ, నయ్యర్ సంగీతంలో ఆమె అందుకోని శిఖరాలు లేవు. ఆమె స్వరంలో వినిపిచని లోతుల్లేవు. కిస్మత్‌లోని 'ఆవో హుజుర్ తుమ్ కో'(1968) యే రాత్ ఫిర్ నా ఆయేగీ (1966)లోని 'మైశాయద్ తుమ్హారే లియే అజనభీ హు', యహీ వో జగా హై...' ఇంకా సావన్ కీ (1966) ఘటా లోని 'ఆజ్ కోయి ప్యార్ సే, దిల్‌కే బాత్ కహగయా' 'మేరి జాన్ తుమ్ పే సద్ కే', ప్రాణ్ జాయే (1973)లో ఆశాకు ఫిల్మ్‌ఫేర్ అవార్డు తెచ్చి పెట్టిన 'చైన్ సే హమ్ కో కభీ', ఇంకా, రఫీ సోలోలే ఎక్కువ ఉన్నా, అక్కడక్కడా తళుక్కుమనే అనేక పాత చిత్రాల సోలోలు (ముఖ్యంగా హౌరా బ్రిడ్జి (1958)లోని ఆయియే మెహరుబా), ఎన్నో ఆశా, నయ్యర్‌ల మధుర సాహస చర్యానికి ప్రతిబింబాలు. అయితే, నయ్యర్ ఇప్పటికీ ఆశాను తలుచుకుని, నాలుగు మంచి మాటలు చెబుతున్నా, ఆశా కొన్నేళ్లుగా ఏ ఇంటర్వ్యూలోనూ నయ్యర్‌ను కనీసం తన కెరీర్‌లో భాగంగానైనా ప్రస్తావించకపోవడం, స్టేజి కార్యక్రమాల్లో నయ్యర్ పాటలు పాడకపోవడం (ఎంత బలమైన కారణం ఉన్నప్పటికీ) చాలా విడ్డూరం. ఇంకా విచిత్ర మేమిటంటే,నయ్యర్‌కు యువ సంగీత దర్శకుల్లో ఎవరు ఇష్టమని అడినపుడు అతను ఆశా సహచరుడైన ఆర్.డి.బర్మన్‌ను పేర్కొనడం. బహుశా ఆర్.డి. పాశ్చాత్య సంగీత బాణీల్లో నయ్యర్ తనను తాను చూసు కున్నాడేమో, ఏమైనా, రఫీని వదిలేసిన తర్వాత కొంతవరకూ, ఆశా దూరమైన తర్వాత పూర్తిగాను నయ్యర్ సంగీతం లయ తప్పింది. శ్రుతి చెడింది. 1980 దశకంలో కొన్ని సినిమాల్లో అతను చాలా తక్కువ రకం సంగీతం అందించాడు. తర్వాత తెర వెనక్కి తప్పుకున్నా. తెలుగులో 'నీరాజనం' పాటల ద్వారా పాత నయ్యర్‌ను మళ్ళీ గుర్తుకు తేవడం తెలుగు వారి అదృష్టం. ప్రస్తుతం చలనచిత్ర సంగీతానికి దూరంగా ఉంటూ, జిటీవీ సరిగమలో అపుడపుడు కనిపిస్తూ (అది సరిగమపా కాక ముందు), తన అసాధారణమూ, ఆ పాత మధురమూ అయిన బాణీలనే మళ్ళీ మళ్ళీ పాడుకోమని ఆదేశిస్తూ, హోమియో వైద్యానికి అంకితమయ్యాడు ఓ.పి.నయ్యర్.

ఆయన పాటలు వింటే మాత్రం, 'యూతో హమ్ నే లాఖ్ ఫన్ కార్ దేఖీ హై, తుమ్ సా నహి దేఖా' అని పాడుకోవాలనిపిస్తుంది.

-మృణాళిని

ఓ.పి.నయ్యర్‌ను ముఖాముఖి ఇంటర్వ్యూ చేసే మహదవకాశం నాకు 'ఉదయం' దిన పత్రికలో పనిచేస్తున్నపుడు కలిగింది. నేను, మరో ఇద్దరు సహోద్యోగులు అక్కడికి వెళ్ళగానే 'తెలుగు పత్రికల వారికి నా గురించి ఏం తెలుస్తుంది?' అన్నట్టు చూసి, అనహనంగా కూర్చున్న నయ్యర్ కాసేపటికి మా ప్రశ్నలు విని మెత్తబడ్డారు. చాలా విషయాలు చెప్పారు. అందులో ఓ రెండు.

"ఆశా భోంస్లేలో వున్న పూర్తి ప్రతిభను వెలికి తీసిన వాణ్ణి నేనేనన్న మాట నిజమే. కాని ఇది నా గొప్పదనం కాదు. ఆమె నిజంగా జీనియస్"

కొంతకాలం రఫీతో పోట్లాడి, మహేంద్ర కపూర్ చేత పాడించుకోవడానికి కారణమేమిటని అడిగాను.

"నా జీవితంలో నేను తలచుకోడానికి కూడా ఇష్టపడని దశ అది. రఫీ ఒక రికార్డింగ్‌కు ఆలస్యంగా వచ్చాడని, 'నువ్వు నాకిక పాడక్కరలేదని చెప్పేసాను. అతను చిన్న బుచ్చుకున్నాడు. కానీ ఒక్క మాటా అనలేదు. శంకర్ జై కిషన్‌ల రికార్డింగ్‌లో కాస్త ఆలస్యమై, అతను ఆలస్యంగా వచ్చాడు తప్ప అందులో అతని తప్పేమీ లేదని తెలిసి కూడా నేను అలిగాను. అలా కొంతకాలం మహేంద్రకపూర్ చేత పాడించుకున్నాను. తర్వాత ఒకసారి ఏదో ముహూర్తం సందర్భంలో ఎక్కడో రఫీ కనిపించాడు. నన్ను చూడగానే నా వద్దకు వచ్చి పాదాలు కళ్ళకద్దుకొని అభివాదం చేసాడు. అదే చిరునవ్వు, అదే నమ్రత. నాకు ప్రాణం లేచి వచ్చింది. 'నా కోసం పాడతావా?' అని అడిగాను. చిరునవ్వు నవ్వాడు. అలా మా మధ్య స్నేహం కలిసింది. 'హమ్‌సాయా'లో రఫీ పాడిన తర్వాత అనుకున్నాను 'ఇతన్ని వదిలి ఎలా ఉన్నాను?' అని.

ఓ.పి.నయ్యర్ ఫేవరెట్స్ ఏవి అనే చర్చ వచ్చినప్పుడు, 'దిల్‌నే' 'అవాజ్‌భీ సున్ మేరే ఫసాకీ పే నజా' (హమ్‌సాయా) 'పూఛో న హమే హమ్ ఉస్‌కేలియే క్యా క్యా నజరానీ లాయే హై' (ఆశా, మిట్టీమే సోనా), 'రాత్‌భర్ కా హై, మెహమాన్ అంధేరా కిస్‌కే రోక్ రుకాహై సవేరా' (రఫీ,ఆశా - సోనేకా ఛిడియా)అనే మూడు పాటలూ నేను చెప్తే ఆయన నిర్ఘాంతపోయాడు 'నా అంచనా ప్రకారం నా బెస్ట్‌టెన్‌లో వస్తాయి నీకెలా తెలిసింది' అని ముచ్చటపడ్డాడు. ఆయన అభిరుచి, నా అభిరుచి కలగలిసినందుకు నేను ఎంతో మురిసిపోయాను. ఈ స్నేహం ఫలితంగా 'నీరాజనం' కేసెట్టు నాకు బహుకరించారు. అదో మరపురాని సన్నివేశం.

- మృణాళిని

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



22

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



## జరిగినకథ



వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం చేయించాలన్న పక్కింటి అండాళ్ళమ్మ సలహా విని వెంకట్రావు పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటాడు. గత్యంతరం లేక ఒప్పుకున్న వెంకట్రావు దంపతులచేత తూతూ మంత్రాలతో పూజలు చేయించి దోచుకుంటాడు. జరిగిన తతంగమంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు. ఇదంతా మీ ఇంటి వాస్తు బాగా లేకపోవటం వల్లే జరిగిందని, వాస్తుభూషణరావుని కలిస్తే ఫలితం ఉంటుందన్న నారాయణ సలహా మేరకు వాస్తు భూషణరావు ఇంటికి వచ్చి లైనులో నిలబడతాడు వెంకట్రావు. ఎంతసేపటికి లైను కదలదు. అక్కడకు వచ్చిన వారందరికి ఆకలి దహించి వేస్తూ వుంటుంది. అయినా పెసర్దోస్ గ్రూపు వారు చెప్పిన ధరలు విని కొనటానికి ఎవరూ సాహించక పోగా వారితో వాదనకు దిగుతారు.

(ఇక చదవండి)

"మరీ ఇంత దారుణమా"
"ఇంత దోపిడియా"
"దిసీజ్ డే లైట్ రాబరీ"
"పరమ అన్యాయం"
రకరకాలుగా అరిచారందరూ.

చికెన్ బిర్యానీ తొమ్మిదొందలా! దాంతో ఇరవై కిలోల కోడి మాంసం వస్తుంది."

"మటన్ బిర్యానీ వెయ్యి రూపాయ లేంటయ్యా, పదికిలోల మటన్ కొనుక్కొని ఇంటిల్లి పాదీ ఇరవై రోజులు తినవచ్చునే."

''బాయిల్డ్ ఎగ్ నూట అరవై రూపాయలు ఘోరం. దాంతో నాలుగుకోళ్ళే కొనవచ్చు.''

"బయట నాలుగు రూపాయలకు దొరికే ఆమ్లెట్ రెండొందలా? ఈ అన్యాయాన్ని ప్రశ్నించే వాడే లేడా?"

లబలబలాడారు కొందరు.

"ఇంతింత రేట్లకు అమ్మడానికి నీకు పర్మిషనిచ్చిందెవరు?"

తీవ్ర స్వరంతో అన్నాడు వెంకట్రావు.

''సార్.. మేము ఇందాకనే చెప్పాం. మేము ఎవరితోనూ వాదించమని, జర్మనీ కోళ్ళరుచి అలాంటిది.''

"కోడి ఎక్కడైనా కోడేనయ్యా. జర్మనీ కోడయినా జపాన్ కోడైనా అన్నీ ఒకటికాదూ...."

"సార్.... లంచ్ కావల్సిన వారు తొందరగా బుక్ చేసుకుని డబ్బులు కట్టండి. పది నిముషాలలో జర్మనీ నుంచి ఫాక్స్ మెసేజ్ వస్తుంది. ఈ రేట్లు తొమ్మిది నిముషాలా ఏభై తొమ్మిది సెకండ్ల వరకే అమలులో ఉంటాయి. ఆలసించిన ఆశా భంగం" అన్నాడు బండి వ్యక్తి.

ఎవరూ నోరు మెదపడం లేదు. స్టార్ హోటల్స్ గురించి వినడమే తప్ప ఎవ్వరూ ఎప్పుడూ ఆవీధిమొహం కూడా చూసిన వారు కాదు. వాళ్ళు చెప్పిన రేట్లు వినగానే అందరికీ పగలే నక్షత్రాలు కనపడుతున్నాయి. అందరూ ఆలోచనలో పడ్డారు.

''పోనీ బయటకు వెళ్ళి తినివస్తే'' అన్నాడొకాయన.

"చుట్టు పక్కల రెండు కిలో మీటర్ల




దూరంలో ఎక్కడా హోటలన్న మాటలేదు కదా?"

''ఈ లోపల వాస్తు భూషణం గారి పిలుపొస్తే?''

"పైగా లైను మారుతుంది కదా! ఎవరు ముందు వెనక ఎవరున్నారో ఎలా తెలుస్తుంది?"

రకరకాల వ్యాఖ్యలు వినిపించాయి.

"మిత్రులారా...." పిలుపు వినపడటంతో అందరి చూపు అటు వైపు మళ్ళింది.

అరవై సంవత్సరాల వృద్ధుడతను.

"అందరూ నామాట వినండి రోజూ అన్నం తింటాం. ఒక్కరోజు అన్నంలేక పోతే మునిగి పోయిందేంటి? గాంధీ, నెహ్రూ, ప్రకాశం పంతులు గార్లు నిరాహార దీక్షలు చెయ్యలేదా? అమర జీవి పొట్టి శ్రీరాములుగారు ఏభై ఆరురోజులు నిరాహార దీక్ష చెయ్యలేదా? మనం తిండి లేకుండా ఒక్కరోజు ఉండలేమా? సోదరులారా... మనమంతా ఒకే దేశమాత బిడ్డలం. కనుక అందరూ నామాట విని మనం ఎవ్వరం ఆర్డర్లివ్వద్దు." అన్నాడు వృద్ధుడు.

"మీరు వృద్ధులు గాబట్టి ఆకలికి తట్టుకుని ఉండగలరు, కానీ నాకు ఒక్క నిముషం ఆలస్యమైందంటే ప్రాణం పోతుంది." అన్నాడో యువకుడు.

"నిజమే బాబూ.... ఆకలి అందరికీ ఒకటే. అలనాడు గాంధీజీ కూడా ఇలాగే అనుకుంటే మన స్వతంత్రం వచ్చేదా? పొట్టి శ్రీరాములు గారు ఇలాగే ఆకలికి ఉండలేను అంటే మనకు స్వరాష్ట్రం లభించేదా? అందరం ఐకమత్యంగా ఉందాం. మనం అసలేం కొనద్దు. దాంతో చచ్చినట్లు రేట్లు తగ్గిస్తారు." చెప్పాడు వృద్ధుడు.

"అవును. ఆయన చెప్పింది నిజం. ఏదైనా సాధించటానికి కొంత త్యాగం అవసరం. అందువల్ల మనమేం కొనకూడదు" అన్నాడు వెంకట్రావు.

సరే అంటే సరే అన్నారంతా.

పదినిముషాలు చూసి వెళ్ళిపోయారు బండివాళ్ళు.

"చూశారా... ఐకమత్యానికి మించిన బలం లేదు. మన యూనిటి చూసి తోక ముడిచారు వాళ్ళు" నవ్వుతూ అన్నాడు వృద్ధుడు.

క్యూ మెల్లగా కదులుతున్నది. అయినా కొత్త జనం వచ్చి క్యూలో చేరుతూనే ఉన్నారు.

"ఏడు కొండల వాడా ... వెంకటరమణా! తొందరగా వాస్తు భూషణం గారి దర్శనం అయితే నీ కొండకు నడిచి వస్తా. గోవిందా గోవిందా..." అరిచాడు వృద్ధుడు.

ఉన్నట్టుండి క్యూ ఆగిపోయింది. దృఢ కాయులు కంగారుగా దుడ్డుకర్రలు ఊపుతూ అటు ఇటు పరిగెత్తసాగారు. మరి కొంతమంది లాఠీలు ఊపుతూ క్యూలలో ఉన్నవారిని గోడ వైపు జరగమని హెచ్చరిస్తున్నారు. దూరంగా సైరన్ మోతలు, విజిల్స్ శబ్దాలు వినిపించాయి.

"ఏమైంది ఏమైంది" అడగసాగారందరూ

ఎవరూ సమాధానమివ్వడం లేదు. 'జరగండి జరగండి' అని అరుస్తున్నారు.

అయోమయంగా ఉంది అందరికీ.

ఇవాళ మనం బయలు దేరిన వేళావిశేషం బాగాలేదు. మరోసారి వద్దాంలే" అంటూ కొందరు బయటకు వెళ్ళిపోడానికి ఉద్యుక్తులయ్యారు.

అంతలోనే వచ్చారు దృఢకాయులు.

"కంగారు పడకండి సార్. ఎవరూ వెళ్ళి పోనవసరం లేదు. సీరియల్స్ మధ్య ఎడ్వర్టైజ్ మెంట్లలా చిన్న బ్రేక్" చెప్పాడో గార్డు.

"అదే దేనికంటా?" అడిగాడొకాయన.

"ఛీఫ్ మినిష్టరుగారికి వ్యతిరేకంగా ఎమ్మెల్యే లంతా సంతకాల ఉద్యమం చేపట్టారట. సాయంత్రానికి గవర్నమెంట్ పడిపోయేట్లుందిట. ఇంట్లో ఏదో వాస్తు లోపం ఉండి ఉంటుందని భావించి సీ.యమ్.గారు వాస్తుభూషణం గారిని కలవడానికి వస్తున్నారు. అందువలన అరగంటసేపు క్యూ ఆపుతున్నారు" చెప్పి పరిగెత్తాడు గార్డు.



అందరూ ఆశ్చర్యంతో నోరు తెరిచి చూస్తుండగానే ఇరవై అంబాసిడర్ కార్లు రివ్వున దూసుకొచ్చాయి. వాటికి ముందు, వెనకున్న నాలుగు లారీల్లోంచి వందమంది పోలీసులు దిగి గబగబ పరిగెత్తుతూ సీయమ్ నడిచేదారికి రెండు వైపుల తుపాకులు ఎక్కుపెట్టి నిలుచున్నారు.

మరో ఏభై మంది సీ.యమ్. అనుచరులు ఫెళ ఫెళలాడే ఇస్త్రీ చేసిన ఖద్దరు ప్యాంట్లు, షర్టు ధరించి దిగారు. ముఖ్యమంత్రి కారు దిగి జారిపోతున్న పంచెను చేత్తో పట్టుకుని పరుగులాంటి నడకతో వాస్తుభూషణం ఆఫీసులోకి వెళ్ళసాగాడు.

"హుం... ఇదీ మన ప్రజాస్వామ్యం! దొంగలను, హంతకులను వేటాడి పట్టుకోవలసిన బాధ్యతగల పోలీసులు ఒక్క వ్యక్తి కోసం ఇక్కడ తిరుగుతున్నారు. ఇక్కడ ఈయనకొచ్చిన ప్రాణ భయమేంటో?" నిర్వేదంగా అన్నాడు వెంకట్రావు.

"అంత భయమున్న వాడికి పదవెందుకో! హాయిగా ఇంట్లో కూర్చోక!" మరొకతనన్నాడు.

"జార్జి బుష్షును, టోనీ బ్లేయర్ని చూడండి. వాళ్ళు పబ్లిగ్గాతిరుగుతున్నా ఒక్క పోలీసూ వాళ్ళతో కనపడడు." అన్నాడు ఇంకొకతను.

"అంతెందుకు? మొన్న బి.బి.సి.లో చూశాను. బిల్లుక్లింటను, ఆయన భార్య వల్లరి......" మొదలెట్టాడు మరోకాయన.

"ఆమె వల్లరి కాదండి హిల్లరి" వీసా కోసం అప్లయ్ చేసిన కుర్రాడొకడు సరిదిద్దాడు.

"ఏదోకట్లేవోయ్.. అల్లరిచెయ్యకు,మనవల్లరే అక్కడ గిల్లరై తరువాత హిల్లరైంది....." కోపంగా అన్నాడతను.

"సరె.. ఏమైందో చెప్పండి" అన్నాడు వెంకట్రావు.

"పదవి పోయింతరువాత తాముండటానికి వీలయ్యే ఇంటి కోసం స్వయంగా ఆయన భార్యతో కలిసి అద్దె ఇంటి కోసం వీధుల్లో తిరిగాడు. మన నాయకులను చూడండి! ఒక్కడు వస్తుంటే వాడి వెంట రెండొందల మంది కాపలా!" నిరసనగా అన్నాడతను.

వాస్తుభూషణం ఆఫీసులోకి వెళ్ళగానే తలుపులు మూసుకున్నాయి. ఒక్కొక్కడు వంద మంది మెడలు కొరికి రక్తం తాగిన వాడిలా ఉన్న ముఖ్యమంత్రి అనుచరులు పహరా కాస్తున్నారు.




పదినిముషాలు గడిచాయి.

ఆఫీసు తలుపులు భళ్ళున తెరుచుకున్నాయి.

చెమటలు తుడుచుకుంటూ ముఖ్యమంత్రి, ఆయన భుజం మీద చేతులు వేసి చిరునవ్వులు చిందిస్తూ వాస్తుభూషణం బయటకొచ్చారు.

"మీకేం భయంలేదు ఈశాన్యం మూలనున్న చీపురు హేండిల్ కిందికి వచ్చేట్లు పెట్టింది మీ పనిమనిషి. అందువల్లనే మీకీ టెన్షన్ వచ్చింది. తక్షణమే ఈశాన్యం మూలనున్న చీపురును హేండిల్ పైన, కుచ్చులు కింద ఉండేట్లు నైరుతి మూలన పెట్టించండి మీకు పదవి భంగం ఉండదు. పాతి కేళ్ళు సీ.యమ్.గా పదిహేనేళ్ళు పీ.యమ్.గా ఉంటారు." చేయెత్తి ఆశీర్వదించాడు వాస్తుభూషణం.

ముఖ్యమంత్రి రెండు చేతులు జోడించి బోర్లా పడి వాస్తుభూషణం పాదాలకు నమస్కరించాడు. కెమేరాలన్నీ ఫ్లాషులు వెలి గించాయి. ముఖ్యమంత్రి లేచి అను చరులతో కలిసి వడివడిగా వెళ్ళి పోయాడు ఆయన పటాలమంతా నిష్క్రమించింది. తుఫాను వెలిసినట్లయింది.

"ఆహా.. వాస్తు మహిమ చూశారా... ఒక్క చీపురు కారణంగా రాష్ట్రాధినేత పదవికి గండం వచ్చింది. అందుకనే

వాస్తు - ప్రజల దోస్తు

అన్నారు పెద్దలు. అది పూరి గుడిసైనా, పదంతస్తుల మేడైనా వాస్తు కుదరకపోతే పేక మేడలా కూలిపోక తప్పదు" సందేశమిచ్చి ఆఫీసులోకి వెళ్ళిపోయాడు వాస్తుభూషణం.

"సార్.. ఇక్కడ క్యాంటిన్ వాళ్ళు ప్రజలను దోస్తున్నారు...." వెంకట్రావు చెప్పబోయాడు. కానీ అదేమీ వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు వాస్తుభూషణం.

మధ్యాహ్నం ఒంటి గంటయింది అందరి కడుపులు ఆకలితో నకనకలాడుతున్నాయి.

ఇంతలో ఘాటైన మసాలా వాసనలు ముక్కు పుటాలనదరగొట్టాయి. పరవశంలో అందరి దృష్టి అటువైపు మళ్ళింది.

క్యాంటిన్ కుర్రాళ్ళు అదే తోపుడు బండిమీద రకరకాల ఆహార పదార్థాలను పెట్టుకుని వస్తున్నారు. ఎర్రగా కాల్చి వెన్న రాసిన తండూరి చికెన్ ముక్కలు బండి చుట్టూ తోరణాల్లా వ్రేలాడుతున్నాయి. నాలుగు పెద్దగాజు పాత్రల్లో మటన్ బిర్యానీ, చికెన్ బిర్యానీ, ప్లెయిన్‌రైస్ ఉన్నాయి. మరికొన్ని పాత్రలలో వాటికి సంబంధించిన గ్రేవీలు, ఇతర పచ్చళ్ళు, పెరుగు ఉన్నాయి. కొన్ని ప్లేట్లలో సన్నగా తరిగిన ఉల్లిపాయ ముక్కలు, ఉడికించిన గుడ్లు ఉన్నాయి.

బండిని క్యూ ముందు ఆపారు. ఎవరూ ఏ పదార్ధాలకూ ఆర్డర్లివ్వకూడదని అంతకు ముందే నిశ్చయించుకుని ఉన్నందున ఎవరూ మాట్లాడలేదు. కుర్రాళ్ళు కూడా ఏమీ మాట్లాడకుండా చికెన్ తోరణాలను సరిజేస్తూ, గ్రేవీని కలియబెడుతూ కాలక్షేపం చేస్తున్నారు.

"ఇంట్లో ఎన్ని మసాలలేసి వండినా అసలు ఏ వాసనా రాదు వీళ్ళ దుంపల్దెగ వీళ్ళు ఏం కలుపుతారో ఏమో కానీ వాసన మాత్రం ఊరంతా వస్తుంది." కామెంట్ చేశాడొకాయన.

ఆ వాసనలకు నోళ్ళూరి పోతున్నాయి అందరికీ, ఎర్రని చికెన్ ముక్కలను చూస్తుంటే లాలాజలం ఊరుతున్నది కానీ ఎవరూ ఆర్డరివ్వడానికి సాహసించడం లేదు.

బండిలోనే ఒక మూలనున్న ఫాక్స్ మిషన్ నుంచి ఏదో లెటర్ వస్తున్నది.

-(ఇంకావుంది)






# తేరే బినా తో
# అభి 'జీత్'

బాలీవుడ్ విజయాన్ని సాధించటం అంత తేలిక కాదు. ముఖ్యంగా నేపథ్యగాయకులుగా రాణించటం మరింత కష్టం. చాలా మందికి ఆ రంగం ఓ ఎండమావి. మంచి గాత్రం, సంగీత పరిజ్ఞానం వున్నా - గాయనీ గాయకులు ఏళ్ళ తరబడి ప్రయత్నాలు చేసినా అది అందని ద్రాక్షే అవుతుంది. అయితే లక్ష్యాన్ని చేరాలనే ప్రగాఢ వాంఛ అభిజీత్‌ను నిద్ర పోనీయలేదు. ఆ నిద్రలేని రాత్రులలో చేసిన సాధన కాస్త ...కాదు కాదు... చాలా ఆలస్యంగానైనా అతన్ని ప్రముఖ గాయకుల జాబితాలోకి చేర్చాయి. ఇవాళ నేపథ్య గాయకుడిగానే కాకుండా పాప్‌సింగర్ గానూ 'తేరేబినా' ఆల్బమ్‌తో ఖ్యాతి గడించాడు అభిజీత్.

చార్టెడ్ అకౌంటెన్సీ చేద్దామని ఉత్తరప్రదేశ్, కాన్పూర్ నుండి ముంబాయి వచ్చిన అభిజీత్ భట్టాచార్య పుట్టింది బెంగాల్‌లో. అయితే పెరిగిందంతా ఉత్తరప్రదేశ్‌లోనే. చదువు నిమిత్తం ముంబాయి వచ్చినా - అతని దృష్టి మాత్రం నేపథ్య గీతాలాపన మీదనే వుండేది. మధ్య తరగతి కుటుంబం నుండి రావటం - పైగా కుటుంబంలోని పెద్దల ఇష్టానికి వ్యతిరేకంగా ఈ రంగాన్ని ఎంచుకోవటంతో తొలి రోజుల్లో అభిజీత్ ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కొన్నాడు. చాలీచాలని గదుల్లో, తెలిసిన వాళ్ళు వుంటే గెస్ట్ హౌసుల్లో కాలం గడుపుతూ-బాలీవుడ్‌లోని ప్రముఖ సంగీత దర్శకుల చుట్టూ చక్కర్లు కొట్టాడు. ఫలితం మాత్రం శూన్యం. నిరాశతో కాన్పూర్‌కి వెనుదిరగటం... మళ్ళీ కొత్త ఉత్సాహాన్ని నింపుకొని ముంబైకి రావటం.... ఈ ఊగిసలాటలో సంగీత దర్శకుడు రవీంద్ర జైన్ కొద్దికాలం తనతోపాటు ఉండవచ్చని ప్రోత్సహించటంతో అభిజిత్‌లో మళ్లీ ఆశలు మొలకెత్తాయి. నిలువ నీడ దొరకడంతో ప్రయత్నాలు ముమ్మరం చేశాడు. అవకాశం చిక్కినప్పుడల్లా అలనాటి ప్రముఖ దర్శకుడు ఆర్.డి.బర్మన్‌ని కలిసి, అవకాశం కోసం అర్థించేవాడు. తిరగగా... తిరగగా మొత్తానికి ఆర్.డి.బర్మన్ మనసు కరిగింది. కొన్ని స్టేజ్ షోలలో అభిజీత్‌కు పాటలు పాడే అవకాశం కలిగింది. అదే సమయంలో రాజేష్ రోషన్, జగ్‌జీత్‌సింగ్ చిత్రాలకు కోరస్ పాడాడు. ఇలా 'గుంపులో గోవింద' గా వుంటూ కాలం వెళ్లదీస్తుండగానే ఆర్.డి.బర్మన్ 'ఆనంద్ ఔర్ ఆనంద్' చిత్రంలో కిశోర్ కుమార్‌తో కలిసి 'వాదోం కీ షామ్ ఆయీ, యారోం కీ నామ్ ఆయీ' అనే పాటను అభిజీత్‌తో పాడించారు. దేవానంద్, అతని కొడుకు సునీల్ ఆనంద్ నటించిన ఈ చిత్రం బాక్సాఫీస్ దగ్గర బోల్తా కొట్టడంతో మళ్ళీ అభిజీత్‌కి అవకాశాలు రాలేదు. అ గ్యాప్‌లో కిషోర్‌కుమార్ పాటల రీ-మిక్స్‌ను, గజల్స్‌ను పాడుతూ కాలం గడిపాడు... ఒకటి కాదు రెండు కాదు దాదాపు పదేళ్ళు. చివరికి 1990లో సల్మాన్‌ఖాన్ 'బాగీ' చిత్రంలో అభిజీత్‌ను విజయలక్ష్మి వరించింది. ఆ చిత్రంలోని 'ఏక్ చంచల్ కౌన్ హసీనా', 'చాందినీ రాత్ హై', 'హర్ కసమ్ సే బడీ హై', తదితర పాటలు జనాదరణ పొందటంతో అభిజీత్ గాయకుల ప్రధాన స్రవంతిలో వచ్చి చేరాడు. 'యేదిల్లగీ'లోని 'ఓలే...ఓలే...', 'మై ఖిలాడీ తు అనారీ', 'దిల్‌వాలే దుల్హనియ లే జాయేగీ', 'ఫరేబ్', 'రక్షక్', 'జుడ్‌వా' తదితర చిత్రాలు అభిజీత్‌కు నేపథ్యగాయకుడిగా సుస్థిర స్థానం కల్పించాయి. ముఖ్యంగా షారూక్ ఖాన్‌కి అభిజీత్ పాడిన పాటలు దాదాపు అన్నీ ప్రజాదరణ పొందాయి. అంతేకాదు 'యస్ బాస్' చిత్రంలో 'చాంద్ తారే...' పాటకు గానూ అభిజీత్ ఉత్తమ నేపథ్యగాయకుడిగా ఫిల్మ్‌ఫేర్ అవార్డుని అందుకున్నాడు.

### పాప్ గాయకుడిగా.....

సినీ నేపథ్యగాయకుడిగా విజయాన్ని సాధించాక, అభిజీత్ పాప్‌గాయకుడిగానూ తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలనుకున్నాడు. 'మై దీవానా హూ', 'ట పోరీ నెం.1', ఆల్బమ్స్‌ను విడుదల చేశాడు. కానీ ఇవి రెండూ కమర్షియల్ గా సక్సెస్ కాలేదు. అయితే అభిజీత్ మూడవ ఆల్బమ్ 'ఆషికీ' మాత్రం అతనికి పాప్‌సింగర్ గానూ గుర్తింపు తెచ్చింది. నిఖిల్ -వినయ్ సంగీత దర్శకత్వం వహించిన 'ఆషికీ' ఆల్బమ్‌కి ఫాయిజ్ అన్వర్ గీతాలను రాశారు. ఈ ఆల్బమ్‌లో ప్రేమ, ప్రేమికుల గురించిన పాటలే వున్నాయి. ఇందులోని మోడ్రన్ లవ్ సాంగ్స్‌కి అభిజీత్ స్వరం సరిగ్గా సూట్‌కావటంతో మంచి విజయాన్ని ఈ ఆల్బమ్ కైవశం చేసుకుంది. ఈ సక్సెస్ స్ఫూర్తితోనే అభిజీత్ 'తేరేబినా' అనే మరో పాప్ ఆల్బమ్‌ను విడుదల చేశారు. పాప్ గీతాల మీద, గాయకుల మీద అభిజీత్‌కి అభిమానం లేకపోయినా - ఆయన పాడిన ఈ పాప్‌గీతాలను

విమర్శకులు సైతం ప్రశంసించారు. ఇవాళ ఈ ఆల్బమ్ టాప్‌టెన్ ఛార్టుల్లో చోటు చేసుకుంది. ఈ ఆల్బమ్ గురించి అభిజీత్ మాట్లాడుతూ "నిజం చెప్పాలంటే ఆ ఆల్బమ్‌లో కొత్తదనం ఏమీ లేదు. ప్రస్తుతం వస్తున్న పాప్ ఆల్బమ్‌కు భిన్నంగా 'అల్ట్రా రొమాంటిక్ ఆల్బమ్' గా దీనిని తయారుచేశాం. 'కభీ కభీ', 'ధడ్కన్', 'రాజ్' చిత్రాలలోని పాటల తరహాలో ఇందులోని గీతాలు సాగుతాయి. ఈ ఆల్బమ్‌కు రూపకల్పనలో మాత్రం నేను ఎక్కువ చొరవే చూపాను. నేను ఇందులో పాటలే పాడినా అన్ని విషయాలలోను నాకు స్వేచ్ఛ కావాలని టీ-సీరిస్ భూషణ్ కుమార్‌కి చెప్పాను. ఆయనకు, నాకు ఈ విషయంలో స్పర్థలు ఏర్పడ్డాయి. గీత రచయితలను, సంగీత దర్శకులనూ ఉండుండీ మార్చేసేవాడు. ఇలా కాదని చెప్పి- నాకంటూ ఓ టీమ్‌ను ఏర్పాటు చేసుకుని తాజ్, కోల్‌కటాలో వారం పాటు రాత్రీ పగలు పని చేశాం. మొత్తానికి సంతృప్తికరంగా మా వర్క్ పూర్తయిందనిపించాక - భూషణ్‌ని పిలిపించి, వినిపించాను. కేవలం అరగంట వ్యవధిలో ఆయన అన్ని పాటలనూ అప్రూవ్ చేశాడు" అని చెప్పాడు. తన ఆల్బమ్ సేల్స్ పెంచుకోవటానికి అందమైన అమ్మాయిలతో వీడియో తీయించడానికి అభిజీత్ ససేమిరా అన్నాడు. నా పాటల అమ్మకాలకు అందమైన హీరోయిన్స్‌తో డాన్స్ చేయించడమో - నేను డాన్స్ చేయడమో నా కిష్టం లేదు. నేనేమీ నటుడిని కాదు. నా పాటలకు వర్త్ వుంది. వాటంతట అవి శ్రోతల్ని ఆకట్టుకుంటాయి. మీరు గమనించారో లేదో - ఇవాళ టీ.విలో వస్తున్న వీడియో క్లిప్పింగ్స్‌ను చూసి - ప్రేక్షకులు ఆనందిస్తున్నారే గానీ - ఆ ఆల్బమ్స్‌ని కొని పాటలు 'వినడానికి' ఆసక్తి చూపడం లేదు" అని అన్నారు. ఏదేమైనా - నాలుగవ పాప్ ఆల్బమ్ 'తేరే బినా' తో అభిజీత్ విమర్శకుల మనసుల్ని జయించారు.

- వి. అరుణ సత్యవతి

# అద్నాన్ సామి పై బ్యాన్ పెట్టాలి

- అభిజీత్

సినిమారంగంలో ఒకరిని నొప్పించకుండా - తాను ఇబ్బందులకు గురికాకుండా పనులు చక్కబెట్టుకుంటూ పోవాలి. ఈ పాలసీ ఎవరినైనా విజయపథంలో నడిపిస్తుంది. కానీ అభిజీత్ మనస్థత్వం ఇందుకు భిన్నమైంది. అతను మనసులో వున్న విషయాన్ని నిర్మొహమాటంగా బైటకి కక్కేస్తాడు. దానివల్ల ఇబ్బందులు, సమస్యలూ ఎదురైనాసరే! అందుకు ఓ ఉదాహరణగా అద్నాన్ సామి మీద అభిజీత్‌కి వున్న కోపాన్ని చెప్పుకోవచ్చు. ఎవరు ఒప్పుకున్నా ఒప్పుకోక పోయినా ఇవాళ ఇండీపాప్‌లో అద్నాన్ సామికి ఓ ప్రత్యేకమైన గుర్తింపు వుంది. అమితాబ్ బచ్చన్, గోవింద... తదితర బాలీవుడ్ స్టార్స్ అద్నాన్ సామి ఆల్బమ్‌లో నటించారు. అయితే అద్నాన్‌సామి వంటి పాక్ గాయనీ గాయకులపై బ్యాన్ పెట్టాలంటూ అభిజీత్ డిమాండ్ చేసి సంచలనం సృష్టించారు. అంతేకాదు జగ్‌జీత్ సింగ్ తో కలిసి ఉపరాష్ట్రపతి ఎల్.కె.అద్వానీకి ఓ లేఖనీ అందించారు.



"భారతీయ గాయనీ గాయకులకు పాకిస్థాన్‌లో గౌరవం లభించనపుడు - అక్కడకు వెళ్ళిన మన ప్రముఖ సంగీత కళాకారులకు అవమానాలు ఎదురైనప్పుడు -మన వారెందుకు మౌనంగా ఊరుకోవాలి? అక్కడ నుండి వచ్చిన గాయకులకు ఇక్కడ ఎందుకు బ్రహ్మరథం పట్టాలి? బాలీవుడ్ స్టార్స్ ఇళ్లపై ఇన్‌కమ్ టాక్స్ అధికారులు తరచు దాడులు చేసి, వారిని సతాయిస్తూ వుంటారు. మరి పాకిస్థాన్ నుండి ఇండియాకి వచ్చి స్థిరపడి కోట్లు గడిస్తున్న అద్నాన్ సామి గురించి వారెందుకు పట్టించుకోరు. అతని వీడియో ఆల్బమ్ రూపకల్పనకు డబ్బులు విదేశాలనుండి వస్తుంటే - అవి ఎక్కడివని ఎందుకు అరాతీయరు..." అని అభిజీత్ ప్రశ్నిస్తున్నాడు. అంతేకాదు... అద్నాన్ సామి వంటి గాయకులు ఇక్కడ స్థానికుల అవకాశాలను కొల్లగొడుతున్నారని అరోపిస్తూ "మనకిక్కడ తినడానికి నాలుగు చపాతీలే వున్నాయి. మా ఆకలి తీరక ముందే పరాయి దేశం వాడు అందులో వాటాని ఆశించడాన్ని ఎలా సహించగలం" అని తీవ్రంగా విమర్శిస్తున్నాడు కూడా.




# అలుపెరుగని చైతన్యం

అలుపు, సొలుపు లేక నిరంతరం చైతన్యంగా ఉండాలని మనకు బోధిస్తుంది సంక్రాంతి గాలిపటం
ఆటుపోటులు, ఎదురుగాలులు జీవితంలో సర్వసహజమనీ, వాటికి కృంగిపోకుండా అనుక్షణం
పైకి ఎదిగేందుకు, ఎగిరేందుకు ప్రయత్నించాలని చెప్పడమే గాలిపటాల ఆట ఉద్దేశ్యం

**నిత్యచైతన్యమే లక్షణంగా, సభ్యుల సంతృప్తే లక్ష్యంగా సాగుతూ...**

**రియల్ ఎస్టేట్ రంగంలో అగ్రగామి సంస్థ జనచైతన్య**

సభ్యమహోదయులకు, క్షేత్రసిబ్బందికి, మిత్రులకు, శ్రేయోభిలాషులకు,
బంధువులకు, అధికారులకు, యావన్మందికి

# సంక్రాంతి శుభాకాంక్షలు

## జనచైతన్య హౌసింగ్ లిమిటెడ్

గుంటూరు ✦ హైదరాబాద్ ✦ విజయవాడ ✦ విశాఖపట్నం ✦ రాజమండ్రి ✦ కాకినాడ ✦ తిరుపతి ✦ నెల్లూరు

Kalyani Ads/JCH-04/S

రచన: సిరివెన్నెల సీతారామ శాస్త్రి (1) గానం : చిత్ర,రఖీబ్‌ఆలమ్

అ: సినుకు రవ్వలో సినుకు రవ్వలో
సిన్నదాని సంబరాల సిలిపి నవ్వులో
పంచవన్నె చిలకలల్లే వజ్జిరాల తునకలల్లే
వయసు మీద వాలుతున్న వాన గువ్వలో ॥సినుకు॥

ఆ: ఇన్నాళ్లగ్గుర్తొచ్చానా వానా
ఎన్నాళ్లన్దాక్కుంటావే పైనా
చుట్టంలా వస్తావే చూసెల్లి పోతావే
అచ్చంగా నాతోనే నిత్యం ఉంటానంటే
చెయ్యార చేరదీసుకోనా
నువ్వొస్తానంటే నే ఒద్దంటానా ॥2॥ ॥ఇన్నాళ్ల॥
ముగ్గులొలికే ముక్కు పుడకై
ఉండిపోవే ముత్యపు చినుకా...
చెవులకు చక్కా జూకాలాగా
చేరుకోవే జిలుగుల చుక్కా
చేతికి రవ్వల గాజుల్లాగా కాలికి మువ్వల పట్టీలాగా
మెళ్లో పచ్చల పతాకంలాగా నగలకు నిగనిగ
నగలను తొడిగేలా ॥నువ్వొస్తానంటే॥

ఆ: చిన్ననాటి తాయిలంలా నిన్ను నాలో దాచుకోనా
కన్నెయేటి సోయగంలా నన్ను నీలో పోల్చుకోనా
పెదవులు పాడే కిలకిలలోనా
పదములు ఆడే కథకళిలోనా
కనులను తడిపే కలతలలోనా
నా అణువణువున నువు కనిపించేలా... ॥నువ్వొస్తానంటే॥

రచన: సిరివెన్నెల సీతారామ శాస్త్రి (3) గానం : టిప్పు,ఉష

అ: హే... లంగా వోణీ నేటితో రద్దై పోని
సింగారాన్నీ చీరతో సిద్ధంకాని
నిన్నలా కన్నెలా తుళ్లకే అమ్మాడీ
చిందులే ఆపగా ముళ్ళు వేయని

ఆ: సర్లేగాని చక్కగా పెళ్లైపోని
అల్లర్లన్ని జంటలో చెల్లైపోని
లగ్గమే పగ్గమై పట్టుకో ప్రాయాన్ని
సొంతమై అందమే అప్పగించనీ ॥లంగా వోణి॥

ఆ: ఓ...చూడు మరి దారుణం
ఈడునెలా ఆపడం
వెంటపడే శత్రువయే సొంత వయ్యారం

అ: హే... ఒంటరిగా సోయగం
ఎందుకలా మోయడం
కళ్లెదురే ఉంది కదా ఇంత సహాయం

ఆ: పుస్తే కట్టి పుచ్చుకో కన్యాధనం
హే.. శిస్తే కట్టి తీర్చుకో తియ్యని రుణం ॥లంగా వోణి॥

అ: సోకు మరీ సున్నితం దాన్ని ఎలా సాకటం
లేత నడుం తాళదు నా గాలి దుమారం

ఆ: కస్సుమనే లక్షణం చూపనిదే తక్షణం
జాలిపడే లాలనతో లొంగదు భారం

అ: ఇట్టే వచ్చి అల్లుకో ఇచ్చేవిచ్చి
ఆర్చి తీర్చి ఆదుకో గిచ్చీ గిచ్చీ ॥లంగా వోణి॥





రచన: సిరివెన్నెల సీతారామ శాస్త్రి (2) గానం : ఎస్.పి.చరణ్,సుమంగళి

అ: మెల్లగా కరగనీ రెండు మనసుల దూరం
ఆ: చల్లగా తెరవనీ కొంటె తలపుల ద్వారం
అ: వలపు వాన దారాలే పంపుతున్నది ఆకాశం
ఆ: చినుకు పూల హారాలే అల్లుతున్నది మనకోసం
అ: తడిపి తడిపి తనతో నడిపి
హరి విల్లును వంతెన వేసిన శుభవేళా...
ఈ వర్షం సాక్షిగా తెలపని నువు నాకే సొంతం
ఈ వర్షం సాక్షిగా కలపని బంధం ॥మెల్లగా॥

అ: నీ మెలికలలోనా ఆ మెరుపులు చూస్తున్నా
ఈ తొలకరిలో తళతళ నాట్యం నీదేనా
ఆ: ఆ ఉరుములలోనా నీ పిలుపులు వింటున్నా
ఈ చిటపటలో చిటికెల తాళం నీదేనా
అ: మతి చెడే దాహమై అనుసరించి వస్తున్నా
ఆ: జతపడే స్నేహమై అనునయించనా
అ: చలి పిడుగుల సడి విని
జడిసిన బిడియము తడబడి నిను విడగా
అ: ఈ వర్షం సాక్షిగా తెలపనీ నువు నాకే సొంతం
ఈ వర్షం సాక్షిగా కలపనీ బంధం

ఆ: ఏ తెర మరుగైనా ఈ చొరవను ఆపేనా
నా పరువము నీ కనులకు కానుక ఇస్తున్నా
అ: ఏ చిరు చినుకైనా నీ సిరులను చూపేనా
ఆ వరుణునికే ఋణపడి పోనా ఈ పైనా
ఆ: త్వరపడే వయసునే నిలుపలేను ఇకపైనా
అ: విడుదలే వద్దనే ముడులు వేయనా
మన కలయిక చెదరని చెలిమికి ఋజువను
చరితను చదివేలా.... ॥ఈ వర్షం సాక్షిగా॥

రచన: సిరివెన్నెల సీతారామ శాస్త్రి (4) గానం : మల్లికార్జున్,కల్పన

ఆ: ఝులే ఝులే ఝుంఝుం ఝులే
గుండెల్లో శంఖాలూదే సుడిగాలే
ఝులే ఝులే ఝుంఝుం ఝులే
పొంగే ఈ గంగనాపే శివుడేలే
వాడంటే వాడే మగ వాడంటే వాడే
ఆ రొమ్ము చూడే ఆ దమ్ము చూడే
నా జన్మ జతగాడే
అ: ఝులే ఝులే ఝుంఝుం ఝులే
అందెల్లో జలపాతాలే తుళ్ళేలే
ఝులే ఝులే ఝుంఝుం ఝులే
శిరసెక్కి చిందాడిందే జవరాలే
ఆ: సూదంటి కళ్ళే అవి తేనెటీగ ముళ్ళే ॥2॥
చుక్కల్ని తెంచే చూపులే
అ: పువ్వంటి ఒళ్ళే పచ్చిపాల జల్లే
ఎక్కిళ్ళు పెంచే సోకులే
ఆ: నీ కౌగిలింత నా కోట చేసుకుంటా
చిరు చినుకంత చింతా
నిన్ను చేరకుండా కన్నుల్లో దాచుకుంటా..... ॥ఝులే ఝులే॥
అ: చిన్నారి హంస ఇష్టమైన హింస ॥2॥
రేపావే నాలో లాలస
ఆ: కొండంత ఆశ నీకు అందజేసా
నీ సొంతమేలే బానిస
అ: నీ తాపాన్ని చూసా అరె పాపం అనేసా
ఆ: ఇక నీదే భరోసా వందేళ్ళ శ్వాస
నీ పేర రాసేసా ॥ఝులే ఝులే॥



రచన: సిరివెన్నెల సీతారామ శాస్త్రి (5) గానం : కార్తీక్,శ్రేయగోషాల్

ఆ: కోపమా నాపైనా ఆపవా ఇకనైనా
అంతగా బుస కొడుతుంటే నేను తాళగలనా హో.....
అ: చాలులే నీ నటనా సాగదే ఇటుపైనా
ఎంతగా నసపెడుతున్నా లొంగిపోనె లలనా
ఆ: దరి చేరిన నెచ్చెలిపైనా దయచూపవ కాస్తయినా
అ: మన దారులు ఎప్పటికైనా కలిసేనా ఓ... ॥కోపమా॥
ఆ: కస్సుమని కారంగా కసిరినది చాలింకా
ఉరుము వెనుక చినుకు తడిగా కరగవా కనికారంగా
అ: కుదురుగా కడదాకా కలిసి అడుగెయ్యవుగా
కనుల వెనకే కరిగిపోయే కలది గనుకా
ఆ: నను గొడుగై కాసే నువ్వు పిడుగులు కురిపిస్తావా...
అ: నువు గొడుగునే ఎగరేస్తావే జడివానా హో... ॥కోపమా॥
ఆ: హో.... తిరిగి నిను నాదాకా చేర్చినది చెలిమేగా
మనసులోని చెలియ బొమ్మ చెరిపినా చెరగదు గనకా
అ: సులువుగా నీ లాగా మరిచి పోలేదింకా
మనసు విలువ నాకు బాగా తెలుసు గనుకా
ఆ: ఎగసే అల ఏనాడైనా తన కడలిని విడిచేనా
అ: వదిలేస్తే తిరిగొచ్చేదా క్షణమైనా హో... ॥కోపమా॥

రచన: సిరివెన్నెల సీతారామ శాస్త్రి (6) గానం : సాగర్,సుమంగళి

అ: నీటి ముళ్ళై నన్ను గిల్లి
వెళ్ళిపోకే మల్లెవానా
జంటనల్లే బంధమల్లే
ఉండిపోవే వెండివానా
తేనెల చినుకులు చవి చూపించి
కన్నుల దాహం ఇంకా పెంచి
కమ్మని కలలేమో అనిపించి
కను మరుగై కరిగావా సిరివానా
నువ్వొస్తానంటే నేనొద్దంటానా
ఆ: నువ్వొస్తానంటే నేనొద్దంటానా
అ: నువ్వొస్తానంటే నేనొద్దంటానా
ఆ: నువ్వొస్తానంటే నేనొద్దంటానా

రచన: సిరివెన్నెల సీతారామ శాస్త్రి (7) గానం : అద్నాన్ సమీ,సునీతారావ్

అ: నచ్చావే నైజాం పోరి నువ్వేనా రాజకుమారి
ఆ: హే..ఆ జారే రాజా జాని లేజారే లేత జవానే ॥నచ్చావే నైజాం॥
అ: అందిస్తే చెయ్యి ఓ సారి ఎక్కిస్తా ఏనుగంబారి
ఆ: శాసిస్తే చాలు ఓ సారి సిద్ధంగా ఉంది సింగారి
అ: అయ్యారే సయ్యంటుందే తయ్యారై వయ్యారి ॥నచ్చావే నైజాం॥
అ: హే....సరదాగా సరసకు చేరి సాగిస్తా సొగసుల చోరి
ఆ: చాల్లెద్దూ మాట కచేరి దోచేద్దూ తళుకు తిజోరి
అ: ముదిరావే మాయలమారి
ఆ: మురిపిస్తే ఎలా మురారి
అ: పరిచానే మల్లె పూదారి పరిగెత్తుకు రావె పొన్నారి
ఆ: పిలిచాడే ప్రేమ పూజారి వెళ్ళిపోదా మనసే చేజారి
అ: గుండెల్లో కోవెల కట్టా కొలువుండవే దేవేరి ॥నచ్చావే నైజాం॥
ఆ: హే..... వరదల్లే హద్దులు మీరి వచ్చావా పొగడల పోరి
అ: హే సుడిగాలే నిలువున నిమిరి ఎగరేసుకుపోతా నారి
ఆ: దాటొస్తా సిగ్గుల ప్రహరి
అ: హే.... చేరుస్తా చుక్కల నగరి
ఆ: ముద్దుల్లో ముంచి ఓ సారి
మబ్బుల్లో తేల్చి ఓ సారి
అ: మైకంలో దూరి ఓ సారి
కావ్యంలో వాలి ఓ సారి
ఆ: వాహ్ వారే అనిపించాలి
వాటేసే ప్రతిసారి ॥నచ్చావే నైజాం॥



పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.





యం.యస్.రాజు


శోభన్

## తారాగణం

ప్రభాస్, త్రిష, గోపీచంద్, ప్రకాష్‌రాజ్, సునీల్, పరుచూరి వెంకటేశ్వరరావు, చంద్రమోహన్, షఫీ, జయప్రకాష్‌రెడ్డి, రఘుబాబు, సంగీత, పావలాశ్యామల, మాస్టర్ అక్షయ్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : వీరు పోట్ల |
| రచన | : పరుచూరి బ్రదర్స్ |
| సంగీతం | : దేవిశ్రీప్రసాద్ |
| పాటలు | : సిరివెన్నెల సీతారామశాస్త్రి |
| కొరియోగ్రఫీ | : ప్రభుదేవా, లారెన్స్, సుచిత్రా చంద్రబోస్, నిక్కీ |
| ఎడిటింగ్ | : కె.వి.కృష్ణారెడ్డి |
| ఆర్ట్ | : అశోక్ |
| ఫోటోగ్రఫీ | : ఎస్.గోపాల్‌రెడ్డి |
| ఫైట్స్ | : పీటర్ హెయిన్ |
| ప్రెస్ రిలేషన్స్ | : బి.ఏ.రాజు |
| పబ్లిసిటీ | : కిరణ్ పోస్టర్ యాడ్స్ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : కె.భాస్కర్‌రాజు, |
| నిర్మాత | : యం.యస్.రాజు |
| దర్శకత్వం | : శోభన్ |


దేవిశ్రీప్రసాద్


సిరివెన్నెల

# వెన్నెల వర్షం కాదు... ఇది సిరివెన్నెల వర్షం







"సార్... నాకు పాటలు రాయడమంటే చాలా ఇష్టం. ఎలారాయాలో నేర్పుతారా?" అంటూ రికార్డింగ్ థియేటర్ల దగ్గర అడిగే కుర్రాళ్ళకి ఎప్పుడూ ఒకటే సమాధానం చెప్పి పంపిస్తుంటాను. "సీతారామ శాస్త్రి గారి పాటలు వినండి... మళ్ళీ మళ్ళీ వినండి... అలా వింటూంటే - సినిమా పాట - ఆయన చేతిలో ఎన్ని నగిషీలు దిద్దుకుంటుందో అర్ధమవుతుంది. సినిమా పాటని ఎలా రాయొచ్చో ఒక ఐడియా వస్తుంది" అని.

ఈ భరోసా నేను ఎలా ఇవ్వగలుగుతున్నానంటే అది స్వీయానుభవం కాబట్టి. సీతారామ శాస్త్రి గారి పాటలు వినే నేను పాటల రచయితనయ్యాను కాబట్టి.

మాటకి, పాటకి మధ్యవుండే ఓ చిన్న రేఖ ఆయన పాటల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఆయన పాటలు వింటుంటే...మాటకి పాట ఇంత దగ్గరా? అనిపిస్తుంది. ఎలాంటి సిట్యుయేషన్‌నైనా అలవోకగా పాట రూపంలోకి తర్జుమా చేయడం... అదీ అందరికీ అర్థమయ్యే శైలిలో వుండడం... సీతారామశాస్త్రిగారి స్పెషాలిటీ...

* * *

సీతారామశాస్త్రిగారు ఏ సినిమాకి పాటలు రాసినా ఆ కేసెట్స్ కొని బాగా వినడం... ఆయన ఆయా పాటల్లో చేసిన కాయినింగ్స్‌కి ఇన్‌స్పయిరై పోవడం నాకు చాలాకాలంగా వున్న అలవాటు. అలా తాజాగా 'వర్షం' పాటలు వి(ంటు)న్నాను.

'వర్షం' ఈ సినిమాకి బహుశా కేంద్ర బిందువేమో... గురువుగారు ఇందులోని 7 పాటల్లోనూ వర్షాన్ని ఉటంకిస్తూనే వచ్చారు. నిజంగా ఇది ఆయనకే సాధ్యమేమో! ఈ పాటలు వింటుంటే వర్షంలో తడిసి ముద్దయిపోయిన ఫీలింగ్ కలగక మానదు.

కేసెట్‌లో మొదటి పాట 'నువ్వొస్తానంటే...' జడివాన రావడానికి సూచనగా ముందు కురిసే చిటపట జల్లులను సంతోషంగా ఆహ్వానిస్తూ... మొదలవుతుంది.

'సినుకురవ్వలో...సినుకురవ్వలో.... పంచవన్నె చిలకలల్లె వజ్జరాల తునకలల్లె వయసు మీద వాలుతున్న వాన గువ్వలో...' అనే సాకీలో 'వానగువ్వలు' అనడం గొప్ప ప్రయోగం.

వర్షంలో తడిసిపోతూ... ముక్కుపుడకై, చెవులకు జుంకాలాగ, చేతికి రవ్వల గాజుల్లాగ, కాలికి మువ్వల పట్టీ లాగ, మెళ్ళో పచ్చల పతకం లాగా వర్షాన్ని ఊహించుకోవడాన్ని మన కళ్ళముందు ఓ అద్భుత స్వప్నంలాగా ఆవిష్కరించారు. (బలిని మూడడుగులు దానమడిగిన వామనుడు అంతకంతకూ ఎదిగిపోతూ భూనభోమండలాలను ఆక్రమించుకున్న విధానాన్ని 'రవిబింబం బుపమింపఁ' అనే పద్యంలో... సూర్యుడు అతనికి గొడుగై, శిరోరత్నమై, చెవిపోగై, కంఠమాలయై, చేతికి కంకణమై, కాలి కడియమై, పాదపీఠమైనట్టుగా ఉంది అని అలనాడు పోతన వర్ణించినట్టుగా లేదూ!?) ఈ పాటలోనే చినుకే ఓ ఆభరణం అని అమ్మాయి తేల్చి చెప్పడం అనే థాట్ నిజంగా గ్రేట్. (గానం: చిత్ర,రఖీబ్ ఆలమ్)

ఇక, 'మెల్లగా కరగనీ రెండు మనసుల దూరం' అనే పాటలో... వర్షం సాక్షిగా ప్రేయసి, ప్రియుడు తమ ప్రేమని ఎక్స్‌ప్రెస్ చేసుకోవడం జరిగింది.

"వలపు వాన దారాలే పంపుతున్నది ఆకాశం
చినుకు పూల హారాలే అల్లుతున్నది మనకోసం

తడిపీ తడిపీ తనతో గడిపీ హరివిల్లును వంతెన వేసిన శుభవేళా...వాహ్... ఎంత బాగుందీ భావం!

ఈ పాటలోనే

'చలి పిడుగుల సడి విని జడిసిన బిడియము తడబడి నిను వీడగా' అనే వాక్యం, 'మన కలయిక చెదరని చెలిమికి ఋజువని చరితలు చదివేలా' అనే వాక్యం హార్ట్ టచింగ్‌గా అనిపించక మానవు. (గానం: చరణ్, సుమంగళి)

ఇక మూడో పాట... ఈ పాట నాకు బాగా నచ్చింది. నాకే కాదు ఎవరికైనా వినగానే ఎక్కే పాటే ఇది.



'లంగా ఓణీ నేటితో రద్దయిపోనీ
సింగారాన్నీ చీరతో సిద్ధంకానీ....'

బహుశా హీరోయిన్‌కి, హీరోతో పెళ్ళి సెటిల్ అయిన సందర్భంలోని పాట అయివుంటుందిది. ఈ సందర్భాన్ని కనిపెట్టి లంగా ఓణీ నేటితో రద్దయిపోతుంది కనుక ఇక నువ్వు చీరకట్టుకునే అర్హత సంపాదించినట్టే అని చిలిపిగా చెప్పడం వెనక శాస్త్రిగారి యువహృదయం ఇట్టే కనిపిస్తుంది. ఇలాంటి థాట్స్ మాకెవరికీ రావడం లేదనే బాధ యువ రచయితలకు తప్పకుండా కలగాల్సిందే.

'చూడు మరీ దారుణం ఈడునెలా ఆపడం
వెంటపడీ శత్రువయే సొంత వయారం'

అన్న ఎక్స్‌ప్రెషన్‌కి శాస్త్రిగారికి పాదాభివందనం చెయ్యాలనిపిస్తుంది. నా సొంత వయారమే శత్రువులా నన్ను వెంబడిస్తుంటే ఇంకెవరికి చెప్పుకోవాలి అన్న గడుసు ప్రశ్నకి, గడుగ్గాయి చేత ఎలా సమాధానం చెప్పించారో చూడండి...

'ఒంటరిగా సోయగం... ఎందుకలా మోయడం కళ్ళెదురే వుందికదా ఇంత సహాయం!'

ఇది చాలా రొమాంటిక్ ఫీల్‌తో గుండెల్లో తిష్టవేసుక్కూచునే పాట.

'లేతనడుం తాళదు నా గాలి దుమారం' 'లక్షణం - తక్షణం' 'ఇచ్చేవిచ్చీ - గిచ్చీ గిచ్చీ' లాంటి చమత్కారాలెన్నింటినో ఈ పాటలో ధారాళంగా ఉపయోగించారు. (గానం : టిప్పు - ఉష)

బి - సైడ్‌లో మొదటి పాట 'ఝూలే ఝూలే...' ఇది కూడా అద్భుతమే! 'ఎక్కిళ్ళు పెంచే సోకులే' అన్న కాయినింగ్ నాకు బాగా నచ్చింది. మామూలుగా ఈ తరహా మాస్ సాంగ్స్ రాయాల్సి వస్తే, 'వెర్రెక్కించే, మత్తెక్కించే' అని రాయడం సర్వసాధారణం. అలా కాకుండా 'ఎక్కిళ్ళు పెంచే' అనడంలో విజువల్ ఎఫెక్ట్ కనిపిస్తోంది. అందమైన అమ్మాయి అందాన్ని చూస్తూ ఎక్కిళ్ళు పెరిగిపోయే అబ్బాయి అవస్థ ఠకీమని గుర్తొస్తుంది. ఇందులోనే 'చిరు చినుకంత చింత నిన్ను చేరకుండా కన్నుల్లో దాచుకుంటా' అన్న ఎక్స్‌ప్రెషన్ కూడా ఎక్సలెంట్.



(గానం : మల్లికార్జున్, కల్పన)

'కోపమా నాపైనా....' నాకు చాలా చాలా బాగా నచ్చింది ఇందులోని సాహిత్యం. అమ్మాయి మీద ఎందుకనో అబ్బాయికి కోపం వచ్చింది. ఆ కోపాన్ని పోగొట్టడానికి ఆమె శతవిధాలా ప్రయత్నించడం, అతను ఆమె మీద నిష్ఠూరాలు వెయ్యడం ఇదీ ఈ పాట సారాంశం. నామీద నీకంత కోపం ఎందుకు? అంటూ ఆమె 'నను గొడుగై కాసే నువ్వు పిడుగులు కురిపిస్తావా?' ఇదేం న్యాయం అని అడిగితే -

'నువు గొడుగును ఎగరేస్తావే... జడివానా' అని కౌంటర్ ఇవ్వడం... ఒక్క శాస్త్రిగారికే చెల్లింది. 'ఎగసే అల ఎపుడైనా తన కడలిని విడిచేనా?' లాంటి ఎక్స్‌ప్రెషన్ ఈ పాటలో నిండుగా పరుచుకున్నాయి.

(గానం: కార్తీక్, శ్రేయాఘోషాల్)

ఇక 'నీటి ముల్లై...' అనేది మూడోపాట. ఇదో బిట్ సాంగ్, చిన్న విషాదాన్ని మూటగట్టుకుంటుంది పాట.

'తేనెల చినుకులు చవి చూపించి కన్నుల దాహం ఇంకా పెంచి కమ్మని కలవేమో అనిపించి కనుమరుగై కరిగావా సిరివానా...' లాంటి ఏక వాక్య ప్రయోగం ఈ పాటకి హైలైట్ (గానం : సాగర్ సుమంగళి).

కేసెట్‌లో ఆఖరి పాట 'నైజాం పోరీ' ఇదొక మాస్ సాంగ్. కానీ శాస్త్రి గారి మార్క్ ఎక్కడా మిస్ కాలేదు. 'ఎక్కిస్తా ఏనుగు అంబారీ/ ముదిరావే మాయలమారి/పిలిచాడే ప్రేమ పూజారి/ వెళిపోదా మనసే చేజారి/ దాటొస్తా సిగ్గుల ప్రహరి/ చేరుస్తా చుక్కల నగరి... అబ్బో ఇలాంటి పదాలతో ఆడుకున్నారు శాస్త్రిగారు. (గానం : అద్నాన్ సామి, సునీతారావ్)

* * *

సినిమా పాటలు రాయాలన్న ఆసక్తి వున్నవారెవరైనా ఒక్కసారి 'వర్షం' పాటలు వినాలి. మంచి సాహిత్యం వినాలనుకున్నవారెవరైనా 'వర్షం' పాటలు వింటే రిలీఫ్ ఫీలవుతారు. ఇది వెన్నెల వర్షం కాదు.... సిరివెన్నెల 'వర్షం'. మా గురువుగారు ఇలాంటి పాటలు మరెన్నో రాసే ఆయురారోగ్యాలు భగవంతుడు ఆయన కివ్వాలని, ఆయన పాటలు వింటూ మాలాంటి యువతరం తరించిపోవాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ...

ఈ 'వర్షం' చిత్ర నిర్మాత ఎం.ఎస్.రాజు గార్కి, దర్శకుడు శోభన్‌కి, చక్కటి సంగీతాన్ని అందించిన దేవిశ్రీ ప్రసాద్‌కి అభినందనలు తెలియజేస్తూ...

**- భాస్కరభట్ల రవికుమార్**

జనవరి 17 జావెద్ అఖ్తర్ పుట్టిన రోజు సందర్భంగా.......

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం





మెహర్బా మెహర్బా మెహర్బా
అయ్ మెహర్బా మెహర్బా, మెహర్బా
క్యూం హో నారాజీ తుమ్,
క్యూం హో తుమ్ బద్‌గుమా ॥మెహర్బా॥
అబ్ జో హమ్ హైం మిలే, ఛోడో శిక్వే గిలే
జో మేరీ భూల్ థీ మైనే వో మాన్‌లీ
ప్యార్ దిల్ మేం రహా, పర్ న మైనే కహా (2)
మైనే హోంఠోం పే రఖ్‌లీ థీ ఖామోషియా ॥మెహర్బా॥

మైనే సమ్‌ఝా థా తుమ్ జాన్ లోగే ముఝే
మైనే సమ్‌ఝా థా పెహచాన్‌లోగే ముఝే
మేరే గుస్సే మేం భీ రంగ్ థా ప్యార్ కా
లఫ్జ్ ఇన్‌కార్ కా, లెహజా ఇక్‌రార్ కా
యే జో అందాజ్ థే, తుమ్ సే కబ్ రాజ్ థే
అన్‌కహీ అన్‌సునీ ఫిర్ భీ క్యూం దాస్తా ॥మెహర్బా॥

ఆవో తుమ్‌సే కహూం దిల్ కీ హర్ బాత్ మైం
తుమ్‌సే కర్‌దూం బయాం అప్‌నే జజ్‌బాత్ మైం
తుమ్ అగర్ పాస్ హో తో నహీం కోయీ గమ్
మై రహూం నా రహూం తుమ్ తో హో కమ్ సే కమ్
వక్త్ కీ రాహ పర్ మేరా అగ్‌లా కదమ్
ముఝ్‌కో పావోగే తుమ్, జావోగే తుమ్ జహాం ॥మెహర్బా॥



చిత్రం
తెహజీబ్
రచన
జావెద్ అఖ్తర్
సంగీతం
ఎ.ఆర్.రెహమాన్
గానం
ఆశాభోంస్లే,
సుఖ్‌విందర్ సింగ్
అభినయం
ఊర్మిళ, బృందం

ఫిలింఫేర్ పత్రిక తమ డిసెంబర్ 2003 సంచిక కోసం హిందీ చిత్ర రంగంలోని వివిధ విభాగాల్లో టాప్ 10 వ్యక్తులను నిర్ణయించటానికి ఒక రీసెర్చ్ కంపెనీ చేత సర్వే నిర్వహించింది. ఆ సర్వే కోసం రచయితలు, ఛాయాగ్రాహకులు, నృత్య దర్శకులు, కళాదర్శకులు, స్టంట్ దర్శకులను ఒక విభాగంగా నిర్ణయించారు. ఆ విభాగంలో నెంబర్ వన్‌గా మన్ననలందుకున్నదెవరో తెలుసా? - జావెద్ అఖ్తర్. 2003 లో 'చల్తే చల్తే', 'కల్ హో న హో' వంటి విజయవంతమైన చిత్రాలతో పాటు అనేక చిత్రాలలో హిట్ పాటలు రాసి గీత రచయితగా తన స్థానాన్ని పటిష్టం చేసుకోవటమే గాక తన మొదటి భార్య హనీ ఇరానీ (ఈమె 'లమ్హే', 'డర్' మొదలయిన చిత్రాలకు రచయితగా పనిచేశారు) తొలిసారి దర్శకత్వం వహించిన 'అర్‌మాన్' (అమితాబ్, అనిల్‌కపూర్, ప్రీతీ జింటా, గ్రేసీ సింగ్) చిత్రానికి రచనా సహకారం అందించారు. వారి కుమారుడు ఫర్హాన్ అఖ్తర్ దర్శకత్వం వహిస్తున్న 'లక్ష్య' చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు ఫర్హాన్‌తో కలిసి సమకూర్చారు జావెద్ సాబ్. ముఖ్యంగా గీత రచయితగా కమర్షియల్ చిత్రాలకు, కళాత్మక చిత్రాలకు ఉన్న వ్యత్యాసాన్ని చెరిపేసి ఉన్నత ప్రమాణాలతో పాటలు రాస్తూ నంబర్ వన్ అనిపించుకున్నారు.

తన కెరియర్ మొదట్లో జావెద్ సాబ్ కమాల్ అమ్రోహి వద్ద నెల జీతానికి పనిచేసేవారు. అప్పట్లో ఆయన కొన్ని రాత్రులు



కమాల్ అమ్రోహీ స్టూడియోస్‌లోనే పడుకునేవారట. ఆ సమయంలో మీనా కుమారికి చెందిన ఫిలింఫేర్ అవార్డులు ఆ స్టూడియోలో ఉండేవట. ఆ అవార్డులను చేతబట్టుకుని, తానే ఆ అవార్డు అందుకున్నట్టు భావించి ఆనందించేవారట జావెద్ సాబ్. ఎప్పటికైనా తాను అవార్డులు అందుకోవాలని కలగనేవారట. తన మూడు దశాబ్దాల సినీ జీవితంలో ఎన్నో ఫిలింఫేర్ అవార్డులతో పాటు జాతీయ అవార్డులు కూడా సాధించి తన కలలను సాకారం చేసుకున్నారు.

ఫిలింఫేర్ టాప్ 10 లిస్ట్‌లో సంగీత దర్శకులు, గాయకుల విభాగంలో మొదటిస్థానం పొందినది ఎ.ఆర్. రెహమాన్. దర్శకులు, నిర్మాతలు రెహమాన్‌ను ఎంచుకుంటారనేది పాత మాట. రెహమానే ఏ చిత్రాలకు పనిచేయాలో నిర్ణయించుకుంటారనేది సరైన మాట. కేవలం పెద్ద చిత్రాలకే పనిచేయాలని ఆయన అనుకోరు. ఆయన సంగీతం అందించిన చిత్రమంటే మంచి చిత్రం అయి ఉంటుందనే స్థాయికి ఆయన ఎదిగారు. లండన్‌లో 'బాంబే డ్రీమ్స్' సంగీత రూపకం విజయవంతమయాక ఆయన 'ది లార్డ్ ఆఫ్ ది రింగ్స్' మ్యూజికల్‌కి పని చేయనున్నారు.అమీర్ ఖాన్ నటిస్తున్న ఆంగ్లచిత్రం 'ద రైజింగ్'కు, సంజయ్ లీలా భన్సాలీ తదుపరి చిత్రం 'బాజీరావ్ మస్తానీ' (సల్మాన్ ఖాన్, కరీనా కపూర్, రాణీ ముఖర్జీ) కి, సుభాష్ ఘాయ్ తదుపరి చిత్రం 'కిస్నా' (వివేక్ ఒబెరాయ్) కి ఆయన సంగీతం అందించనున్నారు. జావెద్ అఖ్తర్ కాంబినేషన్‌లో ఆయన 'సప్నే', 'జుబేదా', 'లగాన్' వంటి విభిన్న చిత్రాలకు అందమైన పాటలు చేశారు. 'తెహజీబ్' చిత్రంలో వీరిద్దరూ రెండు పాటలకు కలిసి పనిచేశారు.

సినీ విమర్శకుడు ఖాలిద్ మొహమ్మద్ దర్శకత్వం వహించిన రెండో చిత్రం 'తెహజీబ్'. ఇందులో ఒక ప్రఖ్యాత గాయనిగా షబానా ఆజ్మీ, ఆమె కూతుళ్ళుగా ఊర్మిళ, దియామిర్జా నటించారు. సంగీతమంటే మక్కువగల రుఖ్సానా జమాల్ (షబానా ఆజ్మీ) తన భర్త వ్యాపారంలో విఫలమవటంతో కుటుంబ పోషణ కోసం గాయనిగా మారుతుంది. భార్య మీద ఆధారపడుతున్నాననే భావంతో అతను తాగుడుకు బానిస అవుతాడు. రుఖ్సానాకు ఒక ప్రొడ్యూసర్‌తో సంబంధం ఉందని అతనికి అనుమానం కలుగుతుంది. ఒకరాత్రి తుపాకీ శబ్దం వినబడి వారి అమ్మాయి తెహజీబ్ వారున్న చోటికి వచ్చి చూడగా తుపాకీ పట్టుకుని అరుస్తున్న తల్లి, కుప్పకూలుతున్న తండ్రి కనిపిస్తారు. తల్లి విసిరేసిన తుపాకిని తెహజీబ్ దాచేస్తుంది. ఆమె తండ్రి మరణిస్తాడు. సాక్ష్యం లేని కారణంగా రుఖ్సానాను కోర్టు విడుదల చేస్తుంది. ఆ తుపాకీ ఏమయిందో ఎవరికీ తెలియదు, రుఖ్సానాకు కూడా. రుఖ్సానా గాయనిగా తన పూర్వ వైభవాన్ని తిరిగి పొందుతుంది. పెరిగి పెద్దయిన తెహజీబ్ (ఊర్మిళ), సలీమ్ (అర్జున్ రాంపాల్)ను ప్రేమించి తల్లికి ఇష్టం లేకపోయినా పెళ్ళి చేసుకుంటుంది. తల్లికి దూరంగా వేరే ప్రదేశంలో కాపురం వుంటుంది. మానసిక వైకల్యం వలన ఆసుపత్రిలో చేర్పించబడిన తన చెల్లెలు నాజ్‌నీన్ (దియా మిర్జా)ను తన ఇంటికి తీసుకెళ్ళి దగ్గరుండి చూసుకుంటుంది. ఈ పరిస్థితులలో రుఖ్సానా ఒకసారి తెహజీబ్‌ను చూడటానికి వారింటికి వస్తుంది. తన తండ్రి జీవితం నాశనమవటానికి, తన చెల్లెలు మానసిక వైకల్యానికి, తన బాల్యం విషాదకరం కావటానికి తన తల్లే కారణమని భావించే తెహజీబ్ తన తల్లిని ఎలా ఎదుర్కొంటుందనేది మిగతా కథ. 'మాసూమ్'లో తల్లీ కూతుళ్ళుగా నటించిన షబానా ఆజ్మీ, ఊర్మిళ 20 ఏళ్ళ తర్వాత మళ్ళీ కలసి నటించారు.

వయసు మళ్ళినా రుఖ్సానా గాయనిగా వెలుగొందుతోందని ఎస్టాబ్లిష్ చేయటానికి ఉద్దేశించిన పాట 'మెహెర్బాఁ మెహెర్బాఁ'. ఈ పాట రుఖ్సానా టి.వి.లో పాడుతుండగా తెహజీబ్ తన భర్త, చెల్లెలితో కలిసి చూస్తుంటుంది. ఇంతలో పాట ఓ ఊహాగీతంలా మారిపోయి సాగరతీరంలో ఊర్మిళ నృత్యం చేస్తూ కనిపిస్తుంది. ఖాలిద్ మొహమ్మద్ తన మొదటి చిత్రం 'ఫిజా'లో పాత్ర స్వభావానికి వ్యతిరేకంగా కరిష్మా కపూర్ చేత క్లబ్‌లో డాన్స్ చేయించి విమర్శలెదుర్కొన్నా మళ్ళీ ఈ చిత్రంలో ఇలా ఒక పాత్ర పాడే పాటను మరో పాత్రపై చిత్రీకరించారంటే కమర్షియల్‌గా ఎన్నో ఒత్తిడులకు లొంగిపోయారని అనుకోవాలి.

'వివా' పాప్ గ్రూప్‌కు చక్కని పాటలు రాసి మెప్పించిన జావెద్‌సాబ్ ఇండీపాప్ గీతంగా ఉద్దేశించిన ఈ గీతాన్ని కూడా చక్కని భావాలతో రాశారు. సందర్భం ఎలాంటిదైనా సమాన ప్రమాణాలను పాటించడం వల్లనే ఆయన ఇంత విజయం సాధించారు. ఈ పాటలో ఒక అమ్మాయి అలిగిన తన ప్రియుడిని ఒప్పించటం, మందలించటం ఎంతో అందంగా చెప్పారు. యువతరాన్ని ఆకట్టుకునే హుషారైన ట్యూన్ అందించారు రెహమాన్. 70 ఏళ్ళు నిండినా తన గొంతులో చలాకీతనం ఏ మాత్రం తగ్గలేదని మరోసారి నిరూపించుకున్నారు ఈ పాట గాయని ఆశాభోంస్లే.

మెహెర్బాఁ అంటే



దయ చూపేవారు, కరుణ చూపేవారు. నారాజ్ అంటే అలగటం. బద్‌గుమాఁ అంటే అనుమాన పడటం.

'కరుణ చూపే ఓ ప్రియా, కరుణ చూపే ఓ ప్రియా
ఎందుకీ కోపము, ఏల అనుమానము'

అలిగిన ప్రియుణ్ని ఒప్పించడానికి 'మెహర్బాఁ' అంటూ సంబోధించటం ముందరి కాళ్ళకు బంధం వేసినట్టు గడుసుగా అనిపిస్తుంది. ఈ గడుసమ్మాయి ప్రియుణ్ని ఇంకా ఎలా ఒప్పిస్తుందో చూడండి.

శిక్వే గిలే అంటే అలుకలు, ఫిర్యాదులు. భూల్ అంటే తప్పు. మాన్‌లీ అంటే ఒప్పుకున్నాను అని. హోంఠ్ అంటే పెదవులు. ఖామోషీ అంటే నిశ్శబ్దం, మౌనం.

'ఇపుడు కలిశాముగా, అలుక వదిలెయ్ ఇక
నా తప్పున్నది, ఒప్పుకున్నానుగా
ప్రేమ మదిలో ఉన్నా నీతో అనలేదు నే
పెదవులపై ఉంచుకున్నాను మౌనమే'

'ఇన్నాళ్ళూ దూరంగా ఉన్న మనం మళ్ళీ కలిశాం, ఇక అలుక వదిలెయ్. నా తప్పు ఒప్పుకుంటున్నాను. మదిలో ప్రేమ ఉన్నా నీతో చెప్పక పోవటం తప్పే' అంటూ ప్రాధేయపడుతోంది ఆమె.

జాన్‌లేనా అంటే తెలుసుకోవటం. పెహచాన్ లేనా అంటే అర్థం చేసుకోవటం. గుస్సా అంటే కోపం. లఫ్జ్ అంటే మాట. లెహజా అంటే తరుణం. ఇన్‌కార్ అంటే కాదనటం. ఇక్‌రార్ అంటే అంగీకారం, అనుకూలంగా స్పందించటం. అందాజ్ అంటే శైలి. రాజ్ అంటే రహస్యం. 'అన్‌కహీ అన్‌సునీ' అంటే చెప్పనిది, విననిది. దాస్తాఁ అంటే కథ.

'నేననుకున్నాను నను తెలుసుకుంటావని
అనుకున్నాను అర్థం చేసుకుంటావని
నా కోపంలోనూ ప్రేమవే రంగులు
మాట కాదని అన్నా తరుణం అనుకూలమే
నీకు తెలియనివి కావే ఈ సంగతులు
అయినా ప్రేమ కథ తెలియలేదెందుకు'.

ప్రాధేయపడటం మానేసి డిఫెన్సివ్‌గా 'నన్ను అర్థం చేసుకుంటావనుకున్నాను. నా కోపంలో కూడా నీ మీద ప్రేమే ఉంటుంది. నేను కాదంటే ఔననే అర్థం. నా సంగతి నీకు తెలియనిది కాదు గదా. అయినా నా ప్రేమకథ నీకు తెలియదా?' అని మందలిస్తోంది. నీ తప్పు కూడా ఉందని అంటోంది.

బయాన్ అంటే వివరించటం. జజ్‌బాత్ అంటే భావాలు. పాస్ అంటే దగ్గర. గమ్ అంటే బాధ. 'కమ్ సే కమ్' అంటే కనీసం. వక్త్ అంటే కాలం. రాహ్ అంటే దారి. అగ్‌లా అంటే తర్వాతది. కదమ్ అంటే అడుగు.

'మదిలోని ప్రతి మాటనూ నీకు చెబుతాను, రా
నా ప్రతి భావమూ వివరిస్తాను, రా
నువ్వు దగ్గరుంటే ఉండదు ఏ చింతా
నేనున్నా లేకున్నా నువ్వుంటే చాలంటా
కాలగమనంలో నా మలి అడుగు
నువ్వెటు వెళ్ళినా నన్నే చేరేవు'

ఒప్పించటం, మందలించటం పక్కన పెట్టి తన ప్రేమ గాఢతను వివరిస్తోంది. 'నేనున్నా లేకున్నా కనీసం నువ్వుంటే చాలు' అనటంలో చెప్పలేని భావాలు ఎన్నో చెప్పారనిపిస్తుంది. నేను వేసే మలి అడుగు ఎలా ఉంటుందంటే నువ్వెటు వెళ్ళినా నేను అక్కడ ఉంటాను' అని తన ప్రేమను చాటింది. ఇక్కడ 'జాయియే ఆప్ కహాఁ జాయేంగే' (మేరే కసమ్) పాట గుర్తొస్తుంది.

'ఆప్‌కో ముఝ్‌సే గిలా హోతాన శిక్వా హోతా' పాట కూడా జావెద్ అఖ్తర్ రాశారు. మిగతా పాటలన్నీ ట్రెడిషనల్ సాంగ్స్. వీటన్నిటికీ రెహమాన్ తన శైలిలో చక్కని సంగీతం అందించారు. ఇంతకీ 'తెహజీబ్' అంటే ఏమిటి అనే సందేహం చాలా మందికి వస్తుంది. తెహజీబ్ అంటే సంస్కారం అని అర్థం. ఆ పేరు పెట్టుకున్న నాయిక తన పేరుకు న్యాయం చేసిందా అనేది తెలుసుకోవాలంటే సినిమా చూడాల్సిందే.

- పి.వి.సత్యనారాయణ రాజు



## కొమ్మ కొమ్మకో సన్నాయి...

# కథానాయకుడి కథ కరిగిపోని కల



తన అభినయంతో తెలుగు పాట విలువను పెంచిన **ఎన్.టి.ఆర్.** వర్ధంతి (జనవరి 18) ని పురస్కరించుకుని......

ఆంధ్ర పురాణంలో రామరావణులుగా కృష్ణార్జున, భీష్మ సుయోధనులుగా, రాయలుగా, రాకుమారుడుగా, శ్రీనాధుడుగా, వీరబ్రహ్మేంద్రుడుగా వెలుగు, వేడి రగిలించిన హీరోచిత శృంగారోదాత్త పాత్రలనేకం ధరించిన కళాప్రపూర్ణుడు శ్రీ నందమూరి తారక రామారావు. ఆయన వర్ధంతి సందర్భంగా పెల్లుబికి వస్తున్న మధురస్మృతులే ఈ రచన.

1951వ సంవత్సరం. మల్లీశ్వరి, పెళ్లి చేసి చూడు చిత్రాలు తెలుగు కళ్లకు చల్లగా, తెలుగు సినిమా కళామతల్లి కడుపు చల్లగా విడుదలై, ఆంధ్ర, ఆంధ్రేతర ప్రేక్షక రసికులను ఉర్రూతలూగించిన వేళ. ఒకనాటి సాయంత్రం. మద్రాసు ఆంధ్ర విద్యార్థి విజ్ఞాన సమితి పచ్చయప్ప కళాశాలలో శ్రీ బి.యన్.రెడ్డి గారికి సన్మానం చేసింది. అన్ని కాలేజీల నుంచి తెలుగు విద్యార్థులు, తమిళులు కూడా తరలి వచ్చారు. ఆ సభకు నడచి వచ్చిన నాజూకు నలకూబరుడు నందమూరి తారక రాముడు. అతని ఉంగరాల జుట్టు, జరీపంచెకట్టు, స్లిమ్‌గా చిరునవ్వులా అతను కదలి వచ్చిన కనికట్టు - ఇప్పుడు మళ్లీచూస్తున్నంత అనుభూతిని గుండెకు హత్తి పోతుంది.

ఆ సభలో నటి నాయకి జి.వరలక్ష్మి చేసిన ప్రసంగం మరపురాదు. అప్పుడే మెహబూబ్‌ఖాన్ చిత్రం 'ఆన్' మద్రాసులో విడుదలై సంచలనం సృష్టించింది. ఆయనకు ఘనంగా హోటల్ కన్నెమెరాలో సన్మానం జరిగింది. ఆ సభలో ప్రవేశిస్తూనే మెహబూబ్ ఖాన్ 'వేర్ ఈజ్ మిస్టర్ బి.యన్' అని అడుగుతూ సరాసరి వచ్చి బి.యన్.రెడ్డి గారిని కౌగలించుకున్నాడట. ఇంతమంది వివిధ భాషా చిత్రాల అతిరథ మహారథులుండగా ఒక తెలుగు దర్శకుణ్ణి ఇంతగా ఆరాధించిన మెహబూబ్ చర్యకు 'నివ్వెరపోయి నేను ప్రకాశరావు మొహం చూశాను. ప్రకాశరావు నా మొహం చూశాడు.' అని వరలక్ష్మి అన్నప్పుడు సభంతా నవ్వులు పండిపోయాయి. చిరునవ్వులాంటి నలకూబరుడూ నవ్వాడు.



ఆనాటి నుంచీ నందమూరి చందమామ వెన్నెల నవ్వు వృద్ధి క్షయాలు లేకుండా నవ్వడం మొదలు పెట్టింది. తెలుగు తెరమీద స్వతస్సిద్ధమైన, సకల రూపక శక్తిగల, వ్యక్తిగల కళాకారుడు శ్రీ ఎన్.టి.రామారావు తరువాత గానీ, ముందుగానీ లేరు. ఆయన నిజంగా రూపసుందరుడు.

కాలేజీ విద్యార్థిగా ఆయన తెలుగు మీద ప్రాణాలు నిలిపి తన గురువు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారిని సేవించాడు. ఆయన మాటలు, పద్యాలు, ప్రవర్తనా ధోరణులు, వ్యక్తిత్వంలో వున్న విలక్షణ లక్షణాలు ఆరాధించాడు. తొలిసారి ముఖానికి రంగుపూసుకున్నది ఆయన ఆదేశం మీదనే. అదీ విజయవాడ కాలేజీ రంగస్థల వేదిక మీద. 'రాచమల్లుని యుద్ధ శాసనం' అన్న నాటికలో నాగమ్మ పాత్ర! పైగా స్త్రీ వేషం!

రామారావు గారి విద్యార్థి జీవితంలో ఆయనను తీర్చిదిద్దినదీ తెలుగుతనమే. రాయప్రోలు, విశ్వనాథ, గరిమెళ్ల, జాషువా, కరుణశ్రీ వంటి కవుల రచనల వల్ల ఉత్తేజితమైనది ఆయన వ్యక్తిత్వం, తుదిశ్వాస విడిచే వరకు రామారావు గారిలో ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా డోలలూగింది ఈ ఆంధ్రాభిమానమే. ఆ విషయంలో ఆయన సార్థకజన్ముడై ఆంధ్రుల ఆత్మగౌరవానికి ప్రాణప్రతిష్ట చేశాడు.

1950 నుంచీ మూడు దశాబ్దాల తెలుగు యువత తనను తాను ఎన్.టి.ఆర్ అనే నిలువుటద్దంలో చూసుకుని సొబగులు దిద్దుకుంది. ఆయన చిరునవ్వులు, కనుగీటులు, వస్త్రధారణలు వగైరాలలో అనేక మంది యువకు(మారులు)లు అపర యన్.టి.ఆర్లై సాక్షాత్కరించేవారు.

తెలుగు చదువు, సంస్కారం అనే ద్విగుణీకృత సులక్షణ రేఖను దాటలేదు కాబట్టే ఆయన పౌరాణిక చిత్ర నట, దర్శక, నిర్మాతగా రాణించాడు. చారిత్రిక చిత్రాల (తెనాలి రామకృష్ణ, మహామంత్రి తిమ్మరుసు వగైరా)లో రాజిల్లాడు. రామ రావణులు, కృష్ణార్జునులు, శ్రీనాథ వీరబ్రహ్మేంద్రులు ఏ పాత్రలు ధరించినా అన్నిటికీ అచ్చుగుద్దినట్లు అబ్బి వచ్చిన రూప సౌష్టవం ఆయనలో ఉంది. సంప్రదాయ గౌరవం క్రమశిక్షణగా వర్ధిల్లిందిగనుకనే కొన్ని పవిత్ర పాత్రలు ధరించేటప్పుడు ఆహార విహారాలలో నియమనిష్టలు ఆయన తు.చ తప్పక పాటించారు. తెలుగువారి అధునాతన సినీ కళాచరిత్రకు ఆయన నాయకుడైనా, తరువాత రాజకీయంగా నాయకుడైనా ఆ నియమనిష్ఠలే కారణమని, అవి ఆయనకు ప్రజా హృదయాలలో సంపాదించి పెట్టిన స్థానమే మూలమని చెప్పక తప్పదు.

చాలామందికి ఆయన మంచి గాయకుడని తెలియదు. ఎంకిపాటలు, విశ్వనాథ వారి పద్యాలు రాగయుక్తంగా పాడగల దిట్ట. ఘంటసాల గారంటే ఆయనకు ప్రాణం. ఘంటసాల గారు పరమపదించినప్పుడు ఆయన ఎంత వెలితి అనుభవించారో నాకు తెలుసు.

ఆంధ్రసచిత్ర వారపత్రికలో నేను సబ్-ఎడిటర్గా వున్న (1958-1962) రోజులలో శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారు తొలిసారి నన్ను రామారావు గారికి పునః పరిచయం చేశారు. ఏవూరు అంటే 'మాది పెదకళ్లేపల్లి' అనగానే "మా పెదకళ్లేపల్లి - మా తిరణాల కళ్లేపల్లి.... మరి చెప్పరేం" అని నన్ను మలి పరిచయంలోనే అభిమానించారు ఆయన. తొలి పరిచయం తరువాత కాలం జరిగి, కలవడం జరగక, మలిపరిచయం చేయక తప్పలేదు.

'మనదేశం' చిత్రంలో నటుడిగా ఆయన అవతరించేవేళ దర్శకులు ప్రసాద్‌గారి పనుపున రామారావుగారిని మద్రాసు తీసుకువచ్చి తనతో పాటు ఆశ్రయమిచ్చినవారు శ్రీదుగ్గిరాల వెంకటసుబ్రహ్మణ్యంగారు. ఆయన అప్పటికే పేరు మోసిన నిశ్చలన ఛాయా చిత్రకారుడు. డి.వి.యస్.మణ్యంగా ఆయన ప్రసిద్ధుడు. నెం.1, లోడీఖాన్ వీధి (త్యాగరాయనగర్)లో మణ్యంగారితో రామారావుగారు ఉండడం నాకు తెలుసు. తరువాత ఆయన షావుకారు, పాతాళభైరవి చిత్రాలలో నటించి వేరుగా వుంటూ మణ్యంగారి దగ్గరకు తీరిక సమయాలలో వచ్చి చిలిపి చిరుతిళ్లు, వంటలపై మక్కువ చూపించడమూ తెలుసు. ఆసమయంలోనే ఒకసారి విక్టోరియా పబ్లిక్ హాల్ (చెన్నపురి ఆంధ్రమహాసభ)లో తను వేయదలుచుకున్న నాటకానికి ఆంధ్ర పౌరుషం మీద ఒక గీతం కావలసి రావడం, మణ్యంగారు నన్నాయనకు అప్పగించడం జరిగింది. అన్నీ జరిగాయి కానీ నాటకం వెయ్యలేదు. కారణాంతరాలవల్ల ఆగిపోయింది. అంతకు ముందే రాయలసీమ కరువునిధి కోసం ఆయన జి.వరలక్ష్మితో కలిసి ఊరూరా తిరిగి నాటకాలు ప్రదర్శించడం జరిగింది. ఎం.ఎస్.రామారావు అప్పుడు ఎన్టీఆర్‌కు నేపథ్యగానం చేశారు.

'రాయలు ఏలిన ఆదేశంలో
రతనాల్ పండిన ఆ భూముల్లో
కరువు పిశాచం గజ్జెకట్టుకొని
కదననృత్యం చేస్తుంటే...
వినండి బాబూ విషాద గాథ
వినరయ్యా ఈ కరువు కథ...'

ఇలాంటి పాటలతో ఆనాడు రాష్ట్రం మారుమ్రోగిపోయింది.

ఇదంతా చెప్పడానికి కారణం రామారావు గారికి మొదటి నుంచీ రాష్ట్రాభిమానం, దేశభక్తి ఉండేవని అవి ఏనాడూ మరువనందువల్లనే ప్రజానాయకుడుగా ఎదిగాడని తెలుపడానికే. 'కళ కళ కోసం కాదు - దేశం కోసం' అన్నది ఆయన నమ్మిన సిద్ధాంతం. జీవితంలో ఆయన అది నిరూపించుకున్నారు.

ఆరోజుల్లో ఒకసారి ఆయన తెనాలి తాలూకా కొల్లూరు వచ్చారు. కొల్లూరు మా అమ్మగారి వూరు. అక్కడి హైస్కూల్‌లో నేను ఎస్.ఎస్.ఎల్.సి. చదివాను. అదే స్కూల్లో గుమ్మడిగారు నాకు సీనియర్. అవి మిస్సమ్మ పిచ్చిపుల్లయ్య నిర్మాణంలో వున్న రోజులు. ఒకసారి గుమ్మడి తనతో రామారావుగారిని మా వూరుకు తీసుకువచ్చారు. సర్గీయ చెరువు ఆంజనేయశాస్త్రి యింట్లో విందు. అది మరపురాని ఘట్టం. అప్పటికి నేను విజయవాడలో బి.ఎ. చదువుతున్నాను. విశ్వనాథ సత్యనారాయణ గారి ప్రసక్తి వచ్చింది. 'ఆయనది అమోఘమైన ప్రభావం - అందులో పడ్డవారు తప్పించుకోవడం కష్టం.. ఏమంటారు?' అని రామారావు నన్ను అడిగారు 'నిజమేనండీ మీలోనూ ఆయనే కనిపిస్తున్నారు - మీ సాహిత్యాభిమానం చూస్తుంటే' అన్నాను నేను. 'మనమంతా తెలుగు వాళ్లమై పుట్టినందుకు గర్వించాలి - తెలుగునే దేశ రాజభాషగా చెయ్యాలి. భారతీయుల్లో ఎక్కువమంది మాట్లాడేది తెలుగే' అన్నారు.

ఆంధ్రాభిమానం ఆయనలో ఆయనతో పాటు పెరుగుతూ వచ్చింది.



ఆయన తీసిన చిత్రాలలో కూడా అది చోటు చేసుకుంది.

ఆ తరువాత ఆంధ్ర సచిత్రవారపత్రికలో సినిమా సెక్షన్ చూస్తున్నప్పుడు 'నయనానంద తారక రాముని కథ' అని నేను రాసిన వ్యాసం ఆయన చదివి, ఎంతో సంతోషించి, 'మీ శైలి, రచనా సౌందర్యం చూస్తుంటే మీరు సినిమా ఫీల్డ్‌కి రావడం మంచిదనిపిస్తోంది'' అన్నారు.

ఎన్.టి.ఆర్. వారు నిర్మించిన 'సీతారామ కళ్యాణం' చిత్రంపై ఘాటుగా నేను 'రామారావణీయం సీతారామ కళ్యాణం' అనే శీర్షికతో రాసిన సమీక్ష చూసి చిరునవ్వుతో, ఎవరి గురించో రాసినట్టుగా, 'కొంచెం ఘాటు తగ్గిస్తే బావుండేదేమో' అన్న సహృదయశీలి ఆయన. అటు తర్వాత కొన్ని పౌరాణిక గాథల విషయంలో ప్రబంధాల విషయంలో మా మధ్య ఇష్టాగోష్ఠిగా చర్చలు జరిగేవి. పింగళి సూరన గారి 'కళాపూర్ణోదయం' ప్రముఖంగా చర్చకు వచ్చినా ఒక కథగా జనబాహుళ్యానికి చిర పరిచితమైన పాత్రలు లేకపోవడం అడ్డంకిగా అయన భావించేవారు. నిజానికి అటువంటి ప్రయత్నాలు 'వరూధిని' వంటివి అపజయం పొందాయి కూడా.

తరువాత కొన్నాళ్లకు నా సంగీత నాటిక 'సిరికాకొలను చిన్నది' చిత్రంగా తీయాలని ఆయన భావించినప్పుడు కథాబలం వల్ల అపరిచిత పాత్రలతో యిబ్బంది వుండదని, శ్రీ కృష్ణదేవరాయల పాత్రత వల్ల అవన్నీ సమసిపోతాయనీ, కనుక రాయలు పాత్రకు శృంగారం పెంచి, మరింత ఆకర్షణీయంగా చేయమని నన్ను ఆయన కోరారు. కానీ అలా చేయడంవల్ల రాయల పాత్రకు అన్యాయం జరగడమే గాక, కథాలక్ష్యమే దెబ్బ తింటుందని భావించి ఆ విషయమే చెప్పాను. నా మాట ఆయనకు రుచించలేదు. 'రాయలు పాత్ర నేనే వేస్తాను. రొమాన్స్ పెంచకపోతే బాగుండదు. మరేం పర్వాలేదు. అలా చేయండి' అన్నా అది నేను చేయలేకపోయాను. అందుకే మా చిన్నది సిరిగా సిరికాకొలనులోనే వుండిపోయింది. వెండితెర వెలుగు కాలేదు, అందుకు నాకు బాధలేదు.

నన్ను ఒక మిత్రుడిగా, ఆయన కన్న చిన్నవాడినైనా, ఎంతో అభిమానించి గౌరవించారు రామారావు. పత్రిక ఉద్యోగం మానుకున్న తరువాత 'ఇక పత్రికలు వద్దు. ఫీల్డ్‌లోకి వచ్చెయ్యండి' అని డి.బి.నారాయణ గారి 'పెండ్లిపిలుపు' చిత్రానికి సహరచయితగా చేశారు. దానికి ఇద్దరు ముగ్గురు డైలాగు రైటర్లు ఆత్రేయ,ఆరుద్ర,సముద్రాల జూనియర్ ఒకరి తరువాత ఒకరు వస్తూ, రాస్తూ - ఇలా జరిగేది ఆ పని! అవన్నీ చూసి నిర్మాత నారాయణ గారికి, దర్శకులు ఆమంచర్ల శేషగిరి రావుకీ వివరించడం నా పని. మధ్యే మార్గంగా నేనూ, పూసపాటి కృష్ణంరాజూ (చాలా మంచి స్పార్క్‌వున్న రచయిత - ఈనాడు ఆయన స్మృతిగా మిగిలిపోయాడు)మరో వెర్షన్ తయారుచేసేవాళ్లం. ఆత్రేయ వచ్చి అది చూసి దానిపై తన ధోరణిలో మార్పుచేసి రాసేవారు.

ఒకసారి 'మనసివ్వలేని మగనితో మగువలెప్పుడూ కన్నీటి కాపురం చెయ్యలేరుగాక చెయ్యలేరు' అని రాశాడు, 'ఏమిటీ యతి ప్రాసలు' అన్నాను. 'పాటలకే కాదు...మాటలకీ అవసరమే. విషయం లేనప్పుడు చప్పుడు అవసరం' అన్నాడు.

అటుతర్వాత పాటల రచన మీదనే కృషి చేయమనీ తన చిత్రాలకు రాసే అవకాశం కల్పిస్తానని స్థిరంగా వుంటేనే దేనికైనా ఫలం వుంటుందని (ఆయన మాటల్లో... యు హేవ్ ఎ వెరీ బ్రైట్ ఫ్యూచర్, డోంట్ వర్రీ, థింగ్స్ విల్ కమ్ టు యు) ఆయన నచ్చ చెప్పడం జరిగింది. ఒకటి రెండు అనుభవాలు నాకు రుచించలేదు. ఒక నిర్మాత ఆయన ఎదురుగా అతి వినయంగా 'తప్పకుండా సార్' అని నన్ను ఆఫీసుకు రమ్మని 'మాకు మొదటినుంచీ రైటర్ ఆరుద్రగారు సార్, మాకు సెంటిమెంటు కూడాను' అంటూ వాపోవడం జరిగింది. 'అందులో తప్పేముంది. సెంటిమెంటును నేనూ గౌరవిస్తాను' అని వచ్చేశాను. ఇవి నేను ఎదురు చూడని అనుభవాలు. జర్నలిజంలో నాకు సదవకాశాలెన్నో వుండగా నేనెందుకు ఇలా బాధపడాలి' అనుకుని ఆ రాత్రే రైలెక్కి విజయవాడ చేరి 'ఆంధ్రప్రభ'లో చేరాను. నేను రామారావుగారితో చెప్పకుండా, చెబితే వెళ్ళనివ్వరని, వచ్చేశాను.

ఆ తరువాత హైదరాబాదులో ఫతే మైదానంలో లాల్ బహదూర్ శాస్త్రి గారికి దేశరక్షణనిధి అందచేయడానికి రామారావుగారు రావడం, ఆ సభను కవర్ చేయడానికి పత్రికా విలేఖరిగా వచ్చిన నన్ను చూసి కోపంగా స్టేజి మీదికి పిలిపించి 'ఎందుకిలా చేశారు! ఇదేమీ బాగాలేదు, మద్రాసు బయలుదేరండి' అని ఆజ్ఞాపించారు. 'నేను వస్తానులెండి, తరువాత మీతో మాట్లాడతానుగా' అన్నాను. 'అన్నీ నాకు తెలుసు, మీరేం చెప్పనక్కరలేదు. పేషన్స్ వుండాలి - నాకు మద్రాసు వచ్చి కనిపించండి' అన్నారు.

ఎందుకంతగా ఆయన నన్ను రచయతగా చూడాలనుకున్నారో తెలియదుకానీ, నేను రచయితగా రామారావు గారికి రాసిన పాటలు రాశి లాభాలు కొలబోసి వాసిగన్నవై నిలిచాయి. (సశేషం)

**-వేటూరి సుందరరామమూర్తి**

## తనికెళ్ల భరణిరచించి గానం చేసిన శివభక్తి గీతాల క్యాసెట్ విడుదలకు సిద్ధం

న్యూస్ ఫ్లాష్

భగవంతుని లీలలను, తత్వాన్ని అర్థం చేసుకోవడం దుర్లభం. అయితే భక్తుని అవాజ్యమైన ప్రేమకు మాత్రం ఆయన లొంగిపోతాడనే విషయం తెలిసిందే. అంతటి భక్తితో భగవంతుని సేవించి తరించే వారు కొద్ది మంది మాత్రమే. వారిలో ఒకరు కావాలన్న తపనతో శ్రీ తనికెళ్ల భరణి రచించి గానం చేసిన ఓ భక్తి గీతాల క్యాసెట్ వెలువడనుంది.

విశ్వ కళ్యాణాన్ని, సర్వమానవ శ్రేయస్సును కాంక్షిస్తూ, శివారాధన పట్ల చైతన్య దీప్తివంతం చేసేందుకు సికింద్రాబాద్ జింఖానా మైదానంలో ఫిబ్రవరి 1,2,3 తేదీలలో శ్రీ శైవ మహాపీఠము నిర్వహిస్తున్న ఓ భారీ కార్యక్రమంలో ఈ క్యాసెట్‌ను ఓ ప్రముఖ హీరో ఆవిష్కరించనున్నారు.

ఇదే కార్యక్రమంలో పద్మశ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యంగారి సమక్షంలో పాడుతాతీయగా, పాడాలనివుంది విజేతలచే పార్థసారథి ఆధ్వర్యంలో వేటూరి, షణ్ముఖశర్మ వంటి ప్రముఖులు రాసిన పాటలతో ఆర్కెస్ట్రా, నటుడు చంద్రమోహన్ అధ్వర్యంలో కామెడీస్కిట్స్, ప్రముఖ మెజీషియన్ శ్రీ బి.వి.పట్టాభిరామ్ గారిచే ప్రదర్శన ఉంటాయని ప్రపంచ శైవ మహాసభల ఆర్గనైజింగ్ కమిటీ ఛైర్మన్ తాడికొండ విజయ్‌కుమార్ తెలిపారు.

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 5

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

- జీడిగుంట రామచంద్రమూర్తి



**జరిగిన కథ**
రాజు పాలెం అనే గ్రామంలో రావ్ బహద్దూర్ వంశానికి చెందిన వీరభద్రం అనే స్కూలు మాష్టారు ఉంటారు. ఆయనంటే ఆ ఊరి మొత్తానికి భక్తితో కూడిన భయం. చీటికి మాటికి భార్యపై రుసరుస లాడుతుంటాడాయన. వీరభద్రం పెద్దకొడుకు శ్రీరామ్ పట్నంలో చదువుతూంటే చిన్న కొడుకు లక్ష్మణమూర్తి తండ్రి దగ్గరే ఉండి పదోతరగతి చదువుతూ ఉంటాడు. శ్రీరామ్‌ను అశ్విని ప్రేమిస్తూ ఉంటుంది. తనకు బాకీగా ఉన్న కట్నం బాపతు సొమ్మును రెడీగా ఉంచమని మామ వీరభద్రంకు ఉత్తరం రాస్తాడు రాజేంద్ర . దాని గురించి బాల్యస్నేహితుడు లాయర్ చిదంబరంకు చెప్పి మంచి సలహా ఇమ్మంటాడు. సంక్రాంతి పండుగకు గంగిరెద్దులను ఆడించే అప్పలస్వామి వీరభద్రం ఇంటి ముందు గంగిరెద్దు ఆడించటానికి ప్రయత్నిస్తూ ఉంటాడు. -(ఇక చదవండి)




అప్పలస్వామి మళ్లీ ఊదటం ప్రారంభించాడు. డ్యాన్సుకూడా చేశాడు. కానీ ప్రయోజనం లేకుండా పోయింది.

గుమ్మాలకు చామంతిపూల దండలు కట్టే ప్రయత్నంలో వున్న నారాయణ ఈ తతంగమంతా గమనించాడు.

"తమరోపాలి అట్టాలోపలకు ఎల్లండి బాబూ!" వీరభద్రం దగ్గరగావచ్చి నెమ్మదిగా చెప్పాడు...

"ఎందుకనీ?" కోపంగా చూశాడు వీరభద్రం.

"సెప్తాకదా! ఓపాలి ఎల్లండి!"

తీవ్రంగా చూస్తూనే లోపలకు వెళ్లాడు

వెంటనే సన్నాయి వాయిద్యానికి అనుగుణంగా గంగిరెద్దు చిందులు వేయటం ప్రారంభించింది...

అప్పుడు నారాయణ - అరుగుమీది కుర్చీని తీసుకెళ్ళి - లోపల తలుపు పక్కగా వేశాడు. గంగిరెద్దుకి కనిపించకుండా - వీరభద్రం కుర్చీలో కూర్చుని ఆట చూశాడు.... ఆ తర్వాత పార్వతమ్మ చేట నిండా బియ్యం తెచ్చి అప్పలస్వామి 'జోలె'లో పోసింది...

వీరభద్రానికి దణ్ణంపెట్టి వెళ్లిపోయాడు అప్పలస్వామి.

అదే సమయంలో - రోడ్డు చివర్నించి - సైకిలురిక్షా వచ్చి ఆ ఇంటి ముందు ఆగింది.... అందులోంచి గీతా, రాజేంద్రా దిగేరు. పార్వతమ్మ ఉత్సాహంగా వాళ్ళను ఆహ్వానించింది... రిక్షాలోవున్న పెట్టే, సంచీ లోపలకు తీసుకెళ్లాడు లక్ష్మణమూర్తి.




కాళ్లు కడుక్కునేందుకు నీళ్లు తెచ్చి రాజేంద్రకు అందించాడు నారాయణ.

"రండి అల్లుడుగారూ!... కుశలమే గదా?" - అల్లుణ్ణి పలకరించాడు వీరభద్రం.

ముందు ఉత్సాహంగానే బదులు చెప్పాలనుకున్న రాజేంద్ర - వీరభద్రాన్ని చూసి అదోలా మారిపోయి చెప్పాడు-

"కు...లాసాయేనండీ!"

పార్వతమ్మ మంచినీళ్లు తెచ్చిచ్చింది.

"అల్లుడుగారూ!... తమరొక్క అయిదు నిమిషాలు ముందుగా వచ్చివుంటే వృషభవినోదమును తిలకించి వుండేవారు!... మీ భాగ్యనగరంలో అటువంటి సంబరములు అరుదుగదా?"- సంబరంగా చూస్తూ అన్నాడు వీరభద్రం.

రాజేంద్ర పళ్ళుకొరుక్కుంటూ - మావని మనసులోనే తిట్టుకున్నాడు -

"హు!... అయిదునిమిసాలు ముందొస్తే - 'వృషభవినోదం' - అరగంట ముందొస్తే 'అడ్డగాడిద వినోదం'- అంటాడే తప్ప -'పండకొచ్చావ్ నీ కట్నం బాకీ తీర్చేస్తాన్లే'- అంటాడా?.. అనడు!... పైగా బోడి అర్థం కాని భాషొకటి!... వృషభ వినోదమట... వృషభ వినోదం!"

అంతలో గీత మంచినీళ్లు తాగుతూంటే - పార్వతమ్మ ఆమెవైపే చూస్తూ అడిగింది -

"అంత చిక్కిపోయావేమిటే తల్లీ?... అక్కడ నీళ్ళు పడటం లేదా?"

"నీళ్లూ పడ్తున్నాయ్... పాలూ పడుతున్నాయ్... కానీ మీ అల్లుడిగారితోనే బొత్తిగా పడటం లేదమ్మా!"-

గీత మాటల్లోని ఛలోక్తిని అర్థం చేసుకున్న పార్వతమ్మ ముసిముసిగా నవ్వుకుంది.

"ఛ! ఊరుకో!.. బంగారంలాంటి అల్లుడిగారి మీద అపవాదులెయ్యకు! ఆయన నిన్ను నెత్తిమీద పెట్టుకుని చూసు కుంటాట్టగా?..మొన్నామధ్య హైదరాబాదు నించి మీస్నేహితురాలు శారద వచ్చినప్పుడు చెప్పింది."అంది.

"ఇటీజ్ టూమచ్ అత్తయ్యగారూ? నామీద అపవాదులు వెయ్యద్దని మీ అమ్మాయికి చెప్పూ ఆ అపవాదులు మీరు వేస్తున్నారు నామీద"అన్నాడు రాజేంద్ర చిరుకోపం నటిస్తూ...

పార్వతమ్మకి అర్థంకాలేదు..

"నేనా?"అడిగింది అయోమయంగా చూస్తూ..

"అవును మీరే!.."మీ అమ్మాయిని నానెత్తిమీద పెట్టుకుని చూసుకుంటున్నానంటే ఏమిటర్థం? ఆ శివుడు గంగమ్మను నెత్తిమీద పెట్టుకుని పార్వతితో కాపురం చేస్తున్నాడనేగా? అక్కడికి నాకు వేరే,పార్వతి లాగా " అంటూ ఇంకా చెప్పబోతుంటే-

"చాల్లే ఊరుకోండి అల్లుడుగారూ!....మీగుణగణాలు మాకు తెలియనివా?"అంటూ నవ్వేశాడు వీరభద్రం. గర్వంగా కాలరెగరేశాడు రాజేంద్ర. "రాముడు రాలేదా అమ్మా"కొన్నిక్షణాల తర్వాత అడిగింది గీత. "వాడికి ఈ పండక్కి శలవలు ఇవ్వలేదటమ్మా!.."రెండురోజుల భాగ్యానికి ఎందుకులే' అనుకున్నాడు. పైగా ఫైనల్ పరీక్షలు కూడా దగ్గర పడుతున్నాయి కదా...చదువుకోవాలట!..నిన్ననే వాడిదగ్గర్నించి ఉత్తరం వచ్చింది...నిన్నూ,అల్లుడుగార్నీ మరీమరీ అడిగినట్టు చెప్పమన్నాడు".

"బహుశా మావయ్యగారు అతన్ని బెదరగొట్టేసివుంటారు. పరీక్షల్లో 'ఫస్టుక్లాసు'రాకపోతే ఇంటికి రానివ్వనని!"వీరభద్రంవైపు కసిగా చూస్తూ అన్నాడు రాజేంద్ర. "అల్లుడుగారు మరీ

విషయాన్ని సులువుగానే పసిగట్టేసారు! నా ఉత్తరం చూసి మా సుపుత్రుడు బెదిరిపోయే వుండాలి!" మీసాలు మెలివేసుకుంటూ చెప్పాడు వీరభద్రం.

****

ఆ రాత్రి హాస్టల్ గదిలో టేబుల్ ముందు కూర్చుని పుస్తకం చదువుతున్నాడు శ్రీరామ్. అయితే పుస్తకంలోని అక్షరాలపై అతని చూపు లగ్నం కావడంలేదు. 'టేబుల్ మీద ఓ పక్కనవున్న'ఇన్‌లాండ్ లెటర్ మీద వుండి వుండి అతని చూపులు నిలుస్తున్నాయి.... అలా చూస్తున్నప్పుడల్లా ఆ కవరు ఓ జెర్రిలాగా, ఓ తేలు లాగా కనిపిస్తోంది... భయంతో దాన్ని క్రిందకు తోసేసాడు. క్రిందపడిన ఇన్‌లాండ్ లెటర్ గాలికి రెపరెప లాడుతూ తెరచుకుంది. హఠాత్తుగా శ్రీరామ్‌కి తండ్రిగొంతు వినిపించింది.

"ఒరేయ్ శుంఠా!.. నీ ఉత్తరం చేరింది!" ఉలిక్కిపడి అటు చూశాడు శ్రీరామ్. రెపరెప లాడుతూ తెరుచుకున్న ఆ 'ఇన్‌లాండ్ లెటర్లో' తన తండ్రి రూపమే కనిపిస్తోంది.. చటుక్కున దాన్ని తీసి మూసేసి బల్లమీద పెట్టి గాలికి మళ్లీ తెరచుకోకుండా పుస్తకం బరువుపెట్టేడు. పుస్తకం తెరచి మళ్లీచదవటం ప్రారంభించాడు. రెండు క్షణాలు కూడా దృష్టి పుస్తకంలో నిలవలేదు. భయంగా ఇన్‌లాండ్ కవరు తీసి తెరిచాడు.. మళ్లీ తండ్రి రూపం ప్రత్యక్షమైంది. "..........తమరు ఈ పండుగకు విచ్చేసి మమ్మల్ని ఉద్ధరింపనవసరంలేదు...శ్రద్ధగా చదివేడ్చి ఫష్టుక్లాసున డిగ్రీ వచ్చు ప్రయత్నము గావింపుడు. అట్లురాకున్న నేనే "టౌనుకి విచ్చేసి తమకు పూర్తిగా 'కేశఖండన' గావింపచేసి గార్దభంపై ఊరేగింపుగా ఊరికి గొనితెచ్చి మన పాఠశాలలోనే బంట్రోతుగా నియమించెదను" -

ఉత్తరంలోని మేటరంతా సాక్షాత్తూ తన తండ్రే చదివినట్టుగా భ్రమ కలిగినట్లయింది.

హడలిపోయి కవరు మూసేశాడు శ్రీరామ్...ముఖానికి పట్టిన చెమటలు తుడుచుకుని - మళ్ళీ పుస్తకం తెరిచాడు.

ఇప్పుడు పుస్తకంలోనే-ఓ దృశ్యం ప్రత్యక్షమైంది!...

ఆ దృశ్యంలో-

శ్రీరామ్-తన గుండు మీద రుమాలు కప్పుకుని-నక్కుతూ,నక్కుతూ వెళ్ళి స్కూలుగంట మోగిస్తున్నాడు. అయినా కొంతమంది టీచర్లు అతన్ని చూసి హేళన చేస్తున్నట్టుగా నవ్వుతున్నారు.

ఆ దృశ్యాన్ని చూడలేక- 'వామ్మో'- అనుకుంటూ తటాల్న పుస్తకం మూసేశాడు శ్రీరామ్.

అక్కణ్ణించి లేచివెళ్ళి-కూజాలోని మంచినీళ్ళు తాగి, మళ్లీవచ్చి కూర్చున్నాడు. అలాగే అలోచిస్తూ శూన్యంలోకి చూస్తున్న అతని చూపులు అప్రయత్నంగా పక్కనున్న కిటికీవైపు మళ్ళాయి.

కిటికీలోంచి-'జీన్స్‌ప్యాంట్'తొడిగిన ఓ 'కాలు' లోపలకు వస్తోంది... దిగ్భ్రాంతిగా అతను అటే చూశాడు. మరుక్షణంలో మరోకాలు కూడా లోపలకు వచ్చింది... ఆ వెంటనే- టోటల్ గా 'బాడీ' మొత్తం- దభీ మని పడింది....

శ్రీరామ్ కుర్చీలోంచి లేచి-ఓఅడుగు వెనక్కివెళ్ళి భయంతో అటు చూశాడు... ముఖంపై పడిన జుట్టుని అలవోకగా -'స్లోమోషన్'లో పైకి నెట్టుకుంటూ శ్రీరామ్‌వైపు చూసి కన్నుకొట్టింది-అలా లోపలకు దూకిన అశ్విని.

శ్రీరామ్ ఆశ్చర్యపోయాడు..

"నువ్వా"అన్నాడు.




"ఏం?"నమ్మకం లేదా?...కావాలంటే గిల్లుకో!" అంటూ ముందుకు వచ్చి తన బుగ్గను చూపించింది...

శ్రీరామ్ ఇంకో రెండడుగులు వెనక్కివేశాడు. అశ్విని చిరాగ్గా చూసింది. ''పాపం''వర్రీ. బుద్ధావతారం...మీనాన్నగారు నీకు 'రాముడి' పేరెట్టి-నాకు ద్రోహం చేశారు..ఎంచక్కా ఏ 'కృష్ణమూర్తో'అని పెట్టుంటే-ఇలాంటప్పుడు...కొంచమైనా అడ్వాన్స్ అయ్యేవాడివి!"-అంది. శ్రీరామ్ ఒళ్ళు మండిపోయింది. "చాల్లే!..జోకులెయ్యకు. ఇది కాలేజీ క్యాంపస్ కాదు! హాస్టలు!...అందులోనూ బోయ్స్ హాస్టల్...! పైగా అర్ధరాత్రి సమయం!" -కోపంగా చూశాడు.

"అయితే ఏం?...ఆడపిల్ల, అర్ధరాత్రి పూట ఒంటరిగా, నిర్భయంగా నడిరోడ్డు మీద నడవగలిగినపుడే మనకి స్వతంత్రం వచ్చినట్టు అవుతుం దన్నారు గాంధీజీ"- గర్వంగా చూస్తూ చెప్పిందామె.

"కావచ్చు...కానీ ఇలా పెళ్లికాని ఆడపిల్ల అర్ధరాత్రి బరితెగించి ఒంటరిగా వుంటున్న ఓ మగాడి గదిలోకి వచ్చి బుగ్గ గిల్లుకో,ముద్దు పెట్టుకో అంటే అది స్వతంత్రం వచ్చినట్టుకాదు- ఆపిల్లకి పిచ్చి ముదిరినట్టు! అయినా ఇలా గోడ దూకి రావటానికి సిగ్గులేదూ?" అడిగేడు శ్రీరాం-కొంచెం ఆవేశం తెచ్చుకుని.. "ప్రేమించిన వాళ్లకి సిగ్గులూ, భయాలూ- వుండకూడదని శాస్త్రం చెప్తోంది..నిజానికి ఈపని నువ్ చేసుండాలి!..ఏం చేస్తాం?...మనది మొదట్నించీ రివర్స్ కేసేకదా?"నిట్టూర్చింది అశ్వని..

"సర్లే పద..నిన్ను మీ ఇంటిదగ్గర దిగబెడతాను!" ఆమెచేయి పట్టుకున్నాడు శ్రీరామ్. చేయి విదిలించుకుందామె. "అఖ్ఖర్లేదు!.." నువ్వురమ్మంటే వచ్చానా-దిగబెడతానంటే దిగి రావడానికి?....అయినా ఒంటరిగా వచ్చినప్పుడు లేని భయం- తిరిగి వెళ్ళటానికి మాత్రం ఎందుకుంటుందీ?"

ఆమెలోని మొండితనం చూసిన శ్రీరామ్ హతాశు డయ్యాడు. "అబ్బా!..ఏమిటి అశ్వినీ? ఈ పళంగా మా 'వార్డెన్' మనల్ని చూస్తే ఏమవుతుందో తెలుసా?"-అడిగాడు నిస్సహాయంగా చూస్తూ. "ఏమవుతుందీ?"-చేతులు కట్టుకొని -మొండిగా చూస్తూ ప్రశ్నించింది. "నా భవిష్యత్తు సర్వనాశన మవుతుంది.... అపుడు నేను గుండుతో..." అంటూ అంతకు ముందు చదివిన ఉత్తరంలోని విషయాన్ని చెప్పబోతూ-నాలిక కరుచుకున్నాడు.



"గుండా?...గుండేమిటీ?"-ఆశ్చర్యపోతూ అడిగింది అశ్విని. "గుండంటే అదే అంటే గుండు సున్నా మార్కులన్నమాట! నా బాధ నీకర్థంకాదు కానీ- నాయందు దయుంచి వెళ్లిపో.." చేతులు జోడించాడు శ్రీరామ్ "ఆల్ రైట్...వెళ్లిపోతాను కానీ ఒక్క షరతు"

"ఏమిటీ?"

"అశ్వినీ 'అయ్ లవ్ యూ'అనాలి! "

"ఛస్తే అనను"-అని అందామను కున్నాడు. కానీ సరిగ్గా అదే క్షణంలో బయట ఏదో అలికిడి కావడంతో వార్డెన్ వస్తున్నాడను కుని బెదిరిపోయాడు. "అశ్వనీ-ఐలవ్‌యూ" అనేశాడు గబగబా...

"ఛ!..అలాగేనా చెప్పటం?.. ఖచ్చితంగా అయ్ హేట్ యూ అన్నంత అసహ్యంగా చెప్పావు!"

శ్రీరామ్ నిస్సహాయంగా చూశాడు..

అంతలో అశ్విని అతనికి దగ్గరగా వచ్చింది. అతని రెండు భుజాల మీద చేతులు వేసింది... అతని కళ్ళల్లో కళ్లుపెట్టి మత్తుగా చూస్తూ చెప్తోంది-"కాస్త పెదవులపై నవ్వు పులుముకో నేస్తం!..ప్లీజ్!..కళ్ళల్లో ప్రేమ నింపుకో! మనస్ఫూర్తిగా "నిన్ను ప్రేమిస్తు న్నాను అశ్వినీ- అనిచెప్పు"




ఇక తప్పదనుకున్నాడు శ్రీరామ్. "మూడ్"తెచ్చుకున్నాడు. ఆప్యాయంగా ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు. దాన్ని ప్రేమగా నొక్కుతూ చెప్పాడు- "అశ్వనీ...!అయ్ లవ్ యూ!".

ఆ స్పర్శకు అశ్విని పులకరించిపోయింది..."థ్యాంక్యూ శ్రీరామ్! థ్యాంక్యూ వెరీమచ్!..చాలు...ఈ రోజుకీ తృప్తిచాలు...ఇంటికెళ్లి ప్రశాంతంగా నిద్రపోతాను. ఆ నిద్రలో రంగురంగుల కలలు కంటాను.. నీతోకలసి- రామోజీ ఫిల్మ్ సిటీలో విహరిస్తున్నట్లు - ఆ కలలో కమ్మగా పాడు కుంటాను...వస్తానూ(!" అతని చేతి మీద ముద్దు పెట్టుకుంటూ చెప్పింది.

"శెలవ్"-విసుగ్గా నమస్కారంపెట్టి-చిరాగ్గా చెప్పాడు శ్రీరామ్

"నో....!శెలవ్ కాదు! సే లవ్!"-అంటూ లాలనగా చూసి-మళ్ళీ కన్నుకొట్టి కిటికీలోంచి బయటకు జంప్ చేసిందామె. శ్రీరామ్ తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు.

"ఇదెక్కడి 'లవ్ 'రా బాబూ?రోజు రోజుకీ శృతి మించి రాగాన పడుతోంది!"-అనుకున్నాడు... దీనికెదైనా విరుగుడు కనిపెట్టాలి అనికూడా ఆలోచన చేశాడు. కొన్నిక్షణాల తర్వాత అతనికో మెరుపు లాంటి ఆలోచన వచ్చింది... వెంటనే-"నోట్ బుక్" లోంచి ఓ తెల్లకాగితం చింపి- దానిమీద రాయటం ప్రారంభించాడు...

****

అదో అధునాతనమైన భవంతి...! పోర్టికోలో ఖరీదైన కారుంది. భవంతికి ముందు విశాలమైన 'లాన్'లో అశ్విని 'స్కిప్పింగ్' చేస్తోంది...మరోవైపు, కుర్చీలో కూర్చున్న విష్ణుమూర్తి తన చేతిలోని కాగితంలోకి తదేకంగా చూస్తున్నాడు...వుండి వుండి 'పైప్' పీలున్నా-'గుప్పుగుప్పు'న పొగ వదులుతున్నాడు. అంతలో పనిమనిషి రంగన్న 'యాపిల్ జ్యూస్' తీసుకొచ్చి టీపాయ్ మీద వుంచాడు. అప్పటికి అశ్విని కూడా అక్కడకు చేరుకుని-కుర్చీ మీదున్న 'నేప్కిన్' తీసుకుని ముఖం తుడుచుకుంటూ తండ్రికి ఎదురుగా కూర్చుంది.. "హాయ్...డాడ్"- అంటూ పలకరించింది. విష్ణుమూర్తి పలకలేదు.. సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు.

"ఏమిటిడాడీ అలావున్నావ్?..వాట్ హేపెండ్?.."-అని అడిగింది. అయినా బదులు చెప్పలేదు. "ఒంట్లో బాగోలేదా?"- మామూలు ధోరణిలో మళ్లీ అడిగి- అక్కడున్న యాపిల్‌జ్యూస్ గ్లాసు అందుకుని- తాగుతోంది.

"ఒంట్లో బాగానే వుంది! కానీ... ఈ లెటర్లో వున్న 'మేటర్'చాలా 'చీప్'గా వుంది"- అంటూ తన చేతిలోవున్న కాగితాన్ని ఆమెకు అందించాడు.

గ్లాసు టీపాయ్ మీద వుంచి-దాన్ని చదవసాగిందామె.

"..........గౌరవనీయులైన విష్ణుమూర్తి గారికి,

మీ అమ్మాయి అశ్విని ఇష్టం వచ్చినట్టుగా- బరి తెగించి మరీ తిరుగు తోంది. ఆడపిల్లకు అంత 'ఫ్రీడం'ఇవ్వటం మంచిది కాదని మనవి చేసుకుంటున్నాను. తను, ఈ మధ్య 'శ్రీరామ్'అనే కుర్రాడితో తెగ తిరుగుతోంది.. నిన్న అర్ధరాత్రి ఆమెను-అతని హాస్టల్ గదిలో చూసి ఆశ్చర్యపోయాను. పరిస్థితి చేయి దాటిపోతుందేమోనని అనుమానంగా వుంది పైగా సదరు శ్రీరామ్ చాలా దుర్మార్గుడు. రేపెప్పుడో మీ అమ్మాయిని 'కిడ్నాప్' చేసి మిమ్మల్ని లక్షల్లో, కోట్లో తెచ్చివ్వమని 'బ్లాక్‌మెయిల్' చేయగలడు."

ఇట్లు,

"ఆకాశరామన్న..."

ఉత్తరం చదవటం పూర్తి చేసిన అశ్విని పొట్టచేత్తో పట్టుకుని కడుపుబ్బేలా నవ్వేసింది...ఆమె నవ్వటం పూర్తయ్యేదాకా, అలాగే ఆమెవైపు విస్మయంగా చూసిన విష్ణుమూర్తి ఆ తర్వాత అడిగాడు

"ఆ నవ్వుకి అర్థం ఏమిటి?"

" 'పూర్ ఫెలో'! ప్రేమించటమే చేత కాదనుకున్నాను. ఆఖరికి ఆకాశరామన్న ఉత్తరాలు రాయటం కూడా రాదు!" అంది నవ్వుతూనే.

"ఎవరి గురించి బేబీ నువ్వ చెప్పేది?"

శ్రీరామ్ డాడీ!...అతనే ఈ ఉత్తరం రాశాడు!.. చెప్పింది.

"శ్రీరామ్ అంటే మీ క్లాసులో బ్రిలియంట్‌గా వుంటాడని చెప్పావ్ అతనేనా?"

"అవునతనే!..అతన్ని నేను లవ్ చేస్తున్నాను డాడీ!.. కానీ... నా లవ్వన్నా,నేనన్నా అతను 'కేర్‌లెస్'గా వుంటున్నాడు. మొన్నరాత్రి సెకండ్ షో సినిమానించి వస్తూ సడెన్ గా అతని హాస్టల్ రూమ్ కి వెళ్ళాను...అవిషయం మూడో కంటికి కూడా తెలీదు. మరి ఆ విషయం గురించి కూడా ఈ ఉత్తరంలో రాశాడు అంటే డెఫినిట్‌గా ఆ ఆకాశరామన్న అతనే అని నాకు అర్థమైపోయింది!..".

-(ఇంకావుంది)



# సరిగపదమని

**11**

కూర్పు : టి.నవీన్



**అడ్డం:-**

1. శ్రీరస్తు .......... శ్రీకారం చుట్టుకుంది పెళ్ళిపుస్తకం ఇక ఆకారం దాల్చుతుంది కొత్త జీవితం (4)
3. '..........నీకు అంత కోపమా జాజిపూల మీద జాలిచూపూమా' 'పెళ్ళి' చిత్రంలోని పాట (4)
5. 'గాలి........లో ........నీటిలో పడవప్రయాణం' జేసుదాసు గీతం (2)
6. '.........కన్నులతో వేచి చూస్తున్నా' సీతారామశాస్త్రి రచించిన గీతం (2)
8. త.... తధిమి త... తధిమి తందానా హృదయ లయల జతుల గతుల తిల్లానా (2)
10. 'ఎటో వెళ్ళిపోయింది మనసు' పాటను పాడిన గాయకుడు పేరు (3)
11. ........ ........వె వయ్యారి గాలిపటమా(2)
12. '......లే ......లే పరువాలు.......లే' జెంటిల్‌మెన్ చిత్రంలోని పాట (2)
14. 'జగమే...... బ్రతుకే.....' (2)
16. '........... మనసై బ్రతుకున బ్రతుకై' (4)
18. తెలుగు జాతి......... నిండుగ వెలుగు జాతి........ (3)
20. 'నరుడా ఓ నరుడా ఏమి .........' భైరవద్వీపం చిత్రంలోని పాట (3)
24. '............ వరవీణవులే' ఆదిత్య369 చిత్రంలోని పాట (4)

**నిలువు:-**

1. తాళికట్టు ......... మెడలో కల్యాణమాల (4)
2. '.......యలారా మాలికలారా మౌనముగా వున్నారా' ఎన్టీఆర్ అభినయించిన గీతం (2)
3. .......... కలగనలేదు రాముని సతికాగలనని ఏనాడు (3)
4. '.......మి .....మి ........మి ఇటురావే వెంకట.....మి' బాచి చిత్రంలోని పాట(2)
7. ఈ...... తెలిసిందీ నీలో దాగిన ప్రేమా (2)
9. '............. భామలు లేత మెరుపుతీగలు' నాగార్జున అభినయించిన పాట (4)
10. చందమామ ........ జాబిల్లి...... (2)
12. ..........మైసమ్మో మైసమ్మా (4)
13. '......... నిన్ను పిలిచింది గానమై వేణు గానమై' రఫీ పాడిన తెలుగు పాట (3)
15. రాశాను ........లేఖలెన్నో దాచాను ఆశలన్ని నీలో.. (2)
17. '........ ........ సువ్వాలమ్మా సీతాలమ్మా' స్వాతిముత్యం చిత్రంలోని పాట (2)
19. 'ప్రియా ప్రియా చంపొద్దే ....... ........ చంపొద్దే' జీన్స్ చిత్రంలోని పాట (2)
20. 'బంగారు ......పెట్ట వచ్చెనండీ హె పాపా' చిరంజీవి అభినయించిన పాట(2))
21. 'నే తొలిసారిగా ......గన్నది నిన్నేకదా' ఉష పాడిన పాట (2)
22. నీవు లేక ..... పలుకలేనన్నది (2)
23. ..... ..... మరదలా వాలే వాలే వాలే వరసలా (2)

పంపినవారి పేరు :...........................................................

వయసు :........... వృత్తి :.................................................

చిరునామా :......................................................................

...........................................................................................

..............................................ఫోన్ :.................................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక
ప్రతిసారి
ఓ సినీ ప్రముఖునిచే...

**పజిల్, కూపన్ 31-01-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



36 పాటలు గల
డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)



15పాటలు గల
సింగిల్ ప్యాక్ ఆడియో సి.డి.

మూడవ బహుమతి (రెండు తప్పులతో)



33 పాటలు గల
డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)




20 పాటలు గల
సింగిల్‌ప్యాక్ ఆడియో క్యాసెట్




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ తీరుతెన్నులపై అధ్యయనం చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# పుల్లయ్య - శ్రీశ్రీ - ఆరుద్ర....







"శ్రీ వేంకటేశ్వర మహత్యం" తీసినప్పుడు ఆ సినిమాకి సంబంధించి, తిరుపతిలోని గర్భాలయం - సెట్టు వేశారు. విజయవాహినిలోని ఒక ఫ్లోర్‌లో కళా దర్శకుడు యస్.కృష్ణారావు యధాతథంగా పునఃసృష్టి చేశారు - విగ్రహాన్నీ, పరిసరాల్నీ. ఫ్లోర్‌లోకి వెళ్లినంతవరకే - కళ్ళు మూసుకుని లోపలి వెళ్లి కళ్లు తెరిచి చూస్తే - వెనకవేపు చూడకుండా చూస్తే- కొండమీద దేవుడి ముందున్నట్టే అవే కొలతలు, రూపు రేఖలు, ఆభరణాలూ, ఎక్కడా ఏమీ తేడా కనిపించదు. ఘంటసాల 'శేషశైలవాసా' పాట పాడింది - ఆ విగ్రహం ముందున్న చావిడిలోనే, సెట్టు పూర్తయిన దగ్గర్నుంచీ ప్రజలు రావడం, చూడడం, దండాలు పెట్టుకోడం, ఎక్కువై పోయింది. దానికి తోడు పుల్లయ్యగారు ఇద్దరు అర్చకుల్ని ఏర్పాటు చేసి, రోజూ ఉదయ కాలంలో హారతులు, అర్చనలూ ఇవ్వడం, చెయ్యడం ఆరంభించారు. ఫ్లోర్ బయట కుప్పలు, తెప్పలుగా చెప్పులు. ఎంతమంది భక్తులు లోపలున్నారో, చెప్పాలంటే - బయట చెప్పులు చూస్తే చాలు! సరే, షూటింగ్ టైమ్ రానే వచ్చింది. పాట, వగైరాలు షూటింగ్ పూర్తి చేసి, సెట్ తీసేయడానికి ముహూర్తం కూడా పెట్టించారు పుల్లయ్యగారు. సాధారణంగా, స్టుడియోల్లో సెట్టు వెయ్యడానికి మంచి రోజు చూసి - ఆరంభిస్తారు గాని, తీసెయ్యడానికి ముహూర్తం



చూడరు. కాని, ఇది దైవానికి సంబంధించిన సెట్టు. పైగా ఏడుకొండలవాడు. ఆయన విగ్రహాన్ని తొలగించాలన్నా ఇబ్బందే! కాని, ఇంకో ఇబ్బంది ఎదురైంది. షూటింగ్ పూర్తయినా కూడా - విజయవాహిని స్టూడియోల్లోకి షూటింగ్‌లకి వచ్చినవాళ్లూ, షూటింగ్‌లు చూడ్డానికి వచ్చిన వాళ్లూ వెంకటేశ్వరస్వామిని దర్శించకుండా వెళ్లడం లేదు ! జనం వస్తూనే ఉన్నారు. "ఆహా" అంటున్నారు. హారతులు అందుకుంటున్నారు. పుల్లయ్యగారు అంతటితో వూరుకోలేదు - ఒక హుండీ కూడా ఏర్పాడు చేశారు - ఆ హుండీలో పడిన సొమ్మంతా తిరుపతి కొండ మీదున్న హుండీకే వెళ్తుందన్నారు. క్రమంగా హుండీ నిండ సాగింది. విగ్రహాన్ని తొలగించవలసిన ముహూర్తం వచ్చేసినా, జనం ఒప్పుకోవడం లేదు. ఎక్కడెక్కడి నుంచో పనిగట్టుకుని కూడా సెట్ సందర్శనానికి రాసాగారు. "తిరుపతిలో వున్నట్టే - అలాగే వుంది" అని చెప్పడంవల్ల ఆశ్చర్యాన్నీ, వింతనీ ప్రకటించడానికే ప్రజలు రావడం ఎక్కువైంది. మనిషిని రోజూ చూస్తూనే వున్నా, మనిషిలాంటి మనిషిని ఎవరైనా రూపొందిస్తే వింతగా చూడడం అన్నది జరిగేదే కదా! అందులో ఆయన కలియుగ దేవుడు! అనుకున్న ముహూర్తం దాటిపోయింది. సెట్టు తీసేసి ఖాళీ ఫ్లోర్ వప్పజెప్పాలి. కాని, కుదరడం లేదు. పుల్లయ్యగారు "ఓర్నాయినో, ఇదేందిరో" అని చిరాకు వచ్చినా చూపక, కోపం వచ్చినా తట్టుకుంటూ (వెంకటేశ్వరస్వామి కదా!) ఓర్చుకుంటున్నారు. సెట్టు ఉన్నంత కాలం - స్టుడియోకి అద్దె చెల్లించాలి. అదో పెద్ద ఖర్చు. ఈ విషయం విని - నాగిరెడ్డి గారు, "అద్దె ఏమీ కట్టవలసిన అవసరం లేదు లెండి - ఉన్నన్నాళ్లు వుండనీయండి" అన్నారు. పుల్లయ్యగారు తెరిపిన

బడినా, అర్చకులు, హారతులూ, పూలమాలలూ, పూజలూ తప్పడం లేదు. "ఓర్నాయినో! వడ్డికాసుల వాడురా బాబూ. ఎంత ఖర్చు పెట్టి సెట్టు వేశామో, అంతకు తగ్గ వడ్డీ వసూలు చేస్తున్నాడు! కానీ" అనుకున్నారు. తర్వాత నిదానంగా, ఏదో ముహూర్తం పెట్టుకుని, ఒకటీ ఒకటీ తీసేస్తూ సెట్టు ఖాళీ చేయించారు పుల్లయ్యగారు.

* * *

'వీర పాండ్య కట్టబొమ్మన్' 'కట్టబ్రహ్మన' పేరిట డబ్ అయింది. డి.వి.నరసరాజు గారు తెలుగు స్క్రిప్టు రాశారు నేను అసిస్టెంటుని. శివాజీ గణేశన్‌కి కె.వి.యస్.శర్మ గాత్రం ఇచ్చారు. డబ్బింగ్‌లో శర్మగారు ఒక పెద్ద డైలాగ్‌ని అరచి, గడగడా చెప్పేశారు. అది ఎలా వచ్చిందో వినాలని, మిక్చర్ రూమ్‌లోని వచ్చారు. భరణిలో డబ్బింగ్ గనక, కోటేశ్వరరావు గారే రికార్డ్ చేశారు. రికార్డయినది విన్న తర్వాత అంతా "బావుంది" అనుకున్నారు. "ఇంత బాగా చెప్పాను అని అందరూ అనకపోతే, ఒక మంచి ఓవల్టిన్ తెప్పించి తాగించకూడదూ?" అన్నారు శర్మగారు. (ఓవల్టిన్ ఈ తరంవారికి తెలీదేమో గాని, మంచి పుష్టి కలిగించే పానీయం అన్నమాట. విదేశం నుంచి వచ్చేది) సౌండ్ ఇంజనీర్ కోటేశ్వరరావు గారు సరదాగా, జోక్స్ వేస్తూ మాట్లాడతారు. శర్మగారు ఓవల్టిన్ అనగానే, అసిస్టెంటుని పిలిచి, ప్రొడక్షన్ రూమ్‌కి వెళ్ళి ఫిల్మ్‌డబ్బా తెమ్మన్నారు. అతను తెచ్చాడు. "శర్మగారు! ఫిల్మ్ డబ్బాలు ఇలా రౌండ్‌గా వున్న టిన్‌లలోనే వస్తున్నాయి. ఓవల్టిన్‌లో (ఓవెల్ షేప్‌లో వున్న టిన్‌లలో) రావడం లేదు, ఈ రౌండ్‌టిన్ తీసు కుంటారా?" అని చమత్కారం చేశారు- ఓవల్టిన్‌లోని 'ఒవల్'వీ 'టిన్' నీ విడగొట్టి 'పన్' కలిపి. శర్మగారితో సహా అంతా ఆనందించారు- ఆ జోక్‌కి.

* * *

ముళ్ళపూడి రమణగారి పెళ్ళి (నండూరి రామమోహనరావు గారి సోదరితో) కి విజయవాడ వెళ్ళాం. మహామహులంతా వచ్చారు. శ్రీశ్రీ, అరుద్ర, కొడవటిగంటి కుటుంబరావు, డూండీగార్లు, నేనూ మద్రాసు నుంచి వెళ్ళిన వాళ్ళం. పెళ్ళి-దగ్గర్లో వున్న గ్రామంలో. కార్లలో బయల్దేరాం. నేను ఎక్కికూర్చున్న కారు ఎక్కుతూ శ్రీశ్రీగారు "హాపెన్" అన్నారు. అర్థం కాక వెర్రివెధవలా చూశాను. మళ్ళీ ఆయన "హాపెన్" అన్నారు- చెయ్యి చూపిస్తూ. అప్పుడుగాని నా బుర్రకి ఎక్కలేదు- తాను కూడా ఎక్కికూచోవాలి గనక జరగమన్నారు. "హాపెన్" తెలుగులో 'జరుగుట' అని కదా! శ్రీశ్రీ గారు తెలుగుని ఆంగ్లంతో చమత్కరించారన్నమాట.

ఈ ట్రిప్పులోనే, ఆరుద్రగారు ఇంకో చమత్కారం చేశారు. పెళ్ళికి మేము వెళ్ళింది -గ్రామం కదా. మేము కార్లు దిగి నడుస్తూ వుంటే మధ్యలో గుడిసెల మధ్య నుంచి వెళ్ళ వలసి వచ్చింది. తలలు వంచుకుని, దూరి వెళ్తూవుంటే "ఆడ పెళ్ళివారు మగ పెళ్ళివారికి తల వంపులు తీసుకొస్తున్నారు" అన్నారు ఆరుద్ర. అందరం నవ్వు కుంటూ పెళ్ళిమంటపానికి వెళ్ళాం. వెళ్ళగానే, నేను శ్రీశ్రీగారికీ, ఆరుద్ర గారికీ చమత్కారాలు వినిపించాను. వివాహపుత్రునికి (పెళ్ళి కొడుకుకి) "అరెరె! ఈ పెళ్ళి కోడుకు వేషంవేసి నన్నూ ఇలా కూచోబెట్టేశారు - మిస్ అయిపోయానే" అన్నారు రమణగారు - ఆ జోక్స్‌ని ఆనందిస్తూ.

## సం 'గీతా' రహస్యాలు



నిర్మాతలు సుందర్‌లాల్ నహతా, డూండీలు 'శాంతి నివాసం' తీశారు. ఘంటసాల సంగీత దర్శకుడు. అయితే, అందులో నాలుగు పాటలు హిందీ పాటలకి అనుకరణలు. ఘంటసాల వంటి సంగీత దర్శకుడు హిందీ పాటలు మక్కీ కొట్టడం ఏమిటి? ఆ మాటే నేను వారిని అడిగితే, ఆయన కళ్ళు మరింత విశాలమై ఎర్రబడ్డాయి. శ్రావ్యస్వరం - తీవ్రస్వరంగా మారింది. "ఏం నన్ను మాత్రం ఆ మాట అడుగుతారు? అసలు ఆ సినిమాయే కాపీ. చాలామంది డైరక్టర్లు ఇంగ్లీషు సినిమాల్లోని షాట్స్ కాపీ కొడుతున్నారు. సీన్లు కాపీ కొడుతున్నారు. వాళ్లని అడగరేం? అవన్నీ అడక్కుండా ఒక్క సంగీత దర్శకుణ్ణే అడుగుతారేం?"

తర్వాత ఆయనే చల్లబడి, "అది క్విక్ సినిమా. నెల రోజుల్లోనే దాదాపు షూటింగ్ పూర్తి చేశారు. అందుచేత మ్యూజిక్ సెటింగ్స్‌కి, కంపోజింగ్‌లకీ టైముండదనీ, హిందీపాట వరసలు తీసు కుందామనీ నిర్మాతలు అన్నారు. అ వరసలకి పాటలు రాయించి, తొందరగా రికార్డు జరిపించవలసి వచ్చింది. అందుకని 'నేను అంగీకరించవలసి వచ్చింది" అని సవరణ ఇచ్చారు వివరణతో - ఘంటసాల మాష్టారు.

\- ఆర్కే

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం: మాయాబజార్
రచన: పింగళి నాగేంద్రరావు
సంగీతం: ఘంటసాల
గానం: ఘంటసాల, లీల
అభినయం: అక్కినేని నాగేశ్వరరావు, సావిత్రి

చిత్రం: మాయాబజార్
రచన: తంజై రామయ్యాదాస్
సంగీతం: ఘంటసాల
గానం: ఘంటసాల, లీల
అభినయం: జెమినీ గణేష్, సావిత్రి

విజయ సంస్థ యజమానులయిన నాగిరెడ్డి చక్రపాణి గార్లకు 'చందమామ'తో ఉన్న సంబంధం జగద్విదితం. అందువల్లే కావచ్చు - వాళ్ళ చిత్రాలలోని వెన్నెల దృశ్యాలు అద్వితీయంగా కనిపిస్తాయి. 'విజయావారి చిత్రాలలోని చందమామ' - చలన చిత్రాలలో చందమామ కనిపించే దృశ్యాలకు కొలతబద్ద. చందమామ అందచందాలకు ఇంతకన్నా బాగా చూపించడం కష్టం అన్నంతగా వెన్నెలపంట పండించిన విజయావారి చిత్రాలలో 'మాయాబజార్' స్థానం ప్రత్యేకమైనది. 'మాయాబజార్' లోని వెన్నెల మహిమను సృష్టించినవారు ఆ చిత్రం ఛాయాగ్రాహకులు మార్కస్ బార్ట్లీ. వెన్నెల రంగును, రుచినీ నలుపు తెలుపురంగులలో బార్ట్లీ ఆవిష్కరించిన తీరు నేటికీ కొత్తగానే అనిపిస్తుంది. 'మాయాబజార్' లోని 'లాహిరి లాహిరి లాహిరిలో' పాట సాహిత్య సంగీతాలు ఆ సన్నివేశంలో వెల్లివిరిసిన వెన్నెలతో పోటీ పడ్డాయి. 'మాయాబజార్' లోని పాటల వల్లవులే పేర్లుగా ఆ తర్వాత చలనచిత్రాలు నిర్మించడం - ఆ పాటలకు లభించిన విశేషాదరణకు గుర్తు.

అభిమన్యుడు - శశిరేఖను పౌర్ణమినాటి రాత్రి నౌకావిహారానికి రమ్మంటాడు. శశిరేఖ అభిమన్యుడితో కలిసి విహారాలు చేయడం ఆమె తల్లి రేవతికి నచ్చదు. కూతురిని ఆమె మందిరం లోనే బంధించి కావలాకు దాసీని నియమించింది రేవతి.

అయితే అభిమన్యుడు రానే వచ్చాడు. బాణం వేసి -తన రాకను శశిరేఖకు తెలియజేశాడు. 'తలుపు వేసి ఉంది ఎట్లా రాను' అని శశిరేఖ అడిగితే 'దూకేశెయ్ పట్టుకుంటా' నంటాడు అభిమన్యుడు. మళ్లీ పైకి ఎట్లా వచ్చేదని శశిరేఖ అడిగితే బాణాలతో మెట్లు అమరుస్తాడు అభిమన్యుడు. తన తల్పం మీద దిండును అక్కడ తానుపడుకొని ఉన్నట్టు భ్రమ కలిగించేలా అమర్చి, బాణాల మెట్లు దిగుతుంది శశిరేఖ. బావా మరదళ్లు హాయిగా పాడుకొంటూ నౌకా విహారం మొదలు పెడతారు. 'లాహిరి లాహిరిలో' పాట స్వరరచన రాజేశ్వరరావు చేసినా వాద్యగోష్ఠి రచన, రికార్డింగూ ఘంటసాల చేశారని ఇదివరకే చెప్పుకున్నాము. పింగళి రాసిన ఈ పాటను తెలుగు చిత్రం కోసం పాడినవారు ఘంటసాల, లీల.

శశిరేఖ, అభిమన్యుడూ నౌకావిహారం చేయడం చూసిన ఒక భటుడు వెళ్లి బలరాముడికి చెబుతాడు. బలరాముడు నదీతీరానికి వచ్చే లోగా అక్కడికి రుక్మిణితో బాటుచేరిన శ్రీకృష్ణుడు - శశిరేఖాభిమన్యులను వెళ్లి పొమ్మని రుక్మిణితో బాటు నౌకలోకి ప్రవేశించి, పాట అందు కొంటాడు. ఈ లోగా బలరాముడు, రేవతి అక్కడికి వచ్చి నౌకావిహారం చేస్తున్న రుక్మిణీ శ్రీకృష్ణులను చూస్తారు. వాళ్లు వెళ్లిపోతుంటే 'కాలమహిమ కాకపోతే రుక్మిణికి ఇంకా ఈ విహారాలేమిటి' అని ఆశ్చర్యపడుతుంది రేవతి. రుక్మిణీ కృష్ణుడూ అటు వెళ్లగానే బలరాముడు రేవతితో నౌకలో కూచుని హాయిగా పాడుతూ విహరిస్తూ ఉంటే చూచిన రుక్మిణి, 'అక్కగారికి ఎందుకండీ ఈ వయసులో విహారం?' అని భర్తను అడుగుతుంది. శ్రీకృష్ణుడు 'రసపట్టులో తర్కం కూడదు!' అంటాడు. 'మాయాబజార్' తెలుగు, తమిళ చిత్రాలలో శ్రీకృష్ణుడి పాత్ర ధరించిన వారు ఎన్.టి.రామారావు. రెండు చిత్రాలలోను రుక్మిణి పాత్ర వేసినవారు సంధ్య. తెలుగు చిత్రంలో బలరాముడి పాత్రను గుమ్మడి, రేవతి పాత్రను ఛాయాదేవి ధరించారు. తమిళ చిత్రంలో బలరాముడి పాత్ర వేసిన వారు డి.బాలసుబ్రహ్మణ్యం. ఆయనకు గడ్డం అతికితే ఇబ్బంది కలుగుతూ ఉండడం వల్ల - తమిళ చిత్రంలో బలరాముడి పాత్ర 'నిర్గడ్డం' గా కనిపిస్తుంది!

అభి : లాహిరి లాహిరి లాహిరిలో
ఓహో జగమే ఊగెనుగా
ఊగెనుగా తూగెనుగా

శశి : లాహిరి లాహిరి లాహిరిలో
ఓహో జగమే ఊగెనుగా
ఊగెనుగా తూగెనుగా
తారా చంద్రుల విలాసములతో
విరిసే వెన్నెల ఒరవడిలో

అభి : ఒరవడిలో

శశి : పూల వలపుతో ఘుమఘుమలాడే
పిల్ల వాయువుల లాలనలో ॥లాహిరి॥

అభి : అలల ఊపులో తీయని తలపులు
చెలరేగే ఈ కలకలలో

శశి : మిలమిలలో

అభి : మై మరపించే ప్రేమనౌకలో
హాయిగ చేసే విహారణలో ॥లాహిరి॥

(ఈ పాటకొనసాగింపుగా
రుక్మిణీ శ్రీకృష్ణులు పాడుకొన్న చరణాలు)

శ్రీ॥ : రసమయ జగమును రాసక్రీడకు
ఉసిగొలిపే ఈ మధురిమలో

రు॥ : మధురిమలో...
ఎల్లరి మనములు ఝల్లన చేసే
చల్లని దేవుని అల్లరిలో ॥లాహిరి॥









'లాహిరి లాహిరి లాహిరిలో' పాట సన్నివేశంలో

'మాయాబజార్' తమిళ చిత్రం కోసం తంజై రామయ్యాదాస్ రాసిన వెన్నెల పాట ఇది :

అభి : ఆహా ఇన్బ నిలావినిలే
ఓహో జగమే ఆడిడుదే
ఆడిడుదే విళైయాడిడుదే
వత్సల : ఆహా ఇన్బ నిలావినిలే
ఓహో జగమే ఆడిడుదే
ఆడిడుదే విళైయాడిడుదే
అభి : అఅఆ అఅఆ అఅఆ...
వత్సల : అఅఆ అఅఆ అఅఆ...
వత్సల : తారా చన్ద్రిగై ఉలావుమ్ నిలైయిలే
తవళుమ్ నిలవిన్ అలైదనిలే
అభి : శువై దనిలే
వత్సల : తారా చన్ద్రిగై ఉలావుమ్ నిలైయిలే
తవళుమ్ నిలవిన్ అలైదనిలే
అభి : తేన్ మలర్ మదువై సిన్దిడుమ్ వేళై
తెన్అల్ పాడుదు తాలేలో
ఇద్దరూ : ఆహా ఇన్బనిలావినిలే
ఓహో జగమే ఆడిడుదే
అభి : ఆడిడుదే విళైయాడిడుదే
వత్సల : అఅఆ అఅఆ అఅఆ...
అభి : అఅఆ అఅఆ అఅఆ...
అభి : అలైయిన్ అశైవిలే
ఆశైనినైవిలే
నిలై మఱన్దేంగుమ్ నేరత్తిలే
వత్సల : కాలత్తిలే
అభి : అలైయిన్ అశైవిలే
ఆశైనినైవిలే
నిలై మఱన్దేంగుమ్ నేరత్తిలే
వత్సల : కలైవాన్ మదిపోల్
కాదల్ పడగిలే
కాణుమ్ ఇన్బ అనురాగత్తిలే
ఇద్దరూ : ఆహా ఇన్ల నిలావినిలే
ఓహో జగమే ఆడిడుదే
ఆడిడుదే విళైయాడిడుదే...





తమిళ గీతానికి భావానువాదం :

అభి : ఆహా ఆనందపు వెన్నెలలో
ఓహో జగమే ఆడెనులే
ఆడెనులే ఆటాడెనులే
వత్సల : తారా చంద్రులు విహరించే స్థితిలో
పాకే వెన్నెల అలలలో
అభి : ఆ రుచులలో ॥ఆహా॥
అభి: తేనె పూవు మధువును చిందే వేళ
తెమ్మెర పాడెను ఏలేలో ॥ఆహా॥
అభి : అలల కదలికలో
ఆశల జ్ఞాపకాలలో
మై మరచి తపించే వేళలో
వత్సల : ఆ కాలంలో ॥ఆహా॥
కళల జాబిలిలా
ప్రేమ పడవలో
పొందే ఆనందానురాగంలో
ఇద్దరూ: ఆహా ఆనందపు వెన్నెలలో
ఓహో జగమే ఆడెనులే
ఆడెనులే ఆటాడునులే....

తమిళ భాషలో 'గొప్పగా ఉంది' అనడానికి 'ఆహా ఓహో' అన్నట్టుంది అని చెప్పడం కద్దు. 'లాహిరి లాహిరి లాహిరిలో' పాట తమిళంలోకి వచ్చేసరికి 'ఆహా ఓహో' పాట అయింది.

తెలుగు పాటలోని పూలవలపు, పిల్ల వాయువులు తమిళగీతంలో కనిపించవు. అయితే వెన్నెల పాట అంతా పరచుకొంది. 'మాయా బజార్' తమిళ చిత్రంలోని తక్కిన పాటల గురించి చెప్పుకున్న మాటలు ఈ పాటకూ వర్తిస్తాయి. అంటే - తెలుగు పాట కొలతలకు సరిపడా తమిళ గీతాన్ని సర్దుబాటు చేశారన్న మాట!

**- పి.ఎస్.గోపాలకృష్ణ**



హాసం (16-31,డిసెంబరు,03)లోని "అర్థంచేసుకుందాం - ఆస్వాదిద్దాం"లో రాసినట్టు 'మాయాబజార్'కు సాలూరి రాజేశ్వరరావుగారు నాలుగు పాటలు కంపోస్ చేసారు. కానీ 'నీవేనా నను తలచినది' ఆయన చేయలేదు. దానిని ఘంటసాల గారే స్వరపరిచారు. రాజేశ్వరరావుగారు కంపోస్ చేసిన మొదటి పాట సినిమాలోని మొదటిపాట "శ్రీకరులు దేవతలు". కె.వి.రెడ్డిగారి ప్రతి సినిమా మొదటి పాటల కంపోసింగ్ 'శ్రీ', 'జయ', 'దేవ' లాంటి శుభప్రదమైన పదాలతో ప్రారంభించటం ఆనవాయితీ. ఇలాగే "పెళ్ళినాటి ప్రమాణాలు" లో శ్రీమంతురాలివై, జగదేకవీరుని కథలో 'జయజయజయ జగదేక ప్రతాపా'. శ్రీకృష్ణార్జున యుద్ధంలో 'దేవదేవ నారాయణ'.

నాలుగు పాటల కంపోసింగ్ అయిన తర్వాత రాజేశ్వరరావుగారు 'ప్రియదర్శిని' సిచ్యువేషన్‌కు ఒక పల్లవి కంపోస్ చేసారు. శశిరేఖ పేటికను తెరవగానే అభిమన్యుడు కనిపించి



కుశలమా! కుశలమా!
నవవసంత మధురిమా!

అని పాడ్తాడు. దీనిని రాజేశ్వరరావుగారు భీంప్లాస్ రాగంలో అద్భుతంగా కంపోస్ చేసారు. మొదట సాకీగా పాడి, తర్వాత అదే స్వరాల క్రమంలో తాళంలో పాడ్తాడు.

అలా చిలిపిగా 'కుశలమా' అని పాడిన అభిమన్యునికి జవాబుగా శశిరేఖ



అంటూ సిగ్గుతో కూడిన లాలిత్యంతో పాడ్తుంది.

రాజేశ్వరరావు గారు పల్లవి మాత్రమే చేసారు. చరణం చేయలేదు.

అ తర్వాత ఎన్నోసార్లు పాటల కంపోసింగ్ టాపిక్ వచ్చినప్పుడల్లా కె.వి.రెడ్డిగారు ఈ పల్లవిని గుర్తుచేసుకుంటూ దీనిని పిక్చర్‌లో పెట్టుకోలేకపోయామే అని నాతో చెప్తూ, 'కుశలమా'లో ఉన్న 'లబ్జు', 'నీవేనా' లో రాలేదు అనేవారు.

మాయాబజార్‌కు రాజేశ్వరరావుగారు పూర్తిగా కంపోస్ చేసిన చివరి పాట 'నీకోసమె నే జీవించునది'. ఆ పాటతో విజయాసంస్థకు దూరమైన రాజేశ్వరరావుగారు మళ్ళీ 'మిస్సమ్మ'తో అదే సంస్థలో అడుగు పెట్టారు. కంపోసింగ్ మొదటిరోజున హార్మోనియం ముందు కూర్చున్న రాజేశ్వరరావు గారు అప్పుడే లోపలికి వచ్చిన పింగళి నాగేంద్రరావుగారిని చూసి "రావయ్యా పింగళి నాగేంద్రరావు ! నీకోసమె నే జీవించునది" అంటూ ఎక్కడ విడిచిపెట్టామో మళ్ళీ ఇప్పుడు అక్కడినుంచే ప్రారంభిస్తున్నాం అన్నట్టుగా చమత్కరించారు.

**-సింగీతం శ్రీనివాసరావు**

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



**పి.యస్.యస్.పవన్ గణేష్,సోమేశ్వరం,తూ॥గో॥జిల్లా**

ప్ర॥ లెక్కల మాస్టారు తన నలుగురు అమ్మాయిలకి ఏం పేర్లు పెడతారు?

జ॥ గీత,రేఖ,సరళ,బిందు

ప్ర॥ నా కంప్యూటర్ గదిలో ఎప్పుడూ పిల్లి కాచుక్కూర్చుంటుంది. ఎందుకు?

జ॥ అక్కడ "మౌస్" ఉంటుంది గనుక.

**రమణ శాస్త్రి,సంగారెడ్డి**

ప్ర॥ తెగిన చెప్పు మీద కోపమొచ్చేదెప్పుడు?

జ॥ అవి తెగినప్పటి కంటే, దాంతో నడుస్తుండగా తెల్సిన వాళ్ళు ఎదురొచ్చినప్పుడు.

**ఎన్.గాయత్రి,విశాఖపట్నం**

ప్ర॥ ఉపకార వేతనం అనగా....?

జ॥ ఉప్పు మరియు కారం కొనుక్కోవటానికి యిచ్చే జీతం.

## ఈ రూటేవేరు



| | | |
|---|---|---|
| అనితరసాధ్యం | = | అనితకు తప్ప మరెవరికీ సాధ్యం కానటువంటిది |
| సిటిజన్స్ | = | సిటీలో ఉండే జనులు |
| విభక్తి | = | విడి విడిగా భక్తి కల్గియుండుట |

**-భమిడిపాటి వెంకటేశ్వరరావు,చందానగర్**



## చిలిపి లిపి



Key T Key - కిటికి

Bun గా Rum - బంగారం

**-పి.వి.పవన్ కుమార్, గచ్చిబౌలి, హైదరాబాద్**

1పేపరు రాసి 2 దారాలు తీసుకొని 3ముళ్లువేసి 4 మార్కులు వచ్చిన 5 మందికి 6వాడు తోడై 7స్తుంటే 8వతేదీ 9 గంటలకు 10వతరగతికి మళ్లీ పరీక్షా?!

**-పి.చంద్రశేఖర శాస్త్రి, అనంతపురం**

## పేరు - రిపేరు



ఔను వాళ్లిద్దరూ ఇష్టపడ్డారు - ఒకరికి ఒకరు - కలుసుకోవాలని - ఉత్సాహం - ఉల్లాసం - ఆనందం

**-రాధాకృష్ణారెడ్డి , రెడ్డికాలని, హైదరాబాద్**

అతను - బడిపంతులు - ఆమె - పంతులమ్మ - సంతానం - రేపటిపౌరులు

నాన్నగారు - నిప్పులాంటి మనిషి - అబ్బాయిగారు - ఎదురులేనిమనిషి

**-బి.చంద్రశేఖరయ్య,రామసముద్రం**

నీకే మనసిచ్చాను - సారీ నాకు పెళ్లైంది

**-పక్కి చక్రవర్తి,గరివిడి,విజయనగరం జిల్లా**

## చిలిపి కవిత



ఎలక్షన్స్‌లో ఎక్కడ లాభమో
అక్కడికే జంపింగ్
ఓట్లకోసం మొదట హంటింగ్
ఓడుతామేమోనని రిగ్గింగ్
ఎదురు తిరిగితే బాంబింగ్
గెలిస్తే అసెంబ్లీలో బాక్సింగ్
ఏంచేస్తాం...!? ఈ రోజుల్లో
డబ్బున్నవాడే కింగ్
మన పని కేవలం గివింగ్...!!
నో టేకింగ్...!!!

-తెలికిచర్ల రామకృష్ణ, విజయనగరం

## డబుల్ రోల్



పంకజనాభా ఇది ఏమి జనాభా
మా సుధ యీ వసుధలోగల వారందరిలోకి అందగత్తె

-కూచిభోట్ల జయచంద్ర, హైదరాబాద్

కరికి కరివేపాకు ఏపాటి?
ఈదురుగాలికి కొట్టులోని కాగితాలు కొట్టుకుని పోతున్నాయి.

-సి.వి.యల్.ఆర్.మోహన్, విశాఖపట్నం.

## షార్ట్‌కట్స్




గోనెల చిరంజీవి = గోచి
గోపరాజు లక్ష్మణ్ = గోల

-అడివి లలితశ్రీ, విజయనగరం

పూడిపెద్ది రీమాదేవి = పూరీ
దోరగుంట శమంతకమణి = దోశ
గానాబత్తుల రెడ్డప్ప = గారె
వరవరరావు డబ్బారేకుల = వడ

-పక్కి చక్రవర్తి, గరివిడి.

## పేరడీ పెరేడ్



చదువు రాని వాడినని దిగులు చెందకూ
ఎలా బ్రతకాలో నేర్పలేని చదువులెందుకూ
చదువు రాని వాడినని దిగులు చెందకూ....
ఏమి చదివి వీరప్పన్ అడవి దోచెను
ఏ చదువు వల్ల బిన్‌లాడెన్ టవరు కూల్చెను
హాజీ మస్తాను కెవరు దగా నేర్పెను ॥హాజీ॥
ఛార్లెశ్శోభారాజుకెవరు మరి స్మగ్లింగ్ నేర్పెనూ..
చదువు రాని వాడినని దిగులు చెందకూ...
ఎలా బ్రతకాలో నేర్పలేని చదువులెందుకూ ॥చదువు॥

అక్రమాలు, ఆగడాలు చేయడమే నేర్చుకో
వంచనతో కొంపలను కూల్చడము నేర్చుకో
చదువులతో పనియేమి డబ్బులున్నచాలు
చదువులతో పనియేమి డబ్బులున్న చాలూ...
కాగితంపు డిగ్రీ కన్న కరెన్సీయే మేలూ
చదువురాని వాడినని దిగులు చెందకూ..
ఎలా బ్రతకాలో నేర్పలేని చదువులెందుకూ ॥చదువు॥

(ఆత్మబంధువు చిత్రంలో చదువురాని వాడినని దిగులు చెందకూ.. పాటకు పేరడీగా)

-పులిపాక తాజుద్దీన్, జయపూర్

ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన పులిపాక తాజుద్దీన్ (జయ పూర్, ఒరిస్సా) గారికి శ్రీ గజల్ శ్రీనివాస్ 'నేను-నాఇల్లు' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.



# హాస్యం సినీగీతకోశం 2003

(గత సంచిక తరువాయి)

## హరివిల్లు

విడుదల తేదీ: 02.04.2003 దర్శకత్వం : బి.నరసింగరావు బ్యానర్: సురేష్ ప్రొడక్షన్స్

ఈ చిత్రంలో పాటలు లేవు

## కార్తీక్

విడుదల తేదీ: 03.04.2003 దర్శకత్వం : మురళీరాజా బ్యానర్: మహతి ఎంటర్ ప్రైజెస్ నెట్‌వర్క్ ప్రైవేట్ లిమిటెడ్ సంగీతం : శశిప్రీతమ్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ఆనందం ఈ బంధం | శ్రీకాంత్ | శ్రీకాంత్ |
| 2.మాగస నీపస | ------- | ఉష, శశిప్రీతమ్ |
| 3.ఈ రేయి ఈ హాయి | శ్రీధర్ | సందీప్ భౌమిక్,ఉష |
| 4.అణువణువు లో | శశిప్రీతమ్ | నిత్య |
| 5.మనసు మనసు కోసం | శ్రీధర్ | భీంశంకర్ |
| 6.చలిగాలిలో | రవికిరణ్ | శశిప్రీతమ్, సరిత |

## దిల్

విడుదల తేదీ: 05.04.2003 దర్శకత్వం :వి.వి.వినాయక్ బ్యానర్: శ్రీ వెంకటేశ్వర క్రియేషన్స్ సంగీతం : ఆర్.పి.పట్నాయక్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.పెద్దలొద్దంటున్నా ప్రేమ తప్పని అన్నా | పెద్దాడ మూర్తి | శ్రీరాం,చిత్ర |
| 2.ఎందుకో ఏమిటో తొలిసారి నా గుండెలో | కులశేఖర్ | ఆర్.పి.పట్నాయక్ |
| 3.తమలపాకు నెమలీసోకు | సుద్దాల అశోక్‌తేజ | ఆర్.పి.పట్నాయక్,ఉష |
| 4.అమ్మా ఆవు ఇల్లు ఈగ | చంద్రబోస్ | బాలు,ఉష |
| 5.సియం,పియం అవ్వాలన్నా ఆశలేదు | చంద్రబోస్ | కె.కె |
| 6.ఒకనువ్వు ఒకనేను ఒక జంటై కలిశాము | లినారె సుకుమార్ | కె.కె |
| 7.గాజులు ఘల్లుమన్నవే పిట్టనడుము సత్తెమ్మ | టి.ఉమామహేశ్వరరావు | ఆర్.పి.పట్నాయక్,ఉష |

## తారక్

విడుదల తేదీ: 11.04.2003 దర్శకత్వం : బాలశేఖరన్ బ్యానర్:విజయ కృష్ణ సంగీతం :మణిశర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.మెల్లంగరా ఓ చిన్ని కృష్ణుడా | శక్తి | ఉదిత్‌నారాయణ్,సునీత |
| 2.వానాకాలాన్ని ఎండాకాలాన్ని కలిపేదే సోదరా వింటర్ | చంద్రబోస్ | మనో |
| 3.సరసమిక సండే మధువులిక మండే | చంద్రబోస్ | టిప్పు,సుజాత |
| 4.అలకలు ఏలా రావే చిలుకా | సాయిహర్ష | జె.ఏసుదాస్ |
| 5.ఏస్కో ఏస్కో ఏస్కో నామీద చెయ్యేస్కో | చిర్రావూరి విజయకుమార్ | కార్తీక్,రాధిక |
| 6.వెన్నెలా కలా నిజమా | వేటూరి | చరణ్,నిత్యసంతోషిణి |

## ఐతే

విడుదల తేదీ: 11.04.2003 దర్శకత్వం : చంద్రశేఖర్ పలేటి బ్యానర్:జస్ట్‌ఎల్లో ప్రైవేట్‌లిమిటెడ్ సంగీతం : కళ్యాణీ మాలిక్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.చిటపటచినుకులు అరచేతుల్లో ముత్యాలైతే | సీతారామశాస్త్రి | కీరవాణి |

# ఒట్టేసి చెబుతున్నా

విడుదల తేదీ: 11.04.2003 దర్శకత్వం : ఇ.సత్తిబాబు బ్యానర్:శ్రీక్రియేషన్స్ సంగీతం : విద్యాసాగర్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ఒట్టేసి చెపుతున్నా వింటున్నావా | చంద్రబోస్ | గోపాల్,శ్రీనిధి |
| 2.ఏలో ఏలో ఏలూరోడా ఏస్కో ఏస్కో గోలీసోడా | భువనచంద్ర | ఉదిత్‌నారాయణ్,సుజాత |
| 3.పదహారేళ్ళ పాపా నీకు ఏదిష్టం | చంద్రబోస్ | దేవాషిష్,సుజాత |
| 4.వెన్నెల్లో వేసవికాలం ఎండల్లో శీతాకాలం | వేటూరి | బాలు,సాధనా సర్గమ్ |
| 5.కన్నతల్లి భూదేవి ఉన్న తండ్రి ఆకాశం | వేటూరి | బాలు |
| 6.బందరు లాంటి బస్తీలో | వేటూరి | శంకరమహదేవన్,సుజాత |

# అమ్మ నాన్న ఓ తమిళ అమ్మాయి

విడుదల తేదీ: 18.04.2003 దర్శకత్వం : పూరీజగన్నాధ్ బ్యానర్: వైష్ణో అకాడమీ సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.చెన్నై చంద్రమా మనసే చేజారి | కందికొండ | చక్రి |
| 2.లంచ్ కొస్తావా మంచ్ కొస్తావా | సాహితి | చక్రి,కౌసల్య |
| 3.నీవే నీవే నీవే నేనంటా నీవే లేక నేనే లేనంటా | పెద్దాడ మూర్తి | చక్రి |
| 4.జుమ్ జుమారే జుమ్ | చంద్రబోస్ | కౌసల్య |
| 5.చుమ్మా చుమ్మాదె చుమ్మా | భాస్కరభట్ల | రవివర్మ,కౌసల్య |
| 6.తళుకు తళుకు తళుకుమంది సరుకు | భాస్కరభట్ల | రఘుకుంచే,స్మిత |

# ప్రియదర్శిని

విడుదల తేదీ: 18.04.2003 దర్శకత్వం : ధవళ మల్లిక్ బ్యానర్::మిలీనియమ్ మూవీ మేకర్స్ సంగీతం : మణిశర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.నా ప్రాణమా ఐ లవ్ యూ | వెన్నెలకంటి | మురళి,గాయత్రి |
| 2.కాలేజికి సెలవులు టీనేజీకి శిలువలు | వెన్నెలకంటి | హరీష్ |
| 3.లవ్ వైరస్ టూ డేంజరస్ | విశ్వ | విశ్వ |
| 4.అందమంటే నువ్వేలే అభివందనాలు నీకేలే | వెన్నెలకంటి | దేవన్ |
| 5.మాటలకే అందనిది మనసున మౌనమిది | వెన్నెలకంటి | శ్రీనివాస్, ప్రసన్న |
| 6.కాలేజి గేటుకాడ బీటు వేసిన | ధవళమల్లిక్ | కృష్ణదాసు, దేవిశ్రీప్రసాద్ బృందం |

# జానీ

విడుదల తేదీ:25-04-2003 దర్శకత్వం : పవన్ కళ్యాణ్ బ్యానర్: గీతా ఆర్ట్స్ సంగీతం : రమణగోగుల

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.లెట్స్ గో జానీ జానీ... జానీ | రమణగోగుల | రమణగోగుల |
| 2.నారాజు గాకుర మా అన్నయ్యా | మాష్టార్జీ | రమణగోగుల |
| 3.నువ్వు సారా తాగుట మానురో అన్న | మాష్టార్జీ | పవన్‌కళ్యాణ్ |
| 4.ఏ చోట నువ్వున్నా నీ వెంట వస్తున్న | సిరివెన్నెల | రాజేష్,నందిత |
| 5.కూల్ అండ్ లవ్లీ | రమణగోగుల | రమణగోగుల |
| 6.ఈ రేయి తీయనిది | సిరివెన్నెల | హరిహరన్,నందిత |
| 7.రావోయి మా ఇంటికి | మాష్టార్జీ | పవన్‌కళ్యాణ్ |
| 8.ధర్మార్ధ కామములలోన ఏనాడు | సిరివెన్నెల | రాజేష్ |
| 9.నాలో నువ్వొక సగమై, నేనొక సగమై | చంద్రబోస్ | కె.కె,ఉష |

# హైటెక్ స్టూడెంట్స్

విడుదల తేదీ: 02.05.2003 దర్శకత్వం : ఎ.ప్రకాశరావు బ్యానర్:ఎస్.ఎం ఆర్ట్స్ సంగీతం : సాయి లక్ష్మణ్-రాజ్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ఓ మైనా.... ఓమైనా | సాయిమాధవ్ | మనో,సునీత |
| 2. సిరులొలికే మా సీతమ్మ | యన్.సత్యనారాయణ | ఎస్.పి.బాలు, సునీత |
| 3. సోనా..సోనా...ఆడేద్దాం | నడిమింటి సత్యనారాయణ | రవివర్మ, ఉష |
| 4. నీ దరికి చేరాము | నడిమింటి సత్యనారాయణ | రామక్రిష్ణ |
| 5. హైటెక్కు తొక్కుడు బిళ్ల | సాయి మాధవ్ | శ్రీకాంత్,ఉష |
| 6. ఏవిటిరా బాసు | సాయి మాధవ్ | మనో, సునీత |

# బ్రహ్మచారులు

విడుదల తేదీ: 03.05.2003 దర్శకత్వం : రవి చావలి బ్యానర్:చావలి క్రియేషన్స్ సంగీతం : శ్రీధర్-శంకర్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.యాదవన్నా....యాదవన్నా యాదవన్నా | కలువకృష్ణసాయి | సాందీప్,నిత్యసంతోషిణి |
| 2.చీరాల చిన్నది | కలువకృష్ణసాయి | భీమశంకర్, కౌసల్య. |
| 3.ఓసి నీ యంకమ్మా ఆపవే నీ ప్రేమా | కలువకృష్ణసాయి | రవివర్మ, నిత్య సంతోషిణి |
| 4.ప్రేమన్నది ఎంతటి మాయ గురుడా | కలువకృష్ణసాయి | శ్రీధర్,కోరస్ |
| 5.కూతేసి వస్తుందండి | కలువకృష్ణసాయి | టిప్పు, కోరస్ |
| 6.ముద్దుగా ఉన్నావే మోనాలిసా | కలువకృష్ణసాయి | రమణ, శ్రీకాంత్, రవి చావలి |

# విజయం

విడుదల తేదీ: 09.05.2003 దర్శకత్వం :సింగీతం శ్రీనివాసరావు బ్యానర్:సురేష్ ప్రొడక్షన్స్ సంగీతం : కోటి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.నిజమేనా నిజమేనా నే విన్నది నిజమేనా | సిరివెన్నెల | కార్తిక్,శ్రీయాగోషాల్ |
| 2.ఏజీ ఓజీ సునోజీ ముద్దు స్టైల్స్ చెపుతా | భవనచంద్ర | నాగూర్‌బాబు |
| 3.హంపిలో శిల్పాలు ఆర్టీసిబస్సెక్కి | చంద్రబోస్ | రాజేష్ |
| 4.కుశలమా ఓ ప్రియా కుశలమా | భువనచంద్ర | రాజేష్,చిత్ర |
| 5.నీతో నిండునూరేళ్ళు తోడే ఉండనీ చాలు | సిరివెన్నెల | టిప్పు,సునీత |
| 6.మేఘాల పల్లకీ అడగనా | కులశేఖర్ | టిప్పు,శ్రీయగోషాల్ |
| 7.ఎందుకో ప్రేమలో ఇంత ఆరాటం | సినారె | ఎస్.పి.బాలు |

# అప్పుడప్పుడు

విడుదల తేదీ: 16.05.2003 దర్శకత్వం : చంద్ర సిద్దార్థ బ్యానర్:జి.బి.ఫిలింస్ సంగీతం : ఆర్.పి.పట్నాయక్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.వహ్..వ వహవ | చైతన్య ప్రసాద్ | నటాషా,గుల్‌మొహర్ |
| 2.నీకలలు కావాలి ఇలా కలిసి పోవాలి | చైతన్య ప్రసాద్ | ఆర్పీ,సునీత |
| 3.నీకేం తెల్సూ నిమ్మకాయ పులుసు | చైతన్య ప్రసాద్ | ఆర్పీ,సునీత |
| 4.ఇదిగో ఇపుడే ఎదిగిన ప్రేమా | పెద్దాడ మూర్తి | ఆర్పీ,ఉష |
| 5.గుడుగుడు గుంచెం గుండే రాగం | పెద్దాడ మూర్తి | ఉష,లెనినా, గాయత్రి,రవివర్మ |
| 6.నందలాలా...నందలాలా మురిపాల గోపాలా | పెద్దాడ మూర్తి | ఆర్పీ,ఉష |

# మా బాపు బొమ్మకు పెళ్ళంట

విడుదల తేదీ: 16.05.2003 దర్శకత్వం : రవిరాజా పినిశెట్టి బ్యానర్:స్వర్ణచిత్ర సంగీతం : కోటి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.మావి చిగురు కోయిలా మనసు పూలరేకులా | సాహితి | సందీప్ భౌమిక్,ఉష |
| 2.కపటమెరుగని పాపలా | సురేంద్రకృష్ణ | గంగాధర్ |
| 3.మాటలే రానివేళ పాట ఎలాపాడను | సురేంద్రకృష్ణ | ఉష |
| 4.భూదేవమ్మకు బొట్టె మెరిసే ఊరేమాదా | సాయిశ్రీహర్ష | సునీత |
| 5.పూల గువ్వవా నువ్వు పాల బువ్వవా | సాహితి | మురళి,నిష |

# ఉషా కిరణాలు

విడుదల తేదీ: 16.05.2003 దర్శకత్వం : మల్లం రమేష్,అమర్‌నల్లా బ్యానర్:శ్రీ సాయి సూర్యచంద్ర ప్రొడక్షన్స్ సంగీతం :ఎమ్.రత్నం

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.సూర్యునిలోని తొలిచూపులు మేఘాలలోని మెరుపు రేఖలు | ఎమ్.రత్నం | గిరి & కోరస్ |
| 2.నిన్ను నన్ను వేరుచేసే ఈ కాలమేనని | వడ్డేపల్లి కృష్ణ | నితిష్ నారాయణ్,ఉష |
| 3.మనసు మనసు కలుసుకున్నచోట | ఎమ్.రత్నం | బాలు,ఉష |
| 4. జయం జయం (2) తప్పదింక విజయం | ముల్కపల్లి రవి | చలపతి రాజు |
| 5.చిన్నవాళ్ళమని అంటే మేము ఒప్పుకోం | దామోదర్ శ్రీవాణి | మృదుల,పద్మిని,పద్మశ్రీ |
| 6.తూర్పుకొండల్లో సూర్యుడు దిక్కున లేచిండు | కాసర్ల శ్యాం | వరంగల్ శంకర్ & కోరస్ |

## శాంభవి IPS

విడుదల తేదీ: 17.05.2003 దర్శకత్వం : నాగేశ్వరరావు కె.ఎస్ బ్యానర్ : మనీమూవీ మేకర్స్ సంగీతం :గోవర్ధన్

| | | |
|---|---|---|
| 1.అబ్బా అబ్బబ్బా నీ అందమే అబ్బా పిల్లా నిన్నిట్టా చెక్కిందెవరబ్బా | భాస్కరభట్ల | టిప్పు,మాల్గాడి శుభ |
| 2.అయిగిరి నందిని నందిత మోహిని | భాస్కరభట్ల | బృందగానం |

## ఆయుధం

విడుదల తేదీ: 22.05.2003 దర్శకత్వం : ఎన్.శంకర్ బ్యానర్:పూర్ణోదయ ప్రొడక్షన్స్ సంగీతం :వందేమాతరం శ్రీనివాస్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ఇదేవిటమ్మా మాయా మాయా | చిన్నిచరణ్ | కుమార్‌సాను, నిష్మా |
| 2.వైయ్ రాజు కన్నుల్లో నువ్వే | భీమ్స్ | ఉదిత్‌నారాయణ,ఉష |
| 3.మేఘాలే ఈ వేళ చుక్కల్లే రావాలా | వరంగల్ శ్రీనివాస్ | శంకరమహదేవన్,స్వర్ణలత |
| 4.బంగారు బొమ్మరావే పందిట్లో పెళ్ళి నేడే | సుద్దాల అశోక్‌తేజ | వందేమాతరం,ఉష |
| 5.అబ్బఏం నడుమయ్యో ఓరి నాయనో | శ్రీవారే | శంకరమహదేవన్,అనూరాధా శ్రీరామ్ |
| 6.రంగారెడ్డి జిల్లాకన్నా విశాలమైనది హృదయం | పద్మాశ్రీనివాస్ | ఉదిత్‌నారాయణ్,కల్పన |

## నిజం

విడుదల తేదీ: 23.05.2003 దర్శకత్వం : తేజ బ్యానర్:చిత్రం మూవీస్ సంగీతం :ఆర్.పి.పట్నాయక్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.చందమామ రావే... జాబిల్లి రావే | కులశేఖర్ | ఆర్పీ,ఉష, కోరస్ |
| 2.రత్తాలు రత్తాలు... నూజివీడు రసాలు | కులశేఖర్ | ఆర్పీ,తేజ,మహేష్‌బాబు,ఉష, మణిచందన |
| 3.నీలో ఉన్నది నేనేనా... నేనేనా | కులశేఖర్ | ఆర్పీ,ఉష |
| 4.ఛీఛీ అంటే ఛీఛీ అంటవు | కులశేఖర్ | ఆర్పీ,ఉష |
| 5.దండకం | కులశేఖర్ | గంగాధరశాస్త్రి, గోపిచంద్ |
| 6.కాకులు దూరని కారడవి చీమలుదూరని | కులశేఖర్ | ఆర్.పి,రవివర్మ కోరస్ |
| 7.ఇలాగే ఇలాగే ఇలాగే | కులశేఖర్ | ఆర్పీ,ఉష |
| 8.అభిమన్యుడు కాడు వీడు అర్జునుడూ కాడు | కులశేఖర్ | గ్రూప్ సాంగ్ |
| 9.చరచర పాకింది గజగజ వణికాను | కులశేఖర్ | ఉష,మూర్తి, గోపి, రాశి |
| 10.రంగు రంగుల ముగ్గులు... ముగ్గులు | కులశేఖర్ | ఆర్పీ కోరస్ |

## పలనాటి బ్రహ్మనాయుడు

విడుదల తేదీ: 05.06.2003 దర్శకత్వం : బి.గోపాల్ బ్యానర్:శ్రీ వెంకట రమణ ప్రొడక్షన్స్ సంగీతం :మణిశర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. గుండమ్మో గుండమ్మో గుండుమల్లే చెండమ్మో | వెన్నెలకంటి | బాలు, కల్పన |
| 2. బృందావనములో గోపమ్మల్లె | భువనచంద్ర | మల్లికార్జున్,కల్పన |
| 3. బందర్లో బస్టాండులో నిన్ను చూశాక | వేటూరి | శంకర్‌మహదేవన్, చిత్ర |
| 4. ఓ సోసి పూలతీగ ఆడుకుందామా సరదాగా | భువనచంద్ర | ఉదిత్‌నారాయణ్, సుజాత |
| 5. సరసాల సుందరయ్యో నువ్వంటే ప్రాణమయ్యా | భువనచంద్ర | కార్తీక్, రాధిక, పూర్ణిమ |
| 6. పలకాబలపం ఛలో పట్టేస్తానే | భువనచంద్ర | మనో, షాలిని |

## నిన్నే ఇష్టపడ్డాను

విడుదల తేదీ: 12.06.2003 దర్శకత్వం : కొండా బ్యానర్:శ్రీ దుర్గా ఆర్ట్స్ సంగీతం :ఆర్.పి.పట్నాయక్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.అమ్మాయే బౌలింగ్ చేస్తే అబ్బాయే క్లీన్ బౌల్డ్ | చంద్రబోస్ | కె.కె,ఆలీ |
| 2.కృష్ణాజిల్లా మరదలు పిల్లా | కులశేఖర్ | రవివర్మ,ఆర్.పి |
| 3.నీతోనే నే...రానా | సిరివెన్నెల | ఎస్.పి.చరణ్,కౌసల్య |
| 4.ఏమంటావే ఓ మనసా నీకెందుకే ఇంత అలుసా | సిరివెన్నెల | బాలు,చిత్ర |
| 5.కుకుకుకుకు ఎద కోయిల పాడే | సిరివెన్నెల | బాలు,చిత్ర |
| 6.జుంబాయ్ బాయ్ బాయ్ | సాయిశ్రీహర్ష | మాల్గాడిశుభ,ఆర్పీ |
| 7.నిముషం నిలవనంత పరుగెందుకంట | సిరివెన్నెల | ఆర్పీ |

# అమ్ములు

విడుదల తేదీ: 14.06.2003 దర్శకత్వం : ఎల్.శ్రీనాథ్ బ్యానర్:శ్రీ సాహితీ చిత్ర సంగీతం :వందేమాతరం శ్రీనివాస్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ఆంధ్రా ఆటో డ్రయివర్లం మేమే | గుండవరపు సుబ్బారావు | వందేమాతరం,ఉష |
| 2.పెళ్ళెప్పుడవుతుంది బాబు... మంచిపిల్ల | గుండవరపు సుబ్బారావు | వందేమాతరం,హరికిషన్,లీలావతి |
| 3.మమ్మీ మమ్మీ... డాడీ...డాడీ | గుండవరపు సుబ్బారావు | శృతిమంజుల |
| 4.ఎండాకాలం బీరు మంచిదిరో | గుండవరపు సుబ్బారావు | వందేమాతరం,భోగరాజు హంసానంది |
| 5.దివ్వె దివ్వె నడుమ దీపావళీ పండుగనేడే | గుండవరపు సుబ్బారావు | ఉదిత్‌నారాయణ్ |
| 6.దేఖో అల్లా రూపాయి బిళ్ల | గుండవరపు సుబ్బారావు | శంకరమహదేవన్,గూడ అంజయ్య |
| 7.దేవుడా... ఓ దేవుడా | గుండవరపు సుబ్బారావు | శ్రీకుమార్ |
| 8.బొంబాయెమె ముంబాయి అయ్యో | చంద్రబోస్,గుండవరపు సుబ్బారావు | వందేమాతరం శ్రీనివాస్ |
| 9.చిట్టి అమ్ములు... చిన్ని నాన్నలు | సుద్దాల అశోక్ తేజ | శ్రీకుమారి, శ్రీదేవి దరహాస్ & సాధన |

# ఒక రాజు ఒక రాణి

విడుదల తేదీ: 20.06.2003 దర్శకత్వం : యోగి బ్యానర్:ఉషాకిరణ్ మూవీస్ సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.స్వరాలవీణ ఈ వేళలోన నీకేమయిందే ఆకాశమా | త్రివిక్రమ్ శ్రీనివాస్ | చక్రి |
| 2.వెన్నెలే నువ్వనీ విరహమే నేనని | త్రివిక్రమ్ శ్రీనివాస్ | చక్రి,కౌసల్య |
| 3.కలలు కంటాను నేనీ వేళ | త్రివిక్రమ్ శ్రీనివాస్ | కౌసల్య |
| 4.మన్నుతినే చిన్నతనం కాదమ్మా | త్రివిక్రమ్ శ్రీనివాస్ | ఉదిత్‌నారాయణ్,కౌసల్య |
| 5.నిదురించే రాతిరిలో | త్రివిక్రమ్ శ్రీనివాస్ | మతిన్,కౌసల్య |
| 6.నా ప్రాణం నాప్రణయం అన్నీ నువ్వే | త్రివిక్రమ్ శ్రీనివాస్ | చక్రి |

# దొంగరాముడు & పార్టీ

విడుదల తేదీ: 26.06.2003 దర్శకత్వం : వంశీ బ్యానర్:శ్రీ కీర్తి క్రియేషన్స్ సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.సిరి సిరి మల్లేనా...జల్లేనా | పెద్దాడ మూర్తి | బాలు,సుజాత |
| 2.ప్రేమే... పంచమి వెన్నెల | పెద్దాడ మూర్తి | బాలు,సుజాత |
| 3.చలి రాతిరి వస్తావని | తనికెళ్ళశంకర్ | శ్రీనివాస్,సుజాత |
| 4.ఏదో ఏదో తియ్యని దాహం | సాయిశ్రీహర్ష | బాలు,సుజాత |
| 5.కళ్ళలోనే నువ్వు | బొమ్మకంటి | బాలు,సుజాత |
| 6.వన్నెలున్న నారి | తనికెళ్ళ శంకర్ | బాలు,సుజాత |

# సింహాద్రి

విడుదల తేదీ: 09.07.2003 దర్శకత్వం :ఎస్.ఎస్.రాజమౌళి బ్యానర్:విజయ మారుతి క్రియేటివ్స్ సంగీతం :కీరవాణి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.చీమ చీమ చీమ | వేటూరి | ఎస్.పి.చరణ్, గంగ, బ్రహ్మానందం |
| 2.అమ్మైనా నాన్నైనా | సిరివెన్నెల | కళ్యాణీమాలిక్ |
| 3.చిరాకు అనుకో పరాకు అనుకో | చంద్రబోస్ | ఎస్.పి.చరణ్, చిత్ర |
| 4.నువు విజిలేస్తే ఆంధ్రాసోడాబుడ్డీ | చంద్రబోస్ | టిప్పు,చిత్ర |
| 5.చిన్నదమ్మే చీకులు కావాలా | వెన్నెలకంటి | మనో,శ్రీయాగోషల్ |
| 6.నన్నేదో సెయ్యమాకు | చంద్రబోస్ | కీరవాణి,సునీత |
| 7.సింగమలై... | వేటూరి | కళ్యాణీమాలిక్, బృందం |

# వసంతం

విడుదల తేదీ: 11.07.2003 దర్శకత్వం : విక్రమన్ బ్యానర్:శ్రీ సాయి దేవా ప్రొడక్షన్స్ సంగీతం :ఎస్.ఎ.రాజ్‌కుమార్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.జాంపండువే దోర జాంపండువే | వేటూరి | ఉదిత్ నారాయణ్,సుజాత,కోరస్ |
| 2.నిను చూడక ముందర తెలియదులే | కులశేఖర్ | హరిహరన్ |
| 3.అమ్మో అమ్మాయేనా ఎల్లోరా శిల్పమా | కులశేఖర్ | హరిహరన్, సుజాత,కోరస్ |
| 4.గాలీ చిరుగాలీ నిను చూసినదెవరమ్మా | సిరివెన్నెల | చిత్ర,కోరస్ |
| 5.గోదారల్లే పొంగె నాలో సంతోషం | కులశేఖర్ | బాలు కోరస్ |
| 6.ఓ...జాబిలి విన్నావా పాటని నీ నీడలో కలకాలం సాగనీ | కులశేఖర్ | చిత్ర,కోరస్ |
| 7. ఓ లాలీ పాపాకి లైనే వేస్తే తప్పేంకాదయ్యో | చంద్రబోస్ | శంకర్‌మహదేవన్ |

- (వచ్చే సంచికలో మరికొంత)

జనవరి 29 వేటూరి సుందరరామమూర్తి పుట్టినరోజు సందర్భంగా...

# అక్షరం ఆయన లక్షణం



అవును... అక్షరం ఆయన లక్షణం
సరస్వతీ కటాక్షం పొందిన అక్షర బ్రహ్మ ఆయన
శ్రీ కళలు నింపుకున్న శ్రీనాథుడాయన
విశాలాక్షిలా విశ్వాన్ని వీక్షించినా కవితా
విస్ఫులింగాలను విరజిమ్మగల విరూపాక్షుడాయన
అందుకే అక్షరం ఆయన లక్షణం.
'జగతికి సుగతిని సాధించిన తల దిగంతాల కవతల
వెలిగేతల' అంటూ విన్యాసాలు చేసినా
'అచ్చెరువున అచ్చెరువున' అంటూ ముక్కున
వేలేయించినా
'నడుం మీద జడకుప్పెల టెన్నీసు, గుచ్చుతోంది ప్రేమ
పిన్నీసు ఓ సీతా నా కవితా నేనేలే నీ మాతకు జామాత'
అంటూ చమత్కరించినా
'నిన్నటి రైకల మబ్బుల్లో చిక్కిన చంద్రుళ్ళు' అంటూ
శృంగారం రంగరించినా
'నువ్వు పట్టుచీర కడితే ఓ పుత్తడిబొమ్మా ఆ కట్టుబడికి
తరించేను పట్టుపురుగుజన్మ' అంటూ నవ్యంగా వర్ణించినా
'పిల్లన గ్రోవికి నిలువెల్ల గాయాలు అల్లనమ్రోవికి తాకితే
గేయాలు' అంటూ గుండెను జలదరింప చేసినా
'మా జనని ప్రేమధమని' అంటూ కళ్ళను చెమరింపచేసినా
'ప్రతి భారత సతి మానం చంద్రమతీ మాంగల్యం'
అంటూ మనసు పునాదుల్ని కుదిపేసినా
'గుజ్జు రూపమున కుమిలిన కుబ్జను బుజ్జగించి లాలించి
సొగసిడి, మజ్జగాలకు ముద్దబంతిలా' అటూ జకార
ప్రాసలతో పరవశింపచేసినా
'హనుమ ఎదలో భక్తి ఇనుమడించిన పేరు' అంటూ
స్పందింపచేసినా
'యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ హార్ట్స్ వుయ్ హావ్ లైక్
ఇండియన్ నమస్తే' అంటూ ఎల్లలకు వెల్లవేసి
ఎల్లరికీ వెల్లడించినా
'త్యాగరాజకృతిలో సీతాకృతి దాల్చిన నీ సొగసు
చూడతరమా' అంటూ దివ్యంగా వర్ణించినా
'గోపాల మసజసతతగా శార్దూలా' అంటూ
నవ్యాతినవ్యంగా ఛాందసించినా
ఆ కలానికే చెల్లింది.
అందుకే అంతకుముందు పాటరాసే
పద్ధతులెన్నిటికో కాలం చెల్లింది.
ఆయన మాటే పాటై, జనం
నోట పరిపాటై చెల్లింది.
జీవం ఆయువుపట్టు
తెలుసుకున్న వాడు
ధన్వంతరి
అయితే
శబ్దం వాయువు పట్టు తెలిసిన
ధ్వని అంతర్వేది ఈయన.
ఆరోహణలే తప్ప అవరోహణలు
లేని వైకుంఠపాళి - ఆయన పాళి.
అందుకే పెన్నులో పెన్నానదిని నింపుకుని
'పాట' లీపుత్ర రాజ్యాన్ని తన ప్రతిభా 'పాట' వాలతో
'పాళిం' చగలుగుతున్నారు.
'మాగాయే మహాపచ్చడి, పెరుగేస్తే మహత్తరి, అదివేస్తే
అద్దవిస్తరి, మానిన్యాం మహాసుందరి' లాంటి,
'మద్యే మద్యే మద్యపానీయం సమర్పయామి' లాంటి
తమాషా ప్రయోగాలు అలవోకగా చేసినా
అలరించాయి అందర్నీ.
వాగ్దేవి ఆయన మదిలో వసిస్తోంది
ఆయన అంగుళీయార్చనతో పరవశిస్తోంది
వేవేల భావాలకు సుందరమూర్తిని కల్పించిన
నిర్విరాముడాయన
రాతిని నాతిగా చేసింది ఆనాటి రాముడు
రీతిని గీతిగా చేసింది ఈనాటి రాముడు
అది పాదం
ఇది నాదం
ఆనాటి అందాలరామునికి ఒకేమాట ఒకే బాణం
ఈనాటి సుందర రామునికి ఎన్నో పాటలు ఎన్నో
బాణీలు
మన వేటూరి సుందరరామ్మూర్తిగారు ఋషికన్నా గొప్ప కవి.
ప్రణవ స్వరూపాన్ని
ఆవహింప చేసుకుంటాడు ఋషి
ఆకళింపు చేసుకుంటాడు కవి
ఋషి పొందేది సిద్ధి
కవి పొందేది ప్రసిద్ధి
ఋషి ధన్యజీవి
కవి చిరంజీవి
అక్షరం లక్షణంగా భాషించి,
భాసించిన వేటూరి ఋషికన్నా గొప్పకవి.
జయంతితే సుకృతినో
రస సిద్ధా కవీశ్వరాః
నాస్తితేషాం యశః కాయే
జరా మరణజం భయం
నాస్తి జరామరణం భయం
నాస్తి జరామరణజం భయం



\-

# సరిగపదమని-9

**జవాబులు:-**

**అడ్డం:** 1.తెలుగు వీర లేవరా 5. మురి 7.శివ 8. వేల 9. బావా 10. వాడు, 12. హాలో, 14. మహా, 15. ధన, 17. జయం 18.గట్టుంది, 19. తానం, 20. జన 21. బుల్లి 22.గాలి 23. వాలు

**నిలువు:** 1.తెల్ల 2. గుచ్చి 3. లేరు, 4 .రాముల 6.వివాహ భోజనంబు 7.శిల 8. వేడు, 11. మహానుభావులు 13. అనగనగా 16. అదివో

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

పుల్లిపూడి వైదేహి- కాకినాడ, పి.శరత్‌కుమార్- కర్నూలు, ఎస్.విజయలక్ష్మి- విశాఖపట్నం, దాస్యం వెంకట వంశీకృష్ణ- జంగారెడ్డిగూడెం (ప॥గో॥జిల్లా), టి.పి.రాజ్యలక్ష్మి- శ్రీకాకుళం, ఎ.సాయిరత్నంబ- హైదరాబాద్, ఎస్.వరలక్ష్మి- హైదరాబాద్, అరుణ్ కిశోర్ సామంచి- విజయవాడ, పెంద్యాల కామేశ్వరరావు- ముంబాయి, తలికిచెర్ల రామకృష్ణ- విజయనగరం, వాడ్రేవు ఫణిమాధవి- కాకినాడ (తూ॥గో॥జిల్లా), మల్లాది రాజ్యలక్ష్మి- విశాఖపట్నం, ఎమ్.సతీష్‌చంద్ర నాయక్- తిరుపతి (చిత్తూరు), చివుకుల చిరంజీవి- ఒంగోలు, జి.హరినాథ్- ముంబాయి, ఏలూరుపాటి లక్ష్మిలావణ్య- కొవ్వూరు (ప॥గో॥జిల్లా), కె.ఎస్.శ్రీలక్ష్మి- బాపట్ల, పి.నాగేంద్రశాయి -కడప, ఆయి.మధురనాథ్- నంద్యాల, ఎ.పి.హృదయ్ కుమార్- నిజామాబాద్, కనకదండి జగన్నాథరావు- టాటానగర్ (జార్ఖండ్), అపూర్వ భావన- పాలకొల్లు, మల్లిడి దినేష్‌రెడ్డి- అనపర్తి (తూ॥గో॥జిల్లా), పి.పురుషోత్తం రెడ్డి- చిత్తూరు, రావి.నరేష్‌చౌదరి- గుంటూరు, ఆర్.ఎస్.ఎస్.స్పందన- హైదరాబాద్, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), మల్లిడి అరుణాదేవి- కుతుకులూరు (తూ॥గో॥జిల్లా), జొన్నలగడ్డ అహల్య- మెహిదీపట్నం, పి.భుజంగరావు- గుంటూరు, చుండూరు పద్మావతి- నవులూరు (గుంటూరు), కె.పూజిత- హైదరాబాద్, బి.వి.ఎస్.సత్యనారాయణ- గనపర్తి(విశాఖజిల్లా), ఎస్.వాణి స్వయంప్రభాదేవి- విశాఖపట్నం, జె.కృష్ణకుమారి- విజయవాడ, కోట లలిత- సికింద్రాబాద్, ఎమ్.పుష్పమాల- ముంబాయి, గరిమెళ్ళ అన్నాజీరావు- అన్నవరం (తూ॥గో॥జిల్లా), మహబూబ్ సుభాని- పాలేరు (ఖమ్మం), జి.వి.రమణ- అనంతపురం, ఎ.ఆర్.ఎన్.శర్మ- విజయవాడ, ఎ.ఎల్.వి.ఎస్.బి.ఎన్.ప్రసూన- భీమవరం, లక్ష్మిశారద- హైదరాబాద్, కె.వెంకట్‌రెడ్డి- ఖమ్మం, భారతి రాంబాబు- విశాఖపట్నం, పి.లక్ష్మివందన- తాడేపల్లిగూడేం, పింగళి శ్యామసుందర్- బెంగుళూరు, ఎమ్.శ్రీదేవి- విశాఖపట్నం, కుప్పిలి మీరా- కుప్పం (విజయనగరం), జి.పాండురంగశర్మ- హైదరాబాద్, సి.ఎన్.విజయ- కడప, బి.సోమరాజు- విజయనగరం, బి.పద్మజ- కొండపి (ప్రకాశం), బి.శైలజకుమారి- అల్లూరు(కర్నూలు), గ్రంధి అనంతలక్ష్మి సత్యవతి- ముసునూరు (కృష్ణ), మండలిక కమలకుమారి- కాకినాడ, జాగిర్దార్ అమర్‌నాథ్- సామర్లకోట(తూ॥గో॥జిల్లా), చెన్నా గౌరిశంకర్- విశాఖపట్నం, కోరంపల్లి లావణ్య- కన్నెగండ్ల (గుంటూరు), గొట్టుముక్కల రామకృష్ణంరాజు- సత్తెనపల్లి, కె.కేశవకుమార్-హిందుపూర్ (అనంతపురం), ఏ.సరిత- నెల్లూరు, పూసరపు రోహిణి- నర్సాపురం (ప॥గో॥జిల్లా), కె.వి.ఎస్.కిషోర్- కడప, పెద్దాడ వెంకటేశ్వర్లు- సిర్‌పూర్ కాగజ్‌నగర్ (ఆదిలాబాద్), దేవరం సతీష్‌కుమార్- జగిత్యాల, పంగులూరి సత్యనారాయణ- నెల్లూరు, ఆర్.ఎం.ప్రియాంక- హైదరాబాద్, డా॥ ఉప్పల వెంకటరమణయ్య- కడప, మనోహర్ పంత్- హాసన్‌పర్తి, శ్రీధర్ వేముల- కందుకుర్తి (మహబూబ్ నగర్), ఐ.భూపాల్‌రెడ్డి- ప్రొద్దుటూరు(కడప), నిర్మలక్రిష్ణ- తిరుపతి, ఎమ్.డి.మోహిద్దీన్- మానేపల్లి (తూ॥గో॥జిల్లా), డి.వెంకట్రావు- సాలూరు (విజయనగరం), ఎస్.బాలక్రిష్ణ- సికింద్రాబాద్, డి.అమరేశ్వరరాయ శర్మ- నిడుబ్రోలు(గుంటూరు), కొవ్వలి భానుహార్ష- కంకిపాడు (కృష్ణా), సి.వి.యస్.ఆర్.కే.ప్రసాద్- జహీరాబాద్, వి.వజ్రమోహన్- చెన్నై, ఎ.సీతరామమ్మ- హైదరాబాద్, పి.రాజ్యలక్ష్మి- హైదరాబాద్, శివారెడ్డి గందేశి- హైదరాబాద్, హెచ్.ఫణి- బెంగుళూరు, డి.వై.ప్రమీల- విశాఖపట్నం, కొండపల్లి వేదవల్లి- విశాఖపట్నం, రాజ్‌కుమార్ మగ్గళ్ళ- మల్కాజ్‌గిరి, పి.రాధకృష్ణ- శ్రీకాళహస్తి, జి.హేమంత్- మంగళగిరి (గుంటూరు), డి.మనోరమ- హైదరాబాద్, వి.ప్రసాదరావు- రామచంద్రాపురం(కృష్ణా), పి.వి.వి.అప్పారావు- రావులపాలెం (తూ॥గో॥జిల్లా), ఒ.వల్లి- గుంటూరు, కె.కార్తీక- విద్యానగర్, కె.వి.రమణారెడ్డి- హైదరాబాద్, బి.వి.భాస్కరరావు- మదురై (తమిళనాడు), ఇందిర రాధాకృష్ణ- హైదరాబాద్, భువనగిరి ప్రభాకర్- హైదరాబాద్, జి.విద్యారాజేశ్వరరావు- హైదరాబాద్, దూసి జయశ్రీ- హైదరాబాద్, టి.శ్యామలాదేవి- హైదరాబాద్, బి.కిరణ్‌కుమార్- హైదరాబాద్, అప్పర్తి కాకినాడ, కె.విజయశ్రీ- చిత్తూరు, వెలగా రఘు- మామిడాల (నల్గొండ), కేసర అమాన్- హైదరాబాద్, మెరుకు మస్తానయ్య- ఒంగోలు, డి.వైష్ణవి- సికింద్రాబాద్, పి.ఎస్.వల్లిక- రాజమండ్రి (తూ॥గో॥జిల్లా), పద్మజారాణి- హైదరాబాద్, శ్రీశోభిత- తిరుపతి, ఎస్.విజయలక్ష్మి- హైదరాబాద్, అరుణ చిత్తనారరావు- ఎమ్మి- బొల్లి, ఎ.పానేశ్వరరావు- బెంగుళూరు, సిహెచ్.వెంకటరాఘవులు- సంగారెడ్డి, వై.జి.మంజుభార్గవి- కర్నూలు, కె.కమల కుమారి- హైదరాబాద్, బాసరల యాదగిరి- రామన్నపేట (నల్గొండ), టి.వైష్ణవి- వైజాగ్, ఒ.రవికృష్ణ- హైదరాబాద్, బి.బాలిరెడ్డి- గుడివాడ, పి.ఉదయలక్ష్మి- పామూరు (కృష్ణ), వి.రమణ- దేవరకొండ (నల్గొండ), ఎస్.ఛాయాదేవి- విజయవాడ, ఎస్.స్వరాజ్య లక్ష్మి- బొబ్బిలి (విజయనగరం), పి.స్పందన్‌బాబు- కరీంనగర్, మామిడాల కృష్ణయ్య- కొలనుపాక (నల్గొండ), ఎమ్.నాగేశ్వరరావు- గుంటూరు, పి.వి.రేఖ- కర్నూలు, పి.ఎ.ఎస్.శంకర్‌శర్మ- ప్రొద్దుటూరు(కడప), యస్.విమల- నాగర్‌కర్నూలు (మహబూబ్‌నగర్), చిలుకూరి శ్రీనివాసశర్మ- విజయవాడ, బలిజేపల్లి అరుణ- పెంకరాయి (తూ॥గో॥జిల్లా), ఎల్.శ్రీనివాస్- అనంతపురం, ఎమ్.సందీప్- నల్గొండ, అమరా వెంకటేశ్వర రావు- నెల్లూరు, ఎ.మనోరాజ్- హైదరాబాద్, ఎ.మల్లిఖార్జునరావు- హైదరాబాద్, సిహెచ్.వి.భానుమూర్తి- హైదరాబాద్, పి.శిరీష్‌కుమార్- రాజమండ్రి, పి.లక్ష్మీదేవి- బొర్నపాడు (కర్నూలు), ఎమ్.వరలక్ష్మీ రాఘవేంద్ర- హైదరాబాద్, జయంతి రమ్యసాహితి- విశాఖపట్నం, ఎమ్.విజయలక్ష్మి- హైదరాబాద్, కె.వి.నరసింహ- హైదరాబాద్, కటకం శోభనాచేయరుప్రసాద్- హైదరాబాద్, వైష్ణవి- వైజాగ్, ఎస్- కోదాడ, వై.ధర్మారెడ్డి- వనపర్తి (మహబూబ్‌నగర్), జి.మల్లికార్జున- కర్నూలు, షేక్.యజ్దాన్- గూడూరు (నెల్లూరు), టి.సత్యనారాయణ- గూడూరు(నెల్లూరు), కె.వి.ఎస్.బిందు- హైదరాబాద్, వి.రాంబాబు- హైదరాబాద్, టి.రేణుకాదేవి- హైదరాబాద్, వి.వేణుగోపాల్‌రావు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), పొన్నం ఉమాదేవి- చిలకలూరిపేట (గుంటూరు), దాసి.నాగమణి- నంద్యాల, పి.ఎస్.నారాయణరాజు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), ఎస్.కె.సందీప్- హైదరాబాద్, టి.విజయలక్ష్మి- హైదరాబాద్, ఎన్.వెంకటరెడ్డి- నల్గొండ, పి.లక్ష్మీనారాయణ- ఆదిలాబాద్, ఎమ్.లక్ష్మీనారాయణ- సికింద్రాబాద్, ఎన్.లీలాప్రసూనదేవి- హైదరాబాద్, జగన్నాథకురమణ- పిఠాపురం, ఎ.పురుషోత్తం రావు- గుత్తి, బి.సత్యనారాయణ, శ్రీనివాస్- సీతంపేట (ఖమ్మం), యాదిరెడ్డి జయలక్ష్మి- రాజోలు (తూ॥గో॥జిల్లా), తాడి రంగారావు- రాజమండ్రి, సాహితీశంకర్- ఆదోని, ఎస్.రాధాకామేశ్వరి- హైదరాబాద్, పి.నాగ- నరసాపురం, యం.మోహనప్రభాకర్- పాలెం, మద్దులబాబీకుమార్- జగిత్యాల, యస్.మధుసూదనరావు- హైదరాబాద్, కె.దుర్గా మహేశ్వరం- నెల్లూరు, కె.పురుషోత్తమరావు- విజయవాడ, బి.రామకృష్ణ- తాడేపల్లి, శ్రీశైలం, హరిత్- సికింద్రాబాద్, సి.హెచ్.జనార్ధన్- హైదరాబాద్, జి.యస్.ప్రసాద్- హైదరాబాద్, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ(కృష్ణ), పి.వి.ఆర్.వి.కుమార్- బెంగుళూరు, డా॥కె.సంజీవ్‌కుమార్- వేపీపేట్ (నిజామాబాద్), సిలువేరు పుష్పలత- దేవరకొండ (నల్గొండ), యాగా అమృత- కాకినాడ, సీతాదేవి- విజయవాడ, సి.అలివేలు- విజయవాడ, కదార్ల నారాయణ- జగిత్యాల (కరీంనగర్),డా॥ భువనేశ్వరి- శ్రీకాళహస్తి, తిరుదాను నందు- చందూరు (నల్గొండ), పి.సాహిత్య- విశాఖపట్నం, విరసినేని అంజనేయులు- వేములవాడ (కరీంనగర్), పి.వి.ఎస్.ఆర్.సౌజన్య- మల్కాజ్‌గిరి, పి.శాంతమ్మ- దోర్నాల (ప్రకాశం), బి.బర్నబాస్- నెల్లిమరల్ (విజయనగరం), సరస్వతుల రామనరసింహం- హైదరాబాద్, ఆత్కూరి వెంకట శరత్‌కృష్ణ- హైదరాబాద్, టి.రాఘవకుమార్- కడప, కొత్తపల్లి సుధ- తెనాలి, నేమాన సుభాష్ చంద్రబోస్- శ్రీకాకుళంటౌన్, ఎ.నగేష్- హన్మకొండ, కె.వి.దుర్గమోహనరావు- నల్గొండ, నండూరి లలితసుగుణ- విజయవాడ, జి.రమేష్‌నారాయణ్- గుంటూరు, పి.అనురాగ్- ఏలూరు, పి.వి.జి.ఎన్-శాస్త్రి- తుర్కయంజాల్(రంగారెడ్డి), కె.బి.కైలాస్ నాథ్- అనంతపురం, లేళ్ళపల్లి శ్రీదేవి రమేష్- చెన్నై, ఎస్.సుప్రియకృష్ణ- హైదరాబాద్, బిహారం శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), యం.రఫీఏర్- సికింద్రాబాద్, డా॥ కానర రంగారావు- పాల్వంచ, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), జె.ఎ.ఎస్.రాజా- పాయకరావుపేట (విశాఖజిల్లా), కె.ప్రతాప్- హైదరాబాద్, ఎస్.సౌజన్య- ఒంగోలు, జి.కళ్యాణిశర్మ- నంద్యాల, సురభి శారద- కాకినాడ, యస్.వేణుగోపాల్- కాకినాడ, ఎస్.సమీర- హైదరాబాద్, కె.మాధవిలత- నంది కొట్కూరు (కర్నూలు), ఖలీల్.షేక్- శ్రీశైలం ద్యామ్ తూర్పు (కర్నూలు), పి.రామరావు- అనంతపురం, పి.ఆర్.జె. లక్ష్మీబాయి- అమలాపురం, జి.నోబుల్‌వాణి- గణపవరం(ప॥గో॥జిల్లా), పలక సుదర్శనం- గుమ్మలక్ష్మీపురం (విజయ నగరం), ఆర్.ఎన్.రాజు- అదోని, సి.హెచ్.మహేష్- కాకినాడ, కేమా చెంచయ్య- పమిడుపాడు (ప్రకాశం), ధవళ దుర్గ- హైదరాబాద్, ఎస్.ఆర్.ఎస్.పి.హర్షకిరణ్- వడకుదురు (తూ॥గో॥జిల్లా), పురాణపండ శ్రీకృష్ణ- కాకినాడ, సిహెచ్.సత్య జగదీష్- కుర్దారోడ్, డి.దీప్తి- అనంతపురం, డా॥ నాగరాజకుమారి- మణిపాల్ (కర్నాటక), గంటి నాగేశ్వరరావు- విశాఖపట్నం, రావుల వేణుగోపాల్- కాజీపేట (వరంగల్), అనుపోజు శివకుమార్- కొమరవానిపేట (శ్రీకాకుళం), జె.శ్రీదేవి- వనపర్తి (మహబూబ్‌నగర్), కె.నాగమణి- కర్నూలు, సాలా రవికుమార్- పొట్టినామాలయ్యపాలెం, ఆర్.ఫణిబాల- భువనేశ్వర్, గంటి గణేష్ రవిచంద్ర- రాయవరం (తూ॥గో॥జిల్లా), మద్దుల అప్పారావు- అనకాపల్లి (విశాఖజిల్లా), కె.కళాబింబి- చెన్నై, జవంగుల శ్రీనివాస్- సత్తెనపలి (గుంటూరు), ఆర్.పుల్లాయమ్మ- తెనాలి, బి.సోమేష్- అత్రేయపురం, ఎ.పద్మావతి- శ్రీకాకుళం, పి.శేఖర్‌బాబు- ధర్మసాగర్ (వరంగల్), బి.ఝాన్సీ లక్ష్మి- విశాఖపట్నం, కె.మురళీకృష్ణ- సత్తెనపల్లి (గుంటూరు), మద్దాలి మురళీకృష్ణ- నిజామాబాద్, జి.రవిశంకర్- విశాఖపట్నం, విజయలక్ష్మి దాడి- విశాఖపట్నం, శిష్టా సీతామహాలక్ష్మి- హైదరాబాద్, సి.భార్గవి- తురిగొండ, ధర్మాల సుబ్రహ్మణ్యం- హైదరాబాద్, కె.బి.కిరణ్- హైదరాబాద్, జి.ఉదయసుందరి- హైదరాబాద్, టి.కె.సాగర్‌కుమార్- ఎమ్మిగనూర్, ఎన్.గిరిజ- హైదరాబాద్, బి.వి.మల్లిఖార్జునం- హైదరాబాద్, కె.పద్మజారాణి- హైదరాబాద్, టి.రుక్మిణి- కుకట్‌పల్లి, ఎలమర్తి సూర్యశ్రీ- కర్నూలు, యమ్.రాధారాం భద్రారావు- నల్గొండ, వి.వి.ఎస్.అవధాని- హైదరాబాద్, హెచ్.శ్రీనివాస రావు- తిరుపతి, బొడిగే వేంకటేశంగౌడ్- హైదరాబాద్, ఏలేశ్వరపు హరిత- మంగళగిరి, కె.రాజరాజేశ్వరి- హైదరాబాద్, అడ్డగర్ల వెంకట్రావు- తణుకు (ప॥గో॥జిల్లా), ఎం.మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, ఎమ్.సునందబాయి- కర్నూలు, రావికంటి రేణుక- మంథని (కరీంనగర్), రాయప్రోలు గోపాలక్రిష్ణ- హైదరాబాద్, బండి మేరిలక్ష్మి- ఉప్పలూరు (కృష్ణ), వీణే మాధురి.జె- దామరచెర్ల (నల్గొండ), సుబ్బలక్ష్మి.కె- హైదరాబాద్, ఎల్.శరత్- తిరుపతి, డి.ఆర్.ఎస్.కార్తిక్- సికింద్రాబాద్, ఎస్.శ్యామల- సూర్యాపేట(నల్గొండ), డి.మణిమంజరి- హైదరాబాద్, సి.వి.బాలకృష్ణవర్మ- హైదరాబాద్, ఆర్.సాయిప్రసాదరావు- హైదరాబాద్, కాళ్ళకూరి అన్నపూర్ణ- సికింద్రాబాద్, సౌమిత్రి రమణచార్య- హైదరాబాద్, నండూరి శారద- సికింద్రాబాద్, కిషోర్‌కుమార్- గోదావరిఖని (కరీంనగర్), డి.రవికుమార్- శ్రీకాకుళం, పి.ఎం.ఆచారి- హైదరాబాద్, పహోరే ఇందిర- కళ్యాణ్, టి.ఉమారాణి- మర్కాపురం(ప్రకాశం), చింతలపాటి శైలుష- గోదావరిఖని (కరీంనగర్), ఎమ్.అంజిరెడ్డి- ఒంగోలు, ఎస్.శశిధర్- ముంబాయి, ఎమ.శ్వేతమానస- ఒంగోలు, సిహెచ్.నాగేశ్వరధవేజి- హైదరాబాద్, మామిడి మునిశ్రీలత- పూణే, మామిడి వహేంద్ర- పూణే, పి.విజయసారథి- కర్నూలు, వసంతలక్ష్మి- కర్నూలు, కె.వి.సరోజిని- అత్తిలి (ప॥గో॥జిల్లా), యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి, డా॥ ఎ.రాధిక- అమలాపురం (తూ॥గో॥జిల్లా), ఎస్.ఎస్.ప్రసాద్- హైదరాబాద్, చంగాలి రామంజనేయులు- బంటుమిల్లి (కడప), సి.రంగనాయకులు- మార్కాపురం (ప్రకాశం), జోశ్యుల భానుమూర్తి- భీమవరం (ప॥గో॥జిల్లా), యజ్జల జగన్నాథం- పాతపట్నం (శ్రీకాకుళం), వేండిశెట్టి సత్యప్రకాశ్- హైదరాబాద్, బెల్లంకొండ రాంబాబు- పమిడుపాడు(గుంటూరు), అంబేపల్లి అంకారావు- ఒప్పిచర్ల(గుంటూరు), కె.లావణ్య- నంద్యాల(కర్నూల), టి.లక్ష్మి- కాకినాడ, ఎన్.లక్ష్మినీలిమ- శ్రీకాకుళం, ఎం.లక్ష్మిప్రసన్న- కాకినాడ, ఎ.సరోజినిదేవి- రాజమండ్రి, ఎన్.శారద- విశాఖపట్నం, సి.వి.టి.అనిల్‌కుమార్- విజయవాడ, ద్విభాష్యం వెంకటసూర్య ధన్వంతరి- చింతలూరు (తూ॥గో॥జిల్లా), కోడూరు సత్యనారాయణ- కడప, బచ్చు విజయకుమార్- విశాఖపట్నం, వై.సుమనాగశాలిని- తుని(తూ॥గో॥జిల్లా), ఎస్.ఉషారాణి- విశాఖపట్నం, బొమ్మకంటి రవికిషోర్- హైదరాబాద్, పి.వి.శాంతారావు- కాకినాడ, బి.నాగలక్ష్మి- కర్నూలు, రాధ- రాజమండ్రి, పి.వి.జ్యోతిప్రశాంతి- విశాఖపట్నం, బొమ్మరాజు లీలావతి- కొట్లబజార్(ప్రకాశం), డి.మల్లీశ్వరి- విశాఖపట్నం, ఎం.ఎల్.విక్రంసాగర్- కర్నూలు, కె.చంద్రశేఖర్- విశాఖపట్నం, శశిశేఖర్ వెన్నెలకంటి- హైదరాబాద్, తిరుమల్‌ప్రసాద్.పి- హైదరాబాద్, బాలనాగు సింధుశైలజ- భీమడోలు (ప॥గో॥జిల్లా), కొంపెల్ల పద్మజారాణి- విశాఖపట్నం, మన్నవ మాధవ- సత్తెనపల్లి, యం.రామ్- మైదుకూరు (కడప), ఎస్.డి.కె.వి.మల్లిక- భీమునిపట్నం, టి.శేషకుమారి-దేవాపూర్, సిహెచ్.సురేష్‌కుమార్- కొత్తవలస (విజయ నగరం), బొజ్జ హరికృష్ణ- మద్రాసు, నల్లా సూర్యనారాయణమూర్తి- కాకినాడ, సిహెచ్.సూర్యారావు- చీపురుపల్లి (విజయనగరం), ఎస్.ఆర్.సుబ్రహ్మణ్యం- శ్రీశైలం ద్యామ్ తూర్పు (కర్నూలు), వరదా సాయికుమార్- పర్లాకిమిడి (ఒరిస్సా), కొండపల్లి గంగయ్య- లంగ్టాపూర్ (నిజామాబాద్), ఎమ్.వి.ఎస్.ఎన్.శాస్త్రి - విజయవాడ, పి.బి.మురళి- ప్రొద్దుటూరు, బాలంత్రపు శారదరమణ- హైదరాబాద్, ఐ.రమామాణి- గుమ్మలక్ష్మిపురం (విజయనగరం), ఎ.జయంతి- హైదరాబాద్, ఎమ్.అమృత- కర్నూలు, ఎన్.గాయత్రి- హైదరాబాద్, కె.సారజ దీపిక- హైదరాబాద్, ఇ.మురళీకుమారి- చిత్తూరు, ఆర్.రాఘవేంద్రరావు- హైదరాబాద్, ఎ.ఎన్.ఎన్.మూర్తి- రాజమండ్రి, వై.కె.ఎస్.పద్మావతి- కాకినాడ, డి.ఎస్.ఆర్.ప్రసాద్- సికింద్రాబాద్, పి.వరలక్ష్మి- అచ్చంపేట (మహబూబ్‌నగర్), టి.జనార్దనచారి- హైదరాబాద్, ఘడియారం సూర్యనారాయణ- గుంటూరు, చిన్నం విజయకుమార్- విజయవాడ, రాయప్రోలు లక్ష్మిదేవి- హైదరాబాద్, కె.రాధ- హైదరాబాద్, దేశాపతి శ్రీనివాసశర్మ- సిద్దిపేట (మెదక్), వి.వీణామాధురి- హైదరాబాద్, యు.విజయశేఖరరెడ్డి- హైదరాబాద్, గోటేటి శేషగిరిజ- సికింద్రాబాద్, కాగాలపు లక్ష్మణరావు- హైదరాబాద్, గన్నవరపు విజయదుర్గ- వరంగల్, పి.గాయత్రి జ్ఞానేశ్వర్‌రావు- హైదరాబాద్, జన్నిగొర్ల ప్రసాదరావు- హైదరాబాద్, ఎం.విమల- హైదరాబాద్, ఎమ్.రాధ- జగిత్యాల, ఎస్.సీతాలక్ష్మి- ములపర్రు(ప॥గో॥జిల్లా), విశ్వంకరరావు గంగాధరరావు- గుంటూరు, మండపాక నాగేశ్వరరావు- విశాఖపట్నం, పోలంరాజు రాధాకృష్ణమూర్తి- గుంటూరు, నెల్సా రామక్రిష్ణ- విజయనగరం, ఎమ్.ఎస్.వి. ప్రసాద్- అంబాజీపేట (తూ॥గో॥జిల్లా), టి.బ్రహ్మయ్య- కుప్పాలపల్లి, ఎస్.నిరంజన్‌కుమార్- కోట (నెల్లూరు), పండితారాధ్యుల రాజరాజేశ్వరి- హైదరాబాద్, టి.వి.రాఘవశర్మ- చెన్నై, బి.క్రిష్ణమూర్తి- ములకలచెరువు (చిత్తూరు), ఆర్.సత్యరాజన్- కొవ్వూరు, ఎమ్.జె.అనిల్‌కుమార్- ఉరుటూరు (కడప), తాతా పద్మావతి- విశాఖపట్నం, వి.మాధవి- చెన్నై, ఉప్పులూరి సుబ్బారావు- ముగలికుదురు, మాడుగుల గురునాథశర్మ- అనంతపురం, ఊట్ల వెంకట్- కడప, పి.ప్రశాంత్- సికింద్రాబాద్, కనుపర్తి జగదీష్- విజయవాడ, ఎం.వి.మీనాక్షి- హైదరాబాద్, సి.హెచ్.నర్సింగ్- హైదరాబాద్, బి.వి.సూర్యనారాయణ- కళింగపట్నం (శ్రీకాకుళం), జి.ఫణికుమార్- విజయవాడ, పి.అంజని మురళీధర్- హైదరాబాద్, ఎ.అనూజాఅనిరుధ్- పాతపట్నం (శ్రీకాకుళం), గురజాల అన్నపూర్ణ- విశాఖపట్నం, ఎమ్.మౌళి- విశాఖపట్నం, వడ్లమన్నాటి నాగసాయి భరద్వాజ్- విజయవాడ, పి.స్వాతిలక్ష్మి- చీపూరుపల్లి (విజయనగరం), జి.పట్టామ్మల్- హైదరాబాద్, కె.సత్యనారాయణ- హైదరాబాద్, బి.సత్యప్రియ- హైదరాబాద్, సి.వి.రాజేశ్వరి- విశాఖపట్నం, ఎస్.మహబూబ్- భోనగిరి(నల్గొండ), సి.హెచ్.పద్మజ- తిమ్మసముద్రం, యల్లాప్రగడ రాజ్యలక్ష్మి -హైదరాబాద్, కోనే నాగవెంకట ఆంజనేయులు- వైజాగ్, జి.బాలత్రిపురసుందరి- శ్రీకాకుళం, పి.వి.జె.మురళి - హైదరాబాద్, వి.పున్నమ్మ- నూపాల్వంచ (ఖమ్మం), కె.వి.సుబ్బయ్య- గుంటూరు, పి.ఎస్.కె.అలేఖ్య- కాకినాడ, పి.వి.అభినవ్- విశాఖపట్నం, ఎస్.ప్రకాష్- కర్నూలు, దారుల్లి ప్రవీణ- పాల్వంచ (ఖమ్మం), మహ్మమద్ లతీఫ్- నాచారం (రంగారెడ్డి), వేలివెంటి నాగస్వర్ణ అనసూయ- తెనాలి(గుంటూరు), ఆకెళ్ళ విజయలక్ష్మి- వరంగల్, వి.ఇందిర- హైదరాబాద్, ఉడాలి భాస్కరయ్య- చెన్నై, జి.చంద్రశేఖర్- విజయనగరం, రాణి భానురేఖ- కాకినాడ, ఎ.లక్ష్మి- కాకినాడ, ఎమ్.వి.శాస్త్రి- చెన్నై, ఎస్.ఎన్.మూర్తి- మహబూబాబాద్, బి.దనరాజ్- హైదరాబాద్, తాళ్లూరి జయదేవ్- నిజామాబాద్, యం.పి.ధర్మరాజు- నల్గొండ, బుగ్గారుపు హర్షిణి- ధర్మపురి (కరీంనగర్), వనం జానకీదేవి- పాత పాల్వంచ, యు.యు.ఉరుకుందు- ఎమ్మిగనూరు, ఎ.రవింద్రనాథ్- అనంతపుర్, ఎమ్.యు.ఎస్.ఎస్.ప్రసాద్- హైదరాబాద్, థమిడి ప్రసాద్- హైదరాబాద్, అక్కినేపల్లి పద్మ- రామగిరి(నల్గొండ), కె.పద్మావతి- పలస, మంత్రిప్రగడ హరిచందన్- రామగిరి (నల్గొండ), మద్దాలి సువర్చలా శ్రీనివాస్- హైదరాబాద్, బుద్ధ అప్పారావు- అనకాపల్లి, కొర్నాని దూర్వాసులు- పాతపట్నం (శ్రీకాకుళం), కోరి జయలక్ష్మి- హైదరాబాద్, కె.మురళి మోహన్- మార్కాపూర్, చిన్న ఢిల్లారి మంజరి- నిడుబ్రోలు, వి.ఎస్.వి.లక్ష్మిదేవి- విజయనగరం, పి.హిమమజ్యోతి- విశాఖపట్నం, ఉమా మహేశ్వరి సమ్మెట్ల- శృంగవరపుకోట (విజయనగరం), ఎ.శ్రీరత్న- విద్యానగర్, కె.నాగకుమారి- హైదరాబాద్, కె.సుజాతలక్ష్మి- హైదరాబాద్, డి.నవిత- బోడుప్పల్, ఎ.ఆర్.మల్లేశ్వరరావు- అరుణ్‌దాల్‌పేట్, జి.నరసింహమూర్తి- అనంతపురం, కక్కిరేణి లాలిత్య- చౌటుప్పల్ (నల్గొండ), పి.విజయలక్ష్మి- హైదరాబాద్, జి.వరలక్ష్మి- హైదరాబాద్, బి.నిర్మల్ రావు- బెర్హంపూర్ (ఒరిస్సా), డా॥ ఎన్.శ్యామల- నెల్లూరు, పి.కిరణ్‌కుమార్- కరీంనగర్, యు.యు.శ్రీరాములు- మద్రాసు, ఎ.ఎమ్.వేంకటేశ్వర ప్రవీణ్‌కుమార్- పమిడిపాడు (గుంటూరు).

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

బి.వి.ఎస్.ప్రసాద్- పుల్లలపాడు(ప॥గో॥జిల్లా), పింగళి క్రిష్ణమూర్తి- గుంటూరు, మెట్టా శివరామకృష్ణ- కల్పక్కమ్ (తమిళనాడు), డి.సూర్యతేజ- గుంటూరు, కె.రమ- నల్గొండ, కె.పార్వతి- రాజమండ్రి, సి.యామినీ- హైదరాబాద్, జయశ్రీ భీమన- గుంటూరు, వి.ఎస్.రాఘవ- రాజమండ్రి, ఎమ్.వి.ఎన్.జయశ్రీ- విశాఖపట్నం, గంగారపు వెంకట రావు- సత్తెనపల్లి (గుంటూరు), తాతిరాజు జగన్- బెర్హంపూర్ (ఒరిస్సా), ఎన్.కె.నాగేశ్వరరావు- పెనుగొండ, పి.శ్రీనివాస్- తిరుపతి, ఎ.హేమలత- చిత్తూరు, డా॥ జొన్నలగడ్డ జానకి రామశర్మ- ఒంగోలు, జి.జయ చంద్రగుప్త- కర్నూలు, యు.ఇందూనీహారిక- నెల్లూరు, పి.వి.రామశర్మ- విశాఖపట్నం, రాచపూడి వాణిశ్రీ- ఒంగోలు, ఎ.సీతాదేవి- హైదరాబాద్, వి.క్రిష్ణకిషోర్- గుంటూరు, రాగం కనక ఉదయ సూర్యభాస్కర రావు- ములగపూడి, ఆర్.రమేశ్- మద్నూర్ (నిజామాబాద్), జి.నాగదుర్గ- హైదరాబాద్, పొన్నడ రమేష్- హైదరాబాద్, కె.ఎల్.ఎన్.రాజేష్- తణుకు, వై.సంధ్యారమణి- న్యూబాంబే, శివప్రసాద్- హైదరాబాద్, మునిగోటి దమా శ్రీనివాసశర్మ- మదనపల్లె (చిత్తూరు), బి.జయమ్మ- నంద్యాల (కర్నూలు), వి.దీప్తి- అనంతపురం, ఎల్.జ్యోతిర్మయి- హైదరాబాద్, పి.విజయలక్ష్మి- కాకినాడ, కొంగంటి వేంకటేశ్వరరావు- గుంటూరు. ఎమ్.శ్రీనివాసరావు- కలకత్తా, పి.వి.వి.కె.ఆత్రేయ- కాకినాడ, బి.విజయలక్ష్మి-నర్సీపట్నం (విశాఖజిల్లా), సోమయాజుల సాయిప్రసాద్- కోరాపుట్ (ఒరిస్సా), జి.రాములు- కాకినాడ, కత్రి ఝాన్సీ- హైదరాబాద్, దేవినాని శిరీష- హైదరాబాద్, కుత్తివెంటి చంద్రలేఖ- జంగారెడ్డిగూడేం. ఆర్.లక్ష్మి- హైదరాబాద్, ఎ.అరుణాకుమార్- హైదరాబాద్, మరువాడ కామేశ్వరరావు- మంచిర్యాల, జి.ప్రసాదరావు- శ్రీకాకుళం, తాతిరాజు మోహనరావు- విశాఖపట్నం, ఎన్.ఎస్.రఘురామ్- తాడేపల్లిగూడేం, జి.వీరకుమారి- ముమ్మిడివరం (తూ॥గో॥జిల్లా), టి.వింధ్యారాణి- నల్గొండ, శ్రీనివాస్ పవార్- నిజామాబాద్, వై.భానుప్రసాద్- కర్నూలు, పి.శ్రీనివాస్- హైదరాబాద్, ఎస్.సూర్యనారాయణ- హైదరాబాద్, వై.మురళి- రాజమండ్రి, కె.కృష్ణ- సూర్యపేట, టి.సూర్యశ్రీ- హైదరాబాద్. ఎమ్.రవింద్రప్రభు- పత్తికొండ, ఎమ్.రామలక్ష్మి- విజయవాడ, యు.అదిత్యమణిధర్- భీమవరపుకోట (తూ॥గో॥జిల్లా), ఇ.టి.రామరావు- సూళ్ళురుపేట, ముసివాన విజయలక్ష్మి పాయ్- కాకినాడ, గంటి ఎస్.వి.ఎస్.ఎస్. రామగోపాల్- పేరూరు(తూ॥గో॥జిల్లా), డి.రాజ శేఖర్- చెన్నై, వై.రోశరెడ్డి- సత్తెనపల్లి, మద్రి సిదార్థసారథ్- కర్నూలు, జాగంటి ఉమానాగలక్ష్మి- హైదరాబాద్, కోటిపల్లి చక్రధర్- విశాఖపట్నం, లావణ్య.కె- ధర్మవరం (అనంతపురం), ఎస్.ఎన్.సి.శ్రీవల్లి- ఖమ్మం, కాటూరు రంగాచారి- వరంగల్, పి.వి.సుందర్‌కుమార్- బెర్హంపూర్ (ఒరిస్సా), ఎస్.శృతి- చిలకలూరిపేట, పరాంకుశం సునీల్- బెర్హంపూర్(ఒరిస్సా), పదాల రాము- పాతపట్నం, ఆమంచి వేంకటలక్ష్మి- రాజోలు (తూ॥గో॥జిల్లా), ఎం.వి. ఎస్.లక్ష్మి- కాకినాడ, బేరా రమేష్- నర్సీపట్నం (విశాఖజిల్లా), జె.జి.ఎల్-గుప్త- శ్రీకాకుళం, ఎ.దుంగోపి- గుంటూరు, యుర్రవాణి- కాకినాడ, టి.శ్రీనివాస్- హైదరాబాద్, ఎస్.వెంకటేశ్వరరావు- న్యూబోయిన్‌పల్లి, పాలిశెట్టి అనిల్‌కుమార్- మార్టూర్ (ప్రకాశం), జి.కె.ఎస్.విశ్వనాథ్- కాకినాడ, పి.చెంచురామయ్య- గూడురు (నెల్లూరు), ఎ.అశోక్‌కుమార్ రావు- గుర్రంపోడ్ (నల్గొండ), వై.రాజానాయుడు- పాతపాలు (చిత్తూరు), గంటి రమ్య- అమలాపురం, ఆర్.వంశీధర్- కర్నూలు, ఎమ్.దుర్గాప్రసాద్- వరంగల్, సామంచిశ్రీరాధ- విశాఖపట్నం, వసంతలక్ష్మి- ఇబ్రహింపట్నం (కృష్ణ), జి.వి.వి.జనార్ధనరావు- కొవ్వలి (ప॥గో॥జిల్లా), కె.వసంతకుమార్- దేవరకొండ, కండప్ర శ్రీధర్-ధవళేశ్వరం (తూ॥గో॥జిల్లా), విజయభాస్కర్- రాజమండ్రి, పి.కె.ఎమ్- విశాఖపట్నం, బి.జాకిర్‌హుస్సేన్- ఎమ్మిగనుర్, అకొండి వెంకట్రావు- విశాఖపట్నం, అకుతోట మద్దులేటి స్వామి- కర్నూలు, పసుమర్తి జగన్నాథం-ముక్కువ, ఎమ్.దొరస్వామి నాయుడు- తిరుపతి, వి.శుభకీర్తి- తిరుపతి, చెరుకుతోట పరాత్పరరావు- ఏలూరు, సి.గిరిజాశంకర్- రాయిపూర్, ఎన్. జగన్మోహనరావు- కరీంనగర్, ఎస్.శివనారాయణ- కొత్తపేట (ప్రకాశం), పి.వి.ఎల్.ప్రశాంతి- హైదరాబాద్, వి.వి.ఎస్.వి. ప్రసాదరావు- పినపల్ల (తూ॥గో॥జిల్లా), బి.ఎస్.రావు- పర్లాకిమిడి (ఒరిస్సా), పి.విజయలక్ష్మి- అమలాపురం (తూ॥గో॥జిల్లా), బి.రేణుకా కుమారి- భోధన్, ప్రసూన పాణ్యం-కర్నూలు, దాసరి వినేష్- అల్లాపూర్ (కరీంనగర్), ఎమ్.శివకుమార్- చెన్నై, పెయ్యేటి రంగారావు- హైదరాబాద్, ఎమ్.సత్యవాణి- తణుకు, ఎస్.వి.కృష్ణ ప్రసాద్- నెల్లూరు, చెన్నమరాజు సుబ్బలక్ష్మి- కర్నూలు, కె.కనకాచారి- నల్గొండ,కాళీకృష్ణ- హైదరాబాద్. ఎమ్.శ్రీఅనుదీప్- కాకినాడ, జి.ఆర్.శ్రీకాంత్- కడప, యు.ఆర్.ఎన్.కె.విహార్- హైదరాబాద్. కొడూరు సందీప్- ఆదిలాబాద్, విజయవాడ, జి.వి.రమణ- సంగారెడ్డి, పి.వి.నారాయణబాబు- గుంతకల్లు (అనంతపురం), చిట్టా కమల- హైదరాబాద్. సిహెచ్.ఫణిసౌజన్య- దుబ్బచేర్ల (ప॥గో॥జిల్లా), పి.లక్ష్మీకుమారి- ఖమ్మం.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

ఎన్.చెంచయ్య- పాపానాయుడు పేట (చిత్తూరు), ఆర్.ఎస్.రెడ్డి- హైదరాబాద్. వెంకటరమణ ముప్పిరాల- హైదరాబాద్. అల్లూరి రామరాజు- విజయవాడ, ఎస్.నాగేశ్వరరావు- మందమర్రి (ఆదిలాబాద్), కె.శ్రీనివాసరావు- హైదరాబాద్. ఆర్.నందిని- హైదరాబాద్. కె.రాధస్వాతి- బెర్హంపూర్ (ఒరిస్సా), బి.కవిత- తిరుపతి, టి.ఉష- తిరుపతి, డి.సుభద్ర- హైదరాబాద్, అద్దంకి శ్రీరామచంద్రామూర్తి- హైదరాబాద్. పి.శంకరమ్మ- గుడూరు, ఎన్.శంకరాచార్యులు- చిలుకానగర్, పగిలి రవికుమార్- ఎ.ఎస్.ఆర్.నగర్ (కడప), పి.పూర్ణానందరావు- నల్గొండ, డి.మోహర్‌గౌతం- పార్వతీపురం (విజయనగరం), ఎ.శ్రీనివాసులు- పోతివరం (గుంటూరు), మోచెర్ల సురేష్- రాజమండ్రి, బి.బర్నబాస్- నెల్లిమర్ల (విజయనగరం), ఎ.తిరుపతి- సామాజిగూడ, బాలస్వామిగౌడ్- వనపర్తి, ఎస్.తాయరు- ఏలూరు (ప॥గో॥జిల్లా), షబాను బాను- కాకినాడ, ఎ.జయలక్ష్మి- గుర్రంపోడ్ (నల్గొండ), జె.వెంకయ్య- కాకినాడ, కె.వి.టి.ప్రింటో- గుంటూరు.

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

శిమ్మ సన్యాసిరావు- రాగోలు (శ్రీకాకుళం), యం.వెంకటేశ్‌చారి- కల్వకుర్తి, యశ్వంరావు శేషగిరిరావు- జైపూర్ (ఒరిస్సా), ఎన్.రఘురామ్- విశాఖపట్నం, ఇ.యమున- రెడ్డిపల్లి (విశాఖపట్నం), యు.లక్ష్మణస్వామి- కల్లూరు(కర్నూలు), పి.నరసింహామూర్తి- హైదరాబాద్, పి.త్రివిక్రమ్‌సాగర్- సూగూర్ (మహబూబ్‌నగర్), యం.హరిశ్చంద్రరెడ్డి- రాజమండ్రి, పి.జయప్రకాశ్- హైదరాబాద్ కె.రాజేశ్వరి- హైదరాబాద్, లక్ష్మిశేషు- సికింద్రాబాద్, డా॥ సయ్యాద్ రహంతుల్లా- పర్లాకిమిడ్ (ఒరిస్సా), సఫియా- వకరేకల్ (నల్గొండ).

రచన : శ్రీశ్రీ గానం:ఘంటసాల,సుశీల,మాధవపెద్ది సత్యం బృందం

మగ : ఉందిలే మంచీ కాలం ముందూ ముందూనా
అందరూ సుఖ పడాలి నందనందనా...
ఆడ : ఉందిలే మంచీ కాలం ముందూ ముందూనా
అందరూ సుఖపడాలీ నంద నందనా...
బృందం:ఉందిలే మంచీ కాలం...ముందూ ముందూనా
అందరూ సుఖపడాలీ నందనందనా ॥ఉందిలే॥
మగ : ఆ....ఆ...ఎందుకూ సందేహమెందుకూ...
రానున్న విందులో నీ వంతూ అందుకో
ఎందుకూ సందేహమెందుకూ...
రానున్న విందులో నీ వంతూ అందుకో
ఆడ : ఆరోజూ అదిగో కలదూ నీ ఎదుటా నీవే రాజువటా...
బృందం:ఆ...ఆ...
ఉందిలే మంచీ కాలం ముందూ ముందూనా
అందరూ సుఖ పడాలి నందనందనా...
ఒకడు: ఏ(విటే(విటే(విటీ? మంచికాలమంటున్నావు...
ఎలా ఉంటుందో అది ఇశిదంగా చెప్పూ...
ఆడ : దేశ సంపదా పెరిగే రోజూ మనిషి మనిషిగా బ్రతికేరోజూ
మగ : దేశ సంపదా పెరిగే రోజూ మనిషి మనిషిగా బ్రతికేరోజూ
ఆడ : గాంధి మహాత్ముడు కలగన్న రోజూ
మగ : నెహ్రూ అమాత్యుడు నెలకొల్పు రోజూ
ఇద్దరూ: ఆ రోజెంతో దూరం లేదూ రండయ్యో
అదిగో చూడు రేపే నేడు చిన్నయ్యో
బృందం:ఆ రోజెంతో దూరం లేదూ రండయ్యో
అదిగో చూడు రేపే నేడు చిన్నయ్యో
ఒకడు: (వచనం) బలే బలే బాగా సెప్పావ్! కానీ అందుకు
మనమేం చెయ్యాలో అదికూడా నువ్వే సెప్పు
మగ : అందరి కోసం ఒక్కడు నిలచి ఒక్కని కోసం అందరు కలసి
ఆడ : అందరి కోసం ఒక్కడు నిలచి ఒక్కని కోసం అందరు కలసి
మగ: సహకారమే మన వైఖరి ఐతే
ఆడ: ఉపకారమే మన ఊపిరి ఐతే
ఇద్దరూ: పేద గొప్పా భేదం పోయి అందరూ
నీది నాదని వాదం మాని ఉందురూ
బృందం:ఆ రోజెంతో దూరం లేదో రన్నయ్యో
అదిగోచూడు రేపే నేడు చిన్నయ్యో
ఆడ: ...ఆ...ఆ...
తీయగా బ్రతుకంతా మారగా
కష్టాలు తీరగా సుఖశాంతులూరగా
మగ: ఆకాశ వీధుల ఎదురే లేకుండా
ఎగురును మన జెండా
బృందం:ఉందిలే మంచీకాలం ముందూ ముందూనా
అందరూ సుఖపడాలి నంద నందనా... ఉందిలే

గానం: మాధవపెద్ది సత్యం

కురు వృద్ధుల్ గురువృద్ధ బాంధవులనేకుల్, చూచుచుండన్ మదో
ద్ధురుడై, ద్రౌపది నిట్లు చేసిన ఖలున్ దుశ్శాసనున్ లోక భీ
కర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘు నిర్ఝర
మూర్వీపతి చూచుచుండ అని నాస్వాదింతు నుగ్రాకృతిన్

గానం: మాధవపెద్ది సత్యం

ధారుణి రాజ్యసంపద మదమున కోమలి కృష్ణజూచి
రంభోరు నిజోరు దేశమున నుండగ బిల్చిన ఇద్దురాత్ము
దుర్వార మదీయ బాహు బల దర్పిత చండ గదాభి ఘాత
భగ్నోరు తరోరు జేయుదు సుయోధను నుగ్రరణాంతరమ్మునన్

రచన : కొసరాజు గానం:ఘంటసాల,మాధవపెద్ది సత్యం

అల్లుడు: తగునా ఇది మామా!తమరే ఇటు బల్క నగున
తగునా ఇది మామా!
నిగమ మార్గములు తెలిసిన నీవే ఇటులనదగునా...
తగునా ఇది మామా!
అల్లుడనగనెవడు మీ అమ్మాయికి మగడూ ॥అల్లుడనగ॥
నీవు కాళ్ళు కడిగి కన్యాదానము చేసిన ఘనుడు
ఆ ఘనుని మీద అలుకబూన ఏటికి చీటికి మాటికి
తగునా ఇది మామా! తమరే ఇటు బల్కనగున
తగునా ఇది మామా!
మామ: ఫోఫోర ఫామ్మికన్ నా గృహమ్మునకు భోజనమ్మునకు
ఇక రావలదు రాతగదు ఛీ పో ఫోఫోర పామ్మికన్
అరెరే ఎంతటి మోసగాడవుర నాకే టోపీ వేసినావుర
అరరే ఎంతటి మోసగాడవుర నాకే టోపీ వేసినావుర
నీ సాహసము పరిహాసము నీ సాహసము పరిహాసము
నిర్భాగ్యుల తోటి సహవాసము
సహించను క్షమించను యోచించను నీ మాటన్
వచ్చిన బాటన్ పట్టుము వేగన్ ఫోఫోర పామ్మికన్
ఫోఫోర పామ్మికన్ నా గృహమ్మునకు భోజనంబునకు ఇక
రావలదు రాతగదు ఛీ ఫో ఫో
అల్లుడు: కొడుకులు లేనందుకు తలకొరివి బెట్టు వాడనే
నీకు కొరివి బెట్టువాడనే డైరక్టుగ
స్వర్గానికి చీటి నిచ్చువాడనే తల్లిలేని పిల్ల ఉసురు
తగలదె ఒంటిగ ఉంచగ తగునా ఇది మామా!...
మామ: అరె ఊరికెల్ల మొనగాడినే ॥ఊరికెల్ల...॥
పెద్ద మిల్లుకెల్ల యజమానినే నీ డాబూ సరి బలే బిత్తరి
నీ డాబుసరి బలే బిత్తరి నిజమేనని నమ్మితి పోకిరి
దురాత్ముడ దుష్టాత్ముడ గర్వాత్ముడ నీచుడా
ఇపుడె తెలిసెన్ నీ కథ ఎల్లన్ ఫోఫోర పామ్మికన్ ఫోఫోర పామ్మికన్
నా గృహంబునకు భోజనంబునకు ఇక రావలదు రాతగదు ఛీ పో ఫో

రచన : సి.నారాయణరెడ్డి గానం: ఘంటసాల, సుశీల

ఆడ: తెలిసిందిలే తెలిసిందిలే
నెలరాజ నీ రూపు తెలిసిందిలే ॥తెలిసిందిలే॥
చలిగాలి రమ్మంచు పిలిచిందిలే
చెలి చూపు నీపైన నిలిచిందిలే ॥చలిగాలి॥
మగ: ఏముందిలే ఇపుడేముందిలే ॥ఏ ముందిలే॥
మురిపించు కాలమ్ము ముందుందిలే నీ ముందుందిలే
ఆడ: ॥తెలిసిందిలే తెలిసిందిలే॥
వరహాల చిరునవ్వు కురిపించవా ॥వరహాల॥
మగ: ఔనందునా కాదందునా
ఔనందునా కాదందునా
అయ్యారె విధిలీల అనుకొందునా అనుకొందునా
ఆడ: ॥తెలిసిందిలేతెలిసిందిలే॥
సొగసైన కనులేమొ నాకున్నవి
చురుకైన మనసేమొ నీకున్నదీ ॥సొగసైన॥
మగ: కనులేమిటో ఈ కథ ఏమిటో ॥కనులేమిటో॥
శృతిమించి రాగాన పడనున్నదీ పడుతున్నదీ
ఆడ: ఆ...ఆ....ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...
మగ: ఆ...ఆ....ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...
ఆ...ఆ....ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...
ఇద్దరు: తెలిసిందిలే తెలిసిందిలే
నెలరాజ నీ రూపు తెలిసిందిలే...

రచన : సి.నారాయణరెడ్డి గానం: ఘంటసాల, సుశీల

ఆడ: అదే అదే అదే నాకు అంతు తెలియకున్నదీ...
ఏదో లాగ మనసులాగు తున్నదీ
అదే అదే అదే ॥అదే నాకు॥
మగ: అదే అదే అదే వింత నేను తెలుసుకున్నదీ...
అదే నీ వయసులోన ఉన్నదీ అదే అదే అదే ॥అదే వింత॥
మగ: నీ నడకలోన రాజహంస అడుగులున్నవీ
నీ నవ్వులోన సన్నజాజి పువ్వులున్నవీ
ఆడ: అహోహో హోహో అహహో హోహో
అహహో ఆ హహోహ హో మగ: ॥నీ నడకలోన॥
ఆడ: ఏమేమి ఉన్నవీ ఇంకేమి ఉన్నవీ ॥ఏమేమి॥
ఈ వేళ నా పెదవులేల వణుకు చున్నవీ
మగ: అదే అదే అదే వింత నేను తెలుసుకున్నదీ
ఆడ: నీ చేయి తాకగానె ఏదో హాయి రగిలెనూ
ఓయీ అని పిలవాలని ఊహ కలిగెను
మగ: అహోహ ఆహ అహోహ ఆహో అహోహ హోహహోహహో
ఆడ: ॥నీ చేయి తాకగానె॥
మగ: ఏమేమి ఆయెను ఇంకేమి ఆయెను ॥ఏమేమి॥
ఈ వేళ లేత బుగ్గలెంత కందిపోయెనూ
ఆడ: అదే అదే అదే అంతు తెలియకున్నదీ
ఏదోలాగ మనసులాగుతున్నదీ
మగ: అదే వింత నేను తెలుసు కున్నదీ అదే నీ వయసులోన ఉన్నదీ
ఇద్దరు: అదే అదే అదే
ఆడ: వింత నేను తెలుసుకున్నదీ

రచన : సి.నారాయణరెడ్డి గానం: ఘంటసాల, సుశీల

మగ: హోయ్ తళుకు తళుకు మని గలగసాగే (2)
తరుణీ ఇటు రావేమే హోయ్ చమకు చమకుమని
చిన్నారి నడకల చేరుకోవేమే
హోయ్ తళుకు తళుకుమని గలగలసాగే తరుణీ
ఆడ: రమ్మనకూ హోయ్ రమ్మనకూ
ఇప్పుడే నను రా రమ్మనకూ హోయ్ రమ్మనకూ
మగ: చీకటి ముసిరే దెన్నడూ నా చేతికి అందేదెన్నడూ
ఆడ: ఊ ఊ ఊ
మగ: హోయ్ సిగ్గులు తొలిగేదెన్నడూ
నీ బుగ్గలు పిలిచే దెన్నడు
ఆమె: హోయ్ కదిలే కన్నులు మూసుకో ॥2॥
మదిలో మగువను చూసుకో ॥రమ్మనకూ ॥
మగ: నిన్నటి కలలో మెత్తగా
నా నిద్దుర దోచితి వెందుకూ
ఆడ: ఆ ఆ ఆ
మగ: హోయ్ మొన్నటి కలలో మత్తుగా
కనుసన్నలు చేసితి వెందుకూ
ఆడ: అంతకు మొన్నటి రాతిరీ ॥ అంతకు ॥
గిలిగింతలు మొదలైనందుకూ ॥ రమ్మనకూ॥
మగ: హోయ్ తళుకు తళుకు మని గలగసాగే (2)
తరుణీ ఇటు రావేమే హోయ్ చమకు చమకుమని
చిన్నారి నడకల చేరుకోవేమే
హోయ్ తళుకు తళుకుమని గలగలసాగే

రచన : కొసరాజు గానం:ఘంటసాల,సుశీల బృందం

మగ: ఓ
మగ బృందం: హోహో హోహో
ఆడ: ఓ ఓ
ఆడ బృందం: ఒహోహోహో హోహ
మగ: హోయ్ దేశమ్ము మారిందోయ్... కాలమ్ము మారిందోయ్
బృందం: ॥దేశమ్ము॥
మగ: కష్టాలు తీరేనోయ్ సుఖాలు నీవేనోయ్
బృందం: ॥కష్టాలు॥ ॥దేశమ్ము॥
మగ: కొండలు కొట్టి మగ బృందం: కొట్టి
మగ: డాములు కట్టి మగ బృందం : కట్టి
మగ: నీళ్లను మలిపి బృందం: మలిపి
మగ: చేలను తడిపి బృందం: తడిపి
ఆడ: మురిసే పచ్చని రోజు మనకూ వస్తుందోయ్ వస్తుంది.
బృందం: దేశము మారిందోయ్...
కాలమ్ము మారిందోయ్॥2॥
మగ: ఓ ఓ ఓ
కండల్ని కరగదియ్యి మగబృందం: దియ్యి
బండల్ని విసరి వెయ్యి బృందం:వెయ్యి
నీదేలె పైచేయి బృందం : ॥కండల్ని॥
ఆడ: భాగ్యాలు పండునోయీ పాతళ్ళు నిండునోయీ
ఆడబృందం: ॥భాగ్యాలు॥
ఆడ: సిరులూ చిందునోయీఆశలుఅందునోయి
ఆడబృందం: ॥సిరులూ॥
ఆడ: చేయి చేయి గలపాలి రావయ్యా బావయ్యా
ఆడబృందం: దేశమ్ము మారిందోయ్
మగబృందం: కాలమ్ము మారిందోయ్.....
మగ: గ్రామాల బాగు చెయ్యి మగ బృందం : చెయ్యి
మగ: దీపాల వెలుగునియ్యి మగ బృందం: నియ్యి
ఆడ: జేజేలు నీ కోయి
మగబృందం: గ్రామాల బాగుచెయ్యి
మగబృందం: చెయ్యి
మగ బృందం: దీపాల వెలుగు నియ్యి
మగ బృందం : నియ్యి
ఆడ బృందం : జేజేలు నీకోయీ
మగబృందం: గ్రామాల బాగుచెయ్యి
ఆడబృందం: చెయ్యి
మగ బృందం: దీపాల వెలుగు నియ్యి
ఆడ బృందం : నియ్యి
మగ బృందం : జేజేలు నీకోయీ
మగ: చిట్టి చీమలన్ని పెద్ద పుట్ట పెట్టు బృందం : కదా కదా
మగ: ఎందరో తమ రక్తాన్ని చిందించిరి బృందం : కదా కదా
ఆడ: అక్రమాలకు అసూయలకు ఆనకట్ట ఇదే ఇదే
బృందం: ॥అక్రమాలకు॥
మగ: త్యాగమంటె ఇదే ఇదే బృందం: ఇదే ఇదే ఇదే ఇదే
మగ: ఐకమత్యమిదే ఇదే బృందం: ఇదే ఇదే ఇదే ఇదే
ఆడ: అనుభవమ్ము నీదే నోయీ ఆనందం నీదేనోయీ
బృందం: ॥అనుభవమ్ము॥
ఆడ: నిజమౌ శ్రమ జీవివంటే నీవెనోయ్ నీవేనోయ్
బృందం: దేశమ్ము మారిందోయ్ కాలమ్ము మారిందోయ్
మగ: దేశమ్ము మారిందోయ్
బృందం: దేశమ్ము మారిందోయ్
మగ: దేశమ్ము మారిందోయ్
బృందం: దేశమ్ము మారిందోయ్
మగ: దేశమ్ము మారిందోయ్
బృందం: దేశమ్ము మారిందోయ్

రచన : కొసరాజు  గానం: మాధవపెద్ది సత్యం, జమునారాణి

మగ: సరదా సరదా సిగిరెట్టూ ఇది దొరల్ తాగుబల్ సిగిరెట్టు... ॥2॥
పట్టుబట్టి ఒక దమ్ములాగితే స్వర్గానికే ఇది తొలి మెట్టూ ॥సరదా॥
ఆడ: వా కంపు గొట్టు ఈ సిగరెట్టూ దీన్ని కాల్చకోయి నాపైఒట్టూ ॥కంపు॥
కడుపు నిండునా కాలునిండునా వదిలి పెట్టవోయ్ నీ పట్టూ ॥కంపు॥
మగ: ఈ సిగరెట్టుతో ఆంజనేయుడు లంకా దహనం చేసాడూ
ఆమె: హో ఎవడో కోతలు కోశాడు
మగ: ఈ పొగతోటి గుప్పుగుప్పున మేఘాలు సృష్టించవచ్చూ
ఆమె: మీసాలు కాల్చుకోవచ్చూ
మగ: ॥అ... సరదా॥
ఆమె: ఊపిరి తిత్తుల కాన్సరు కిదియే కారణమన్నారు డాక్టర్లు
మగ: కాదన్నారులే పెద్ద యాక్టర్లు
ఆమె: పసరు పేరుకొని కఫము చేరుకొని ఉసురు తీయు పొమ్మన్నారూ
మగ: దద్దమ్మలు అది విన్నారూ
ఆడ: హో ॥కంపు॥
మగ: పక్కనున్న వాళ్ళీ సువాసనకు ముక్కులు ఎగరేస్తారు
ఆడ: వాఁ
మగ: నీవెరుగవు దీని హుషారు
ఆడ: అబ్బో థియేటర్లలో పొగ తాగడమే నిషేధించినారందుకే
మగ: కలక్టర్లు లేవందుకే ॥సరదా॥
ఆడ: ॥కంపుగొట్టు॥
మగ: కవిత్వానికి ఈ సిగరెట్టూ కాఫీకే ఇది తోబుట్టు
ఆడ: పైత్యానికి ఈ సిగరెట్టూ బడాయికిందా జమకట్టూ
మగ: ఆనందానికి సిగరెట్టూ ఆలోచనలను గిలగొట్టూ
ఆడ: పనిలేకుంటే సిగరెట్టూ తిని కూర్చుంటే పొగబట్టూ
మగ: రవ్వలు రాల్చే రాకెట్టూ రంగు రంగులా పాకెట్టూ
ఆడ: కొంపలు కాల్చే సిగరెట్టూ దీని గొప్ప చెప్ప చీదరబుట్టూ
మగ: ॥సరదా॥
ఆడ: ॥కంపుగొట్టు॥

రచన : కొసరాజు  గానం: ఘంటసాల

పో మామ పొమ్మికన్ ! ఫోఫో మామ పొమ్మికన్
నా సమీపమున కిక రా వలదు - రా తగదు ॥పోమామ॥
అల్లాటప్పగ నెంచితివా - నన్నాకతాయిగా తలచితివా
ఏమనుకొంటివి - అపుడేమంటివి
కన్ను మిన్నూ గానక - ఛీ అంటివి
విసిగించకు - వేధించకు - బాధించకు మింకన్
చెప్పిన మాటన్ - చేయుము వేగన్ - పో బాల
ఛీ ! ఛీ ! పోమామ ! పొమ్మికన్ ! ఫోఫో !

## కథాసంగ్రహం

రాముడు (ఎన్.టి.రామారావు) జమిందారు బిడ్డ. ఐశ్వర్యం వుందిగాని అనుభవించే రాతలేదు. తల్లి చిన్నప్పుడే పోయింది. తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకుని కొన్నాళ్ళకు చనిపోయాడు. ఆస్తి మీద అజమాయిషీకి - సవతితల్లి సోదరుడు - పానకాలరావు (రాజనాల) వచ్చాడు. రాముడి అక్క సుశీల(శాంతకుమారి)ను పెళ్ళి చేసుకున్నాడు. తన విలాసాల కోసం రాముడి ఆస్తిని దుర్వినియోగం చేస్తున్నాడు. రాముణ్ణి బయట మొఖం చూడకుండా అంతులేని భయంతో పెంచాడు. కాస్తకూ కూస్తకూ బావ చేతిలో రాముడికి కొరడాదెబ్బలు ! అక్క సుశీలగూడ అసహాయ స్థితిలోనే వుంది.

భీముడు(ఎన్.టి.రామారావు) పల్లెటూరివాడు. తల్లి(ఋష్యేంద్రమణి)కి ఒక్కడే కొడుకు. నాటకాలంటే పిచ్చి! మంచి నటుడు! నాటక పోటీలలో బహుమతులు గూడా పొందాడు. సినిమా పిచ్చి పట్టింది. తల్లి మాటగూడా వినకుండా - తప్పించుకుని మద్రాసుకు ప్రయాణమైనాడు.

రాముడికి పెళ్ళి చేయాలనుకున్నాడు పానకాలరావు. ఆ మిషతో కొంత డబ్బు రాబట్టవచ్చునని - మద్రాసులో ఒక ధనికుడు రంగనాథం (ఎస్వీ రంగారావు) ఏకైక పుత్రిక లీల (జమున)ను రాముడికిచ్చి చేయాలని సంకల్పం! లీల, ఆమె తండ్రి పిల్లవాణ్ణి చూడడానికి వచ్చారు. రాముడి వాలకం బెరుకుతనం లీలకు నచ్చలేదు.

రాముడికి గూడ చదువుకున్న పిల్లంటే భయమే! కాని బావ మాటకు ఎదురుచెప్పలేదు. లీల తండ్రి గూడ కూతురికి నచ్చచెప్పజూచాడు గాని - ఆమె వినేటట్టులేదు.

దీనికి తోడు - రాముడికి మరో సంకటం వచ్చి పడింది. పెళ్ళి అయిన తరువాత మామ అల్లుళ్ళు ఏకమై తనకు నామం పెట్టవచ్చునని భయపడి, పానకాలరావు రాముడితో ఆస్తి తన పేర కొంత, తన అక్క పేర కొంత వ్రాయించుకోవాలని ఏర్పాట్లు చేస్తుంటాడు.

రాముడికి ఏమీ పాలుపోదు, అసలు పెళ్ళే యిష్టంలేదు. పైగా ఆస్తి అంతా బావ రాయించుకుంటే యిక తన గతి? - అక్కకు చెప్పి ఆమె మట్టుకు ఏ జేయగలదు? -

అర్ధరాత్రివేళ రాముడు యిల్లు విడిచి పారిపోతాడు.

మద్రాసు చేరతాడు. సినిమాలలో వేషాల కోసం భీముడు గూడ మద్రాసు చేరతాడు.

లీల బజారులో ఏవో కొనటానికి వస్తుంది. ఆమె చేతిసంచి ఒక దొంగ కొట్టేసి పారిపోతుంటే - భీముడు వెంటబడి పట్టుకుంటాడు. దొంగతో ముష్టియుద్ధం చేస్తాడు. లీల ఆశ్చర్యచకితురాలవుతుంది. భీముణ్ణి చూసి రాముడనుకుని - ఆనాడు పెళ్ళి చూపులనాడు - అమాయకంగా నటించి తనను మోసం చేశాడనుకుంటుంది. ఇంటికి తీసుకెళుతుంది. తెచ్చుకున్న డబ్బు అయిపోయి, తిండికే బాధ పడుతున్న భీముడు - ఆ రోజు లీల ఇంట్లో సుష్టుగా భోంచేస్తాడు. లీల అతనిపై తన ప్రేమ ప్రకటిస్తుంది. భీముడు సందిగ్ధంలో పడతాడు.

మరునాడు ఉదయం - రాముడి కోసం వెతుకుతున్న పానకాలరావు లీల ఇంటికి వచ్చి భీముణ్ణి చూచి - రాముడనుకొని - ఇంటికి రమ్మంటాడు. భీముడికిదేమీ అర్థంగాదు. పానకాలరావు వాలకం చూచి - భీముడు దారిలో ఎలాగో అతని చేతుల్లోంచి తప్పించుకుని పారిపోతాడు.

అలా పారిపోయి తన నాటకాల స్నేహితుడు, ఉత్తమ హాస్యనటుడు - జయరాంను కలుసుకుంటాడు.

జయరాం(రేలంగి) ఒక సంకటస్థితిలో యిరుక్కుని వున్నాడు. తనకి ఏదో కంపెనీలో ఉద్యోగమని అబద్ధమాడి - ఒక ముసలాయన(రమణారెడ్డి) ఏకైక పుత్రిక (గిరిజ)ని వివాహమాడాడు. అబద్ధం బయటపడే స్థితి వచ్చినప్పుడు ఇదుగో! మా కంపెని యజమానిని తీసుకు వస్తానని వచ్చాడు. భీముడు ఒక సలహా చెబుతాడు. తానే ఆ కంపెనీ యజమానినని బొంకమంటాడు. ప్లాను బాగానే వుందని, ఇద్దరూ జయరాం మామగారింటికి వెళతారు.

ఆ మామగారు ఎవరోగాదు. రాముడి ఎస్టేటులో మేనేజరు. పానకాలరావు భృత్యుడు. భీముణ్ణిచూచి - ఆయనగూడా రాముడనుకొని పాలకాలరావుకు వప్పజెబుతాడు. పానకాలరావు భీముణ్ణి ఇంటికి లాక్కెడతాడు.

ఇంటికి వెళ్లగానే - భీముడు అక్కడ కథంతా గ్రహిస్తాడు. పానకాలరావు బాధలు పడలేక రాముడనే వ్యక్తి పారిపోయాడని అర్థమవుతుంది. పానకాలరావుకి గుణపాఠం నేర్పాలని నిశ్చయించుకుంటాడు. అంతకంటే - రాముడు కోసం బెంగ పెట్టుకున్న అతని అక్క సుశీల - ఆమె కొడుకు రవి - ఇద్దరి దీనస్థితి చూచి జాలిపడతాడు. తను రాముడుగానే అక్కడ ఉండిపోతాడు.

పానకాలరావు మరునాడు వ్రాతకోతలకు ఏర్పాట్లు చేస్తాడు. భీముడు నిరాకరిస్తాడు. భీముడికి పానకాలరావుకి ముష్టియుద్ధం దాకా వస్తుంది. పానకాలరావు విస్తుబోతాడు. రాముడి కాబోయే మామ రంగనాథం అల్లుడికి పురి ఎక్కించి ఉంటాడని అనుకొని, ఎత్తుకు పై యెత్తు వేసి పని సాధించుకోవాలనుకొంటాడు. భీముడితో రాజీకి దిగుతాడు.

తన తమ్ముడి ధైర్య సాహసాలకు సుశీల విస్తుబోతుంది. భీముడు ఒక కథ అల్లుతాడు. ఎవరో గోసాయి తనకు తాయిత్తు కట్టాడని - దానితో

తను పూర్తిగా మారిపోయానని చెబుతాడు.

ఇక రాముడి సంగతి ! మారువేషంలో అటూ ఇటూ తిరిగి చివరికి భీముడి ఊరు చేరతాడు. గ్రామస్థులు అతణ్ణి భీముడనుకొని పట్టుకెళ్ళి - భీముడి తల్లి వెంకమ్మకు వప్ప జెబుతారు. రాముడు తను భీముణ్ణి కాదని చెబితే - వాడి మతిపోయిందని - భూతవైద్యాలు చేయిస్తారు. ఆ బాధలు పడలేక - రాముడు తను భీముడేనని ఒప్పుకొని - అక్కడే తోటి కూలీలతో పని పాటలకు నాగార్జున సాగరం వద్దకు వెళ్ళిపోతాడు.

అక్కడ శాంత (ఎల్.విజయలక్ష్మి) అనే పిల్లతో పరిచయమై, క్రమంగా పరిచయం ప్రణయంగా మారుతుంది.

శాంత బీదపిల్ల. ఆమెకు ఒక ముసలి అవ్వ (హేమలత) వున్నది. ఆమె మతి భ్రమించిన స్థితిలో ఉంటుంది. రాముణ్ణి చూడగానే ఎందుకో ఆమెలో పరివర్తన వస్తుంది. క్రమంగా ఆమె ఆరోగ్యం కోలుకుంటుంది.

రంగనాథం తన కూతురు పెళ్ళి జరిపించాలని, భీముడి దగ్గరకు వస్తాడు. కాని భీముడు సందిగ్ధంలో పడతాడు. తన నిజ స్వరూపం బయట పడితే - లీల ఆశాభంగం చెందుతుంది. ఆమె జీవితమే నాశనం అవుతుంది. అందువల్ల ఏవో సాకులు చెప్పి - పెళ్లి ఏడాది దాకా వాయిదా వేస్తాడు. లీల చిన్నబుచ్చుకుంటుంది.

ఏదో పనిమీద - లీల - రంగనాథం నాగార్జున సాగరం వచ్చి రాముడు శాంతతో చనువుగా వుండడం చూస్తారు. తనను మోసం చేస్తున్నాడని - లీల - అసలు విషయం శాంతతో చెబుతుంది. తాను పేదవాణ్ణని బొంకిన రాముడు - ఇప్పుడు తాను జమిందారు బిడ్డనని ఒప్పుకోక తప్పలేదు. కాని లీలను మాత్రం తాను పెళ్లాడతానని మాట యివ్వలేదని చెబుతాడు. దానితో లీల భగ్న హృదయంతో వెళ్ళిపోతుంది. శాంత రాముణ్ణి అపార్థం చేసుకుని వెళ్లిపొమ్మంటుంది.

అక్కడ భీముడికి, పానకాలరావుకి ఘర్షణ పెరిగి - చివరికి పానకాలరావు తన భార్యను వదిలేసి, అక్కతోనూ, కొడుకుతోనూ వేరే ఇంట్లో కాపరం పెడతాడు.

సుశీలకు అన్యాయం జరిగిందని గ్రహించిన భీముడు - తాను పోతే తప్ప సుశీల కాపురం కుదుటపడదని వెళ్లిపోవడానికి నిశ్చయించుకుంటాడు. తాను రాముణ్ణి కాదని - నిజం బయట పెడుతూ ఒక ఉత్తరం వ్రాసి - సుశీల పక్కలో పెట్టి వెళ్ళిపోతాడు.

ఈ విషయం తెలిసి - పానకాలరావు భీముడు కోసం వెతుకుతాడు.

అదే సమయానికి - రాముడు ఇంటికి వస్తుంటాడు. భీముడనుకొని రాముణ్ణి పట్టుకుని బంధించి - అతన్ని చంపడానికి ప్రయత్నిస్తాడు. ఈలోగా శాంత ముసలి అవ్వకు పిచ్చిపోయి పూర్వపు జ్ఞాపకాలు తిరిగొస్తాయి. రాముడు భీముడు కవల పిల్లలేనని, చిన్నతనంలో తన అజాగ్రత్త వల్లనే భీముడు తప్పిపోయాడని, చెబుతుంది. ఈ విషయం తెలుసుకున్న భీముడు పట్నం వెళ్లి పానకాలరావు చేతిలో చిక్కుకున్న రాముణ్ణి విడిపించి ముసలి అవ్వ చెప్పిన కథంతా తన అక్క సుశీలకు, మిగిలిన కుటుంబ సభ్యులకు తెలియజేస్తాడు.

మొత్తం అంతా ఒకరికొకరు కావలసిన వారే అవడంతో గతంలో జరిగిన తప్పులన్నీ సద్దుకుని అందరూ ఒకటవుతారు. రాముడికి శాంతతోను, భీముడికి లీలతోను పెళ్లి జరుగుతుంది.

శుభం

## తారాగణం

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఎన్.టి.రామారావు | జమున | రాజనాల | శాంతకుమారి | రమణారెడ్డి | సూర్యకాంతం |
| ఎస్.వి.రంగారావు | ఎల్.విజయలక్ష్మి | రేలంగి | గిరిజ | ఋషేంద్రమణి | హేమలత(స్ట్) |

## టెక్నీషియన్లు

| | | |
|---|---|---|
| కథ, మాటలు | : | డి.వి.నరసరాజు |
| పాటలు | : | కొసరాజు,శ్రీశ్రీ, సి.నారాయణరెడ్డి |
| కెమేరా | : | అన్నయ్య |
| సంగీతం | : | పెండ్యాల |
| కళ | : | రాజేంద్రకుమార్ |
| దుస్తులు | : | వి.యస్.గాంధి |
| మేకప్ | : | పీతాంబరం, నాగేశ్వరరావు, పోతరాజు, సత్యం, సురేష్‌బాబు |
| డ్యాన్సు | : | చిన్ని - సంపత్ |
| ఎడిటింగ్ | : | మార్తాండ్ |
| సాంగ్సు రికార్డింగ్ | : | జీవా, శివరాం, రంగస్వామి |
| సౌండ్ | : | కె.హరనాథ్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : | కె.చెంచురామయ్య |
| ఆఫీసు ఇన్‌ఛార్జి | : | జి.రాజేంద్రప్రసాద్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : | వైకుంఠం, బి.ఏ. |
| స్టంట్ | : | సాంబశివరావు |
| ఆపరేటివ్ కెమేరా | : | పోలు భాస్కరరావు |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : | అప్పారావు - బాపయ్య |
| **సహాయకులు** | | |
| డైరెక్షన్, ఎడిటింగ్ | : | ఆత్మాచరణ్ |
| కెమేరా | : | మాధవరెడ్డి, దొమ్మేటి |
| సౌండ్ | : | మధుసూదనరావు |
| మేకప్ | : | సుబ్రహ్మణ్యం |
| దుస్తులు | : | ఖాదర్, చిట్టి |
| కళ | : | దిలీప్‌సింగ్ |
| సంగీతం | : | రామారావు |
| స్టూడియో | : | విజయా కంబైన్స్ |
| పబ్లిసిటీ | : | విజయా పబ్లిసిటీస్, విజయవాడ |
| **నిర్మాత** | : | **డి.రామానాయుడు** |
| **దర్శకత్వం** | : | **చాణక్య** |


డి.రామానాయుడు


చాణక్య


పెండ్యాల


శ్రీశ్రీ


కొసరాజు


సి.నారాయణరెడ్డి


ఘంటసాల


మాధవపెద్ది సత్యం


సుశీల


జమునారాణి




తెలుగువారందరూ గుర్తుంచుకోదగ్గ సంగీత దర్శకుడు, సినీ సంగీత ప్రియులెవ్వరూ మరచిపోలేని స్వరకర్త-పెండ్యాల నాగేశ్వరరావు. 'మాఘంటసాల' అంటూ ఘనంగా చెప్పుకునే వారంతా ఆ ఘంటసాల కు ఘన కీర్తిని కట్టపెట్టిన ప్రతిష్టాత్మక గీతాలు రెండూ (రసికరాజు,శివ శంకరీ)స్వరపరిచింది పెండ్యాలే అని జ్ఞప్తికి తెచ్చుకుంటే చాలు. ఒక్క తెలుగు వారే కాక దక్షిణాది లోని ఇతర ప్రాంతీయ భాషలకు సంబంధించిన సినీ సంగీతాభిమానులు కూడా ఎంతగానో ఆదరించిన గాయనీమణులు సుశీల, జానకి, వసంత చేత తొలిసారి తెలుగులో పాడించినదీ పెండ్యాలే...! ఆత్రేయ తొలి గీతం 'దీక్ష' చిత్రంలో 'పోరాబాబు పో' స్వరపరించిందీ పెండ్యాలే. వేటూరిని సినీ పరిశ్రమకు పరిచయం చేసిన 'సిరికా కొలను చిన్నది' రూపకాన్ని స్వరపరిచింది కూడా పెండ్యాలే, అంతటి హస్త 'వాసి' గల స్వరకల్పనా ధురీణుడాయన. ఆయన సంగీత దర్శకత్వం వహించిన చిత్రాలలో ఒకటి...




1960లో విడుదలైన ఈ చిత్రం గుర్తున్నవాళ్ళు ఇవాళ చాలా తక్కువ మంది ఉంటారు. అందులో నటించిన ఎన్.టి.ఆర్., అంజలి, కాంతారావు, ఎస్వీ.రంగారావు గురించి కొద్దిపాటి జ్ఞాపకంతో కొందరు చెప్పగలిగినా ఆ చిత్రానికి దర్శకుడు ఎవరో, మాటలూ - పాటలూ రాసిందెవరో నూటికి తొంభైమంది చెప్పలేరు. అయినా -'భట్టి విక్రమార్క' అనగానే 'ఓ...నెలరాజా వెన్నెల రాజా పాట కదూ!?అని 'అందరూ' అంటారు. అదీ పెండ్యాల అంటే...! జంపన దర్శకత్వంలో, అనిసెట్టి మాటలూ- పాటలూ రాసిన ఈ చిత్రంలో... పాటలెన్ని వున్నా ఇప్పటికీ శ్రోతల స్మృతిపథంలో వున్న ఓ రెండు పాటల గురించి, ఆ స్థానంలో చేర్చదగిన మరో రెండు గీతాల గురించి ఈ సంచికలో...

నటించనా జగాలనే జయించనా
రసిక హృదయాలె తపించగ ॥నటించనా॥
పలుకే కమ్మని గానమయేనో
నా కులుకే తీయని సోనలయేనో
ఆ...ఆ...ఆ...ఆ...ఆ... ॥నటించనా॥
హావభావాల అభినయమందు
నా అందములే కనువిందు
చరణ చలంచన స్వరముల పిలుపు
తరుణ జనాళి శృతికలుపు
ఆ..ఆ...ఆ...ఆ.. ॥నటించనా॥





ఈ పాటను సుశీల,లీల పాడగా రాజరాజేశ్వరి, జ్యోతి నృత్యాభినయాన్ని అందించారు. రంభ, ఊర్వశిలలో ఎవరు ఉత్తమ నర్తకి అనే వివాదాన్ని పరిష్కరించడానికి దేవేంద్రుడు, దేవతలు, దేవర్షులు మొదలైనవారు భూలోకం నుండి విక్రమార్కుని రప్పించగా అతని ముందు రంభ,ఊర్వశి ప్రదర్శించిన నృత్య గీతమే యిది. దేవేంద్రునిగా మిక్కిలినేని, విక్రమార్కునిగా ఎన్.టి.ఆర్, తక్కిన పాత్రలలో ఉప పాత్రధారులు సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. ఈ పాటని నటభైరవి రాగంలో స్వరపరిచారు పెండ్యాల. జావళీ సంప్రదాయానికి సంబంధించి - తెలుగు సినీ సంగీత చరిత్రలో అతి తక్కువగా వున్న గీతాలలో - చేర్చదగిన గీతమిది. అంతేకాదు నటభైరవి రాగంలో ఒక ప్రామాణిక గీతాన్ని అందించినందుకు పెండ్యాలకు సినీ శ్రోతలు కృతజ్ఞతలు చెప్పుకోవాలి కూడా!

ఆమె: ఓ...నెలరాజా వెన్నెల రాజా
నీ వన్నెలన్ని చిన్నెలన్ని
మా కేలోయ్
మా వెన్నుతట్టి పిలిచింది
నీవేనోయ్... ॥ఓ నెలరాజా॥
చల్లగాలి జాడలో
తెల్లమబ్బు నీడలో
అతడు: ఓ ఓ ఓ
ఆమె: చల్లగాలి జాడలో
తెల్ల మబ్బు నీడలో
కొంటె చూపు నీకేల చంద్రుడా
నా వెంటనంటి రాకోయి చంద్రుడా ॥ఓ నెలరాజా॥
అతడు: కలువల చిరునవ్వులే కన్నెల నునుసిగ్గులే
ఆమె: ఓ ఓ ఓ
అతడు: కలువల చిరునవ్వులే
కన్నెల నునుసిగ్గులే
వెంటనంటి పిలిచినపుడు చంద్రుడా
వాని విడువ మనకు తరమౌనా చంద్రుడా ॥ఓ నెలరాజా॥
ఆమె: లేత లేత వలపులే
పూత పూయువేళలో
కలవరింత లెందుకోయి చంద్రుడా
నా చెలిమి నీది కాదటోయి చంద్రుడా ॥కలవ॥
ఇద్దరు: ఓ నెలరాజా వెన్నెల రాజా







'ఓ నెలరాజా' సుశీల,ఘంటసాల, పాడగా అంజలీదేవి, ఎన్టీఆర్ అభినయించారు. సినిమా పాటలకు సంబంధించినంత వరకూ భీంప్లాస్ రాగాన్ని, ఉదయ రవిచంద్రిక రాగాన్ని - విడివిడిగానూ, కలివిడిగానూ ఎందరో సంగీత దర్శకులు ఎంతగానో వాడుకున్నారు. కానీ కొందరు ఉదయరవి చంద్రికలో పడాల్సిన 'సగమపనిస-సనిపమగస'స్వరాలతో పాటు 'రి' అన్న స్వరాన్ని వేస్తుంటారు. అలాగే భీంప్లాస్ రాగంలో పడాల్సిన 'సగమపనిస-సనిదపమగరిస' బదులు 'ద' అన్న స్వరాన్ని వర్జించి స్వరపరుస్తూ ఉంటారు. దాంతో చాలా పాటల రాగాల గురించి - ఇవ్వాళ సినిమా డైలాగ్‌లా చెప్పాలంటే - ఉదయ రవి చంద్రికకి ఎక్కువ భీంప్లాస్‌కి తక్కువ అని అనాల్సి వస్తుంది. కానీ పెండ్యాల విషయం కొస్తే మటుకు భీంప్లాస్ రాగం సర్వలక్షణ సమన్వితమై ఆయన పాటల్లో వినిపిస్తూ ఉంటుంది. అటువంటి పాటల్లో ఈ పాటను చేర్చుకుని తీరాలి. ఈ పాటను బాగా ఆకళింపు చేసుకుని - 'వాగ్దానం' చిత్రంలోని 'నా కంటి పాపలో నిలిచిపోరా' పాటని, 'బావామరదళ్ళు' చిత్రంలోని 'నీలి మేఘాలలో గాలి కెరటాలలో' పాటతో పోల్చుకుంటూ ఒక్కసారి మనసులో ఆలపించుకుంటూ చూడండి. మూడూ ఒకే తాను లోంచి వచ్చిన ఓణీల్లాగ ఒకే ట్యూనులోంచి వచ్చిన బాణీల్లాగ ఉంటాయి. ఈ పాటలోని మొదటి రెండు చరణాల ట్యూన్ ఒకలా ఉంటే మూడవ చరణం మొదటి రెండు పాదాల ట్యూన్ తొలి చరణాలలాగే ఉండటం, చివరి రెండు పాదాల ట్యూన్ మరోలా ఉండటం - వైవిధ్యానికి పెద్దపీట వేసే పెండ్యాల రసజ్ఞతకు ఓ చిన్ని ఉదాహరణ మాత్రమే.

కొమ్ములు తిరిగిన మగవారు
కొంగు తగిలితే పోలేరు
మా కొంగు తగిలితే పోలేరు ॥కొమ్ములు॥
కత్తులు దూసే మగవాడు
ఎత్తులే వేసే మొనగాడు
గాజుల గలగల
గజ్జెల ఝుణఝుణ ॥గాజుల॥
విన్నాడంటే తిన్నాడే
కన్నెకు దాస్యం చేశాడే ॥కొమ్ములు॥
కన్నులు సైగలు చేశాయంటే
పెదవులు నవ్వులు విరిశాయంటే
ముదుసలియైనా ముచ్చటపడునే
పడుచుదనమ్మే కోరునులే
ప్రణయంలో పడిపోవునులే ॥కొమ్ములు॥
పడతుల తీయని కౌగిలిలో
ప్రభువైనా పసిబాలుడనే
మంచిని చెడుగా చెడుని మంచిగా
మార్చే శక్తి ఆడయుక్తి
ఆడువారిదే ఈ జగతి ॥కొమ్ములు॥








'కొమ్ములు తిరిగిన మగవారు' పాటను జిక్కి పాడగా నృత్యతార కుచలకుమారి అభినయించింది. ఈ పాట జానపద బాణీలో ఉంటుంది కనక హరికాంభోజి రాగాన్ని ఎక్కువగా ఆశ్రయించవలసి వచ్చింది. ఇది ఇలా ఉండగా 'రోజులు మారాయి' చిత్రంలోని 'ఏరువాకా సాగారో' పాట ప్రభావం తరువాత వచ్చిన ఎన్నో పాటలపై పడక తప్పలేదని ఈ పాట ఋజువు చేసింది. ఆ పాటను స్వరపరచిన మాస్టర్ వేణు కూడా 'రాజమకుటం' చిత్రంలో 'ఏటి ఒడ్డునా మా ఊరు' పాటను ఆ ధోరణిలోనే స్వరపరచవలసివచ్చింది. ఈ 'కొమ్ములు తిరిగిన మగవారు' పాటను నడిపించిన విధానాన్ని చూస్తే సరిగ్గా అటువంటి పరిస్థితే పెండ్యాలకీ వచ్చిందనిపిస్తుంది. ఇది ఇలా ఉండగా 'ఇల్లరికం' లోని 'భలే ఛాన్సులే'పాట గుర్తుంటే 'దూషణ భూషణ తిరస్కారములు ఆశీనులుగా తలచేవాడికి' అనే లైను, ఆ పాటలోనే 'ఛీ ఛా యన్నా చిరాకు పడక దులపరించుకుని పొయ్యే వాడికి' అనే లైను, వీటికి జత పడ్డ ట్యూన్‌లు ఈ 'కొమ్ములు తిరిగిన మగవారు'పాటలో గుర్తొస్తే ఇవన్నీ జానపద బాణీలపై ఆధారపడినవి కనుక ఈ పోలిక సంభవించిందని అనుకోవాలి. జానపద ధోరణలో స్వరరపరచిన పాటలలో ఈ పాటి పోలిక తప్పదనడానికి మరో ఉదాహరణ కనుక తీసుకుంటే - ఎ.ఆర్.రెహమాన్ స్వర పరచగా విడుదలైన 'నరసింహ' చిత్రంలో 'చుట్టూ చుట్టీ వచ్చావా'పాట బిగినింగ్ ఈ 'కొమ్ములు తిరిగిన మగవారు'పాట మొదటి లైను ట్యూన్ పరంగా ఒక్కలా ఉండటమే.

మనసార ప్రేమించినారా ॥2॥
మరుకేళి తేలింపవేరా ॥మనసార॥
మారుడు తానెంత క్రూరుడు గాకున్న ॥2॥
మగువల మంత్రించి వంచించునా
మారుని వంచింప ॥2॥
విరహము వారింప ॥మారుని॥
రారా బిరాన కుబేర సమాన ॥మనసార॥
రారా నే పిలచిన లోకువ లేరా
నీకిది మరియాదర పోరా
నీ పంతమె నా చెంతను సాగింతువ
ఆ కంతుని సామంతుని కావింతుము
బలే బలే రసపిపాసీ
ఇదా సరసమిదా సమయమిదా వరస
రసహృదయమిది కదర సరసము ॥మనసార॥
1. దనిస పదనిదమప రిగమ ॥మనసార॥
2. రిగరి నినిరిదదని దపద రిగమప ॥మనసార॥
3. పదని... పదని... దసనిదపమపా రిగమపా
సనిద పమపా - నిదా
రిసని దపదా - సనీ
రిగరిసనిసా
సరిసనిదనీ
నిసనిదపదా
సనిదపా
సగరి రిగసా దపమా మదపా పనిద దసని
నిరిసా సగరీ
పదపగరి నిసరిసని పదపమప ॥మనసార॥



ఈ పాటను సుశీల, ఏపి కోమల పాడగా మాంత్రికుడైన ఎస్వీ రంగారావు ముందు లలితారావ్ (బి.ఏ.), పద్మినీ ప్రియదర్శిని నృత్యం చేస్తూ అభినయించారు. వీణ వాయిస్తూ సంధ్య, బంధించబడ్డ రాణిగా అంజలీదేవి కూడా సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. సంధ్యని తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత తల్లిగా ఈ తరం వారికి పరిచయం చేయక తప్పదు. ఈ పాటను తిల్లంగ్ రాగంలో స్వరపరిచారు. ఇది హిందుస్థానీరాగం. ఈ రాగం మన కర్ణాటక సంప్రదాయంలో లేదు. ●

